## సచిత్ర విచిత్రం



# ఆ చిలక వయసు 103 ఏళ్లు!

ఇంగ్లాండులోని ఒక చిలక వయస్సు 103 సం.రాలు. అతి ఎక్కువకాలం జీవించిన రామచిలుక అదే! నీలంరంగు, బంగారపు రంగులో ఇది అందంగా ఎంతో ముచ్చట గొలుపుతూ ఉంటుంది. ఆ వన్నెచిన్నెల విహంగం పేరు ఛార్లీ. ఈ ఛార్లీకి అనేకమంది యజమానులున్నారు.

బ్రిటిష్ ప్రధాని చర్చిల్ దాని యజమానుల్లో ఒకరు. 1937వ సంవత్సరంలో చర్చిల్ ఛార్లీని తన నివాస గృహానికి తెచ్చాడు. అప్పటికి ఆ చిలక వయస్సు 38 సంవత్సరాలు. చర్చిల్‌తోపాటు ఛార్లీ 23 సంవత్సరాలు ఉంది. చర్చిల్ గొప్ప ఉపన్యాసకునిగా పేరు పొందాడు. ఆయన ప్రసంగాలను, మాటలను అనేకం ఛార్లీ తరచుగా విని అందులో కొన్ని మాటలు నేర్చుకుంది. ఇప్పటికీ అది ఆ చిలుక పలుకులు పలుకుతూనే వుంటుంది.

1965 లో చర్చిల్ మరణించాడు. పిమ్మట ఛార్లీని పక్షులను విక్రయించే ఓ ఆసామీ పెంచాడు. గడిచిన 3 సంవత్సరాలనుంచీ అది రెయ్‌గేట్‌లో వున్న హిత్‌ఫీల్డ్ నర్సరీ గార్డెన్ సెంటర్లో వుంటోంది. కడు వృద్ధాప్యంలో వున్న ఆ చిలుక ప్రస్తుతం పూర్తి విశ్రాంతి తీసుకుంటోంది. అడపాదడపా ఎప్పుడైనా క్లుప్తంగా మాట్లాడుతోంది.

# చతుర కతలు

## పిక్‌పాకెట్

పీక్ అవర్సేమో సిటీబస్ చాలా రద్దీగా వుంది. అందులో అప్పుడంలా మనుషులకు హత్తుకుపోయి నిలుచున్నాడు శంకరం. పీక్ అవర్ ప్రయాణం, రద్దీగావున్న సిటీ బస్సులూ అంటే అమిత ఇష్టం అతనికి.



అలవాటు ప్రకారం బస్ లోపలి సూక్తులను చదవనారంభించాడు శంకరం. 'స్త్రీలను గౌరవించడం మన సాంప్రదాయం- వారికి కేటాయించిన సీట్లలో వారినే కూర్చోనిద్దాం'. లేడీస్ సీట్లువైపు చూశాడు. వాటిలో సగం పురుషులే ఆక్రమించుకున్నారు. అందువల్ల వూచలకు వేలాడుతున్నారు కొందరు స్త్రీలు.

'టికెట్‌కోసం సరైన చిల్లర ఇవ్వండి- ఆలస్యాన్ని అరికట్టండి' చిల్లర ఇచ్చిన వారి మీద ఏదో వంకన విసుక్కుంటున్నాడు కండక్టర్ నోట్లిస్తే చిల్లర నొక్కేసే వాణ్ణికదా అని కాబోలు.

'జేబు దొంగలున్నారు- మీ జేబులు జాగ్రత్త' అన్న హెచ్చరికమీద చూపులు పడగానే నవ్వుకున్నాడు శంకరం ఆ భయం తనకు లేదు గదాని.

"టికెట్" అన్న కండక్టర్ పిలుపుతో అతని ఆలోచన దారం పుటుక్కున తెగింది. చొక్కా చేతి మడతలోంచి డబ్బులు తీసి టికెట్ తీసుకున్నాడు.

బస్ నాలుగైదు స్టాపుల్లో ఆగింది. దిగేవారు దిగుతున్నారు, ఎక్కేవాళ్లు ఎక్కుతున్నారు.

ఉన్నట్టుండి ఓ గావుకేక పెట్టాడు శంకరం "కండక్టర్! బస్సాపు. నా పర్సు ఎవరో కొట్టేశారు" అంటూ

బస్సాగిపోయింది.

కత్తిరింపబడివున్న ప్యాంట్ పాకెట్‌ని

చూపించాడు శంకరం.

"పర్సులో అయిదు వందలుండాలి" అన్నాడు.

తమ తమ జేబులు తడుముకున్నారంతా. అందరి పర్సులూ భద్రంగానే వున్నాయి, మరొక ప్యాసెంజర్‌ది తప్ప.

"బాబోయ్! నా పర్సు కూడా పోయింది. అయిదు వేలున్నాయి అందులో" అంటూ గుండెలు బాదుకున్నాడతను. అతని జేబు కత్తిరింపబడలేదు. పర్సు మాత్రం మాయమయింది.

బస్సులో కలకలం రేగింది.

"బస్‌ని పోలీస్ స్టేషన్‌కి పోనియ్" కండక్టర్ని శాసించాడు శంకరం.

దగ్గరలోవున్న పోలీస్ స్టేషన్ వద్ద ఆగింది బస్సు. కండక్టర్‌తోపాటు శంకరం, రెండో వ్యక్తీ స్టేషన్‌లో కంప్లయింట్ ఇచ్చారు. పోలీసులు వచ్చి బస్‌లో వున్న వారినందరినీ సోదా చేశారు. ఫలితం శూన్యం.

"మధ్యలో బస్సు చాలా స్టాపుల్లో ఆగిందంటున్నారు. ఆ దొంగ వెధవ ఎక్కడో దిగేసుంటాడు" అంటూ తేల్చేశారు పోలీసులు, తాము చేయగలిగిందేమీలేదన్నట్టు.

బస్సు మళ్లీ బయలుదేరింది. అయిదు వేలు పోగొట్టుకున్న ప్యాసెంజర్ బస్సెక్కాడు. శంకరం మాత్రం "ఛత్! ఇంత రద్దీగా వున్న బస్సులో ప్రయాణం చేయడం నాదే బుద్ధి తక్కువ" అని తిట్టుకుంటూ నడక ఆరంభించాడు.

కొంతదూరం వెళ్లాక ఓ సందులోకి తిరిగాడతను. ఓ చోట ఆగి సీక్రెట్ పాకెట్ లోంచి బ్రౌన్‌కలర్ పర్స్ ఒకటి తీశాడు. అందులోని నోట్లను తీసి లెక్కపెట్టుకున్నాడు. "హి ఈజ్ రైట్. ఎగ్జాక్ట్‌లీ ఫైవ్ థౌజండ్" అనుకుంటూ నోట్లను సీక్రెట్ పాకెట్‌లో దోపుకుని పర్స్‌ని మురుక్కాలువలోకి విసిరేశాడు.

'ఇది దొంగతనమని ఎవరన్నారు? నా తెలివి తేటలకు మూల్యం. ఎదుటివారి అజాగ్రత్తకు సుంకం అనుకుంటూ నవ్వుకున్నాడు శంకరం తన 'నావెల్ మెథడ్'కి మురిసిపోతూ.

– తిరుమలశ్రీ

---

## సుబ్బారావు స్కూటర్

సుబ్బారావు ఉదయం ఆఫీసుకి వచ్చినప్పటినుంచి చాలా డల్‌గా కనిపిస్తున్నాడు. వర్క్ సరిగా చెయ్యబుద్ధి కావడంలేదు. ఫైళ్లు మూస్తున్నాడు, తెరుస్తున్నాడు. పక్క సీట్లో ఉన్న రాజారావుకి విషయం ఏమిటో అర్థం కావడంలేదు. సాయంత్రం ఆఫీసు అయ్యాక అడిగాడు రాజారావు.

"ఏమిటోయ్ సుబ్బారావు?! ఉదయం నుంచీ చూస్తున్నాను, ఏదో బాధపడుతున్నట్లు వున్నావు. ఏమైనా ప్రాబ్లమా అంటూ అడిగాడు రాజారావు. ఏమీలేదంటూ తప్పించుకున్నాడు. ఇన్నాళ్లబట్టీ మనం స్నేహితులంగా ఉంటున్నాం. ఏదైనా ప్రాబ్లమ్ వస్తే ఒకరికొకరం సాయం చేసుకోవాలి. డబ్బేమైనా కావాలంటే చెప్పు. అవసరం అనేది ఎవరికైనా వస్తుందన్నాడు.

రాజారావు మంచి స్నేహితుడు. ఎవరికైనా ఆపద వస్తే వెంటనే ఆదుకునే మనిషి. అతని మాటతీరుకి మనసు కాస్త మెత్తబడింది. మనసులో బాధ చెప్పాలనుకున్నాడు. 'పద, అలా నడుచుకుంటూ వెళ్దాం' అనుకుని క్యాంటీన్‌కి వెళ్లారు.

రాజారావే ఇద్దరికీ టీ ఆర్డరిచ్చాడు. నాలుగు రోజుల్నుంచీ జరుగుతున్న యుద్ధం గురించి వివరించాడు. ఎలాగైనా తనని ఈ ఆపదనుంచి గట్టెక్కిస్తే తన మేలు ఈ జన్మలో మరచిపోనన్నాడు సుబ్బారావు.

సుబ్బారావు చెప్పిందంతా విని కాసేపు ఆలోచించాడు రాజారావు. పాపం సుబ్బారావు గొప్ప చిక్కులోనే ఇరుక్కున్నాడు.



అసలే అమాయకుడు. ఆడపిల్లలు గలవాడు. ఎలాగైనా ఈ గండంనుంచి తప్పించాలనుకున్నాడు. వేడివేడి టీ తాగేసరికి బ్రైన్ చురుగ్గా పనిచేసింది. ఒక ప్లాన్ వేశాడు.

రాజారావు చెప్పబోయే సలహాకోసం ఉత్కంఠతో ఎదురు చూశాడు. దీనికి ఒకటే మార్గం. నేను చెప్పినట్లు చేశావంటే నీ ప్రాబ్లమ్ తీరిపోతుందన్నాడు. ఏమిటో చెప్పమన్నాడు సుబ్బారావు. రాజారావు చెప్పిందంతా విన్నాక భయంగా చూశాడు. చెప్పటానికి తేలిగ్గానే వుంది. దాన్ని అమలుపరచాలంటే చాలా కష్టం అన్నాడు.

అయినా తప్పదు. కాస్త ఓర్పు కావాలి. మనసు గట్టిపరచుకోవాలి. ఏమాత్రం పైకి కనిపించకూడదు. అత్యవసర పరిస్థితుల్లో అపాయంనుంచి బయటపడటానికి ఉపాయం ఆలోచించక తప్పదు. రేపటినుంచే ఫాలో అవ్వు. నీకెందుకు, నీ వెనుక అండగా నేనున్నా'నంటూ భుజం తట్టాడు.

రాజారావు చెప్పాడంటే తిరుగేలేదు. ధైర్యాన్ని కూడదీసుకుని రంగంలోకి ప్రొసీడ్ అయ్యాడు. మర్నాడు ఆఫీసుకు సెలవుపెట్టాడు. మౌనంగా భార్య అందించిన కాఫీ తాగి బయటికి వెళ్లినవాడు పదిగంటలవుతుండగా తళతళలాడే కొత్త స్కూటరుమీద రయ్యిమని దూసుకొచ్చాడు ఇంటికి. స్కూటరు చప్పుడు కాగానే వంటగదిలో వున్న మీనాక్షి పరిగెత్తుకొచ్చింది. కొత్త స్కూటర్ని చూడగానే సంబరపడిపోయింది. "ఏమండీ! ఇది మనదేనా? " అనడిగింది. "మనది కాకపోతే ఎవరిదైనా ఎత్తుకొచ్చాననుకున్నావా? ఇది ఎప్పటికీ మనదే. త్వరగా రెడీ అయ్యావంటే గుడికి వెళ్దాం" అన్నాడు. ఇదిగో ఇప్పుడే వస్తున్నానంటూ లోపలికి వెళ్లి నిమిషంలో తయారై వచ్చింది. భార్యని స్కూటరుమీద ఎక్కించుకుని మొదటిసారిగా గుడికి వెళ్లి అక్కడ స్కూటరుకి నిమ్మకాయలు కట్టించి పూజ చేయించాడు. అటునుంచి హోటల్‌కి వెళ్లారిద్దరూ. సాయంత్రం పిల్లల్ని కూడా ఎక్కించుకుని సరదాగా సినిమాకి వెళ్ళొచ్చారు.

నిన్నటిదాకా రుసరుసలు, విసవిసలు, కోపతాపాలు చూపిన మీనాక్షికి ఇవాళ భర్త మీద ఎక్కడలేని ప్రేమ పుట్టుకొచ్చింది. ఆ రాత్రికి భర్త విరహతాపాన్ని చల్లార్చింది. రెండోరోజు కూడా సుబ్బారావు భార్యని స్కూటరుమీద ఎక్కించుకుని తెలిసిన బంధువులు, స్నేహితులు అందరి ఇళ్లకీ తీసుకెళ్లాడు. పండుగ సంబరంకన్నా పదింతలుగా సంతోషించింది మీనాక్షి.

రెండ్రోజుల తర్వాత ఆఫీసుకని వెళ్లిన సుబ్బారావు అడ్రస్‌లేడు. ఇంటికి రాలేదు. ఆఫీసుకి ఫోన్ చేస్తే రాలేదని చెప్పారు. ఇటు తల్లిదండ్రులకి, అత్తమామలకి తెలిసిన బంధువులకి ఫోన్లు చేసింది మీనాక్షి. చెప్పాపెట్టకుండా ఎక్కడికి వెళ్లాడో తెలీడంలేదు. మీనాక్షికి కాళ్లూచేతులూ ఆడటంలేదు. అన్నం, నీళ్లు ముట్టుకోలేదు. భర్తని ఎవరైనా కిడ్నాప్‌చేసి వుంటారని అనుమానం వచ్చింది. ఆ రోజంతా వెతికింది. రాత్రి పదిగంటలైనా సుబ్బారావు జాడ తెలీలేదు. ఒక్కరోజుకే ఎందుకింత కంగారుపడ్తారు? ఏదైనా అర్జంటు పనుండి వెళ్లారేమో వస్తారులెమ్మని చుట్టుపక్కల వాళ్లంతా మీనాక్షిని ఓదార్చారు. ఆ రాత్రికి ఏడుస్తూనే గడిపింది.

తెల్లవారినా రాకపోవటంతో తనే స్వయంగా ఆఫీసుకి వెళ్లాలనుకుంది. ఇంతలో ఎవరో ఒకతను బయటినుంచి కేకలు పెట్టుకుంటూ వచ్చాడు. అసలే భర్త రాలేదన్న టెన్షన్లో వుంది.

"ఏమండీ, సుబ్బారావుగారున్నారా? " అంటూ లోనికొచ్చాడా వ్యక్తి.

"నిన్ననగా వెళ్లారు. ఆయనకోసమే ఎదురుచూస్తున్నాను. ఇంతకీ మీరెవరు? ఆయనతో ఏమైనా పనుందా? " అనడిగింది.

"ఆయన్ని ఉన్నఫళంగా పిల్చుకురమ్మన్నారు ఆఫీసరుగారు. ఇవాళ గనుక రాకపోతే ఆయన ఉద్యోగం కాస్తా ఊడుతుంది. సుబ్బారావు ఇలాంటి పని చేస్తాడంటే





ఎవరూ నమ్మరు. ఎంతో నిజాయితీగా వుండేవాడు. అట్లాంటిది ఆఫీసు డబ్బు యాభైవేలు తీసుకుని పరారయ్యాడంటే ఇంకేమైనా వుందా? ఎప్పుడూ ఎవర్నీ పైసా కూడా అప్పు అడగని మనిషి, ఆఫీసు డబ్బు కాజేశాడంటే పరువూ వుండదూ, ఉద్యోగమూ వుండదు. రేపటికల్లా పోలీసులొచ్చి అరెస్ట్‌చేసి సుబ్బారావుని జైలుకి పంపిస్తారు. ఎవరికీ ఈ విషయం తెలియకముందే ఆ డబ్బు అప్పజెప్తే ఎలాగో బ్రతిమిలాడి ఉద్యోగం పోకుండా చూసుకోవచ్చ"న్నాడు.

మీనాక్షికి గుండె ఆగినంతపనయింది. ఎన్నడూ లేనిది తన భర్త ఇలా చేశాడంటే తనకే నమ్మబుద్ధి కావడంలేదు. ఆ యాభైవేలు ఏం చేసినట్లు? ఎవరికీ చెప్పాపెట్టకుండా ఎక్కడికి వెళ్లినట్లు? అంత డబ్బు ఏం చేశాడో అర్థంకాలేదు. ఉన్న ఉద్యోగం కాస్తా పోతే తనూ, పిల్లలు పుట్టింటికి చేరాల్సిందే. తనకేమీ తెలీదని చెప్పింది.

"ఈ ఒక్కరోజే గడువిస్తున్నాం. రేపటికల్లా ఆ డబ్బు తెచ్చివ్వకపోతే పర్యవసానం ఎలా వుంటుందో చెప్పానుకదా. సుబ్బారావు రాగానే చెప్పు"మంటూ వెళ్లిపోయాడు.

'ఓరి నాయనో, దేవుడో! ఈ గండం గడిచేదెలా? ' అని ఏడ్చి శోకాలుపెడ్తూ ముక్కు చీదుతూ కూర్చుంది.

అర్ధరాత్రి పన్నెండుకి తలుపు కొట్టాడు సుబ్బారావు. తలుపు తీసిన మీనాక్షి మరింత ఆశ్చర్యపోయింది. సుబ్బారావు మామూలుగా రాలేదు. మందు తాగి తూలుకుంటూ వచ్చాడు. ఆ వాసన భరించలేక దూరంగా జరిగింది. "చెప్పకుండా ఎక్కడికి వెళ్లారు? ఈ కొత్తలవాటు కూడా నేర్చుకున్నారా? ముందు ఆ యాభైవేలు ఏంచేశారో చెప్పండి. మీకిదేం బుద్ధి? ఆఫీసు డబ్బు తీసుకుని ఇంట్లో ఎవరికీ



చెప్పకుండా ఎక్కడికి వెళ్లారు? మీ కోసం వెతుకుతూ అల్లాడిపోయాను. ముందు ఆ డబ్బు సంగతి ఏం చేశారో చెప్పండి" అంది.

తాగిన మైకంలో మాటలు ముద్దముద్దగా వస్తున్నాయి. స్కూటరుమీద ఎక్కి సరదాగా తిరగటానికి డబ్బు ఎక్కడినుంచి వచ్చిందనుకున్నావు? నీ బాబేమైనా పంపించాడా? నా దగ్గరంత డబ్బులేదు. ఇప్పుడు స్కూటరొద్దంటే విన్నావా? స్కూటరు కొంటేగానీ వీల్లేదని ప్రతిరోజూ నువ్వు చేసే గొడవ



భరించలేక డబ్బు ఎక్కణ్ణించి తేవాలో తెలీక ఆఫీసుడబ్బు దొంగతనం చేయాల్సివచ్చింది. ఉద్యోగం పోతే పోనీ హాయిగా స్కూటరు మీద తిరుగుతూ కాలం గడపచ్చు"

"నేను స్కూటరు కొనమంటే ఆఫీసుడబ్బు కాజేయమని చెప్పానా? మనం దాచుకున్న డబ్బులతో కొనమన్నాను. ఇలాంటి పని చేస్తారని తెలిస్తే స్కూటరు కొనిపించేదాన్ని కాదు. ఆ ఉద్యోగం కాస్తా పోతే ఇంటిల్లి పాదీ పస్తులు పడుకోవాలి. ఏదో సరదాపడి అడిగాను. ముందు ఆ స్కూటరు అమ్మేసి డబ్బు వాళ్లకిచ్చేసి ఉద్యోగం ఊడకుండా చూసుకోండి. ఉద్యోగం లేకపోతే బతకలేం. తెల్లవారితే పోలీస్ కంప్లైంట్ కూడా ఇస్తా రట. ఉన్న పరువు కూడా పోతుంది"

"నిన్న కొని ఇవాళ అమ్ముతానంటే తక్కువ రేటుకి అడుగుతారు. చూస్తూ, చూస్తూ ఎలా ఇవ్వగలం? "

"ఎంతోకొంతకి అమ్మి పడేయండి. వచ్చిన డబ్బు చాలకపోతే నా గొలుసు కూడా ఇస్తాను. అది కూడా అమ్మేయండి. ఎప్పుడూ తాగుడుజోలికి వెళ్లనివాళ్లు ఇది కూడా మొదలుపెట్టారా? మొన్నటివరకూ ఎంతో మంచివారనుకున్నాను. ఎందుకిలా ప్రవర్తిస్తున్నారు, చెప్పండి" అంటూ కన్నీళ్లు పెట్టుకుంది.

"దీనికంతటికీ నువ్వే కారణం. పక్కింటి వాళ్లు ఇది కొన్నారు, ఎదురింటివాళ్లు అది కొన్నారంటూ ఆ వస్తువు కొనేవరకూ నిద్ర పోవు. నీ బాధ భరించలేకనే ఈ పని చేశాను" అన్నాడు.

మనకి వుంటేనే కొనుక్కుందాం లేకపోతే లేదని తెల్లవారాక ఆ స్కూటరు తీసికెళ్లేవ రకూ ఊరుకోలేదు. ఇంకెప్పుడూ ఏమీ అడ గనంది కూడా. మర్నాడు సుబ్బారావు స్కూటరు తీసికెళ్లి రాజారావుకి అప్పగిం చాడు. "థాంక్స్ రాజారావ్. సరైన ప్లాను చెప్పి నన్ను కాపాడావు. నీ మేలు ఈ జన్మలో మరచిపోలే"నన్నాడు

"మన నాటకం బాగా రక్తి కట్టిందా? " అడిగాడు రాజారావు.

"ఈ దెబ్బతో మా ఆవిడకి బుద్ధి వచ్చింది. ఇంకెప్పుడూ ఏదీ అడగనన్నది. మనకిద్దరు ఆడపిల్లలున్నారు, డబ్బు పొదుపు చేయాలంటే వినదు. ఇపుడు కాక పోతే ఇంకెప్పుడు కొనుక్కుంటాం అంటుంది. పిల్లల చదువులు, ఫీజులు, రేపు వాళ్లు పెరిగిపెద్దయ్యాక పెళ్లిళ్లు చేయాలి. సరదాకోసం వున్న డబ్బు ఖర్చు చేసుకుంటే పిల్లల భవిష్యత్తు ఏమిటి? ఇరుగుపొరుగు వారిని చూసి వాళ్లది కొన్నారు, మనమూ కొందామంటే మన పరిస్థితిని ఆలోచించుకో వాలి. మన రాబడి ఎంత, మన పరిస్థితి ఏమిటి అంటూ అర్థం చేసుకోకుండా పొదుపు లేకుండా చూసినవన్నీ కొంటే చివ రికి పైసా మిగలదు. నిజంగానే ఉద్యోగం పోతుందనుకుని భయపడింది. స్కూటరు అమ్మేసి డబ్బు కట్టిరమ్మంది."

"మొత్తానికి నా స్కూటరు బాగా ఉపయో గపడింది. రెండురోజుల క్రితమే కొన్నాను. అందుకే కొత్తది కొన్నట్లు నమ్మించగలిగావు. నా స్కూటరు నాకు వచ్చేసింది. నీ ఉద్యోగం భద్రంగా వుంది. మనం ఆడిన నాటకంతో మీ ఆవిడ కళ్లు తెరిపించావు. తాగడం కూడా ఒక నాటకమే అనుకుని మరచిపోకు. నిజంగా దానికి అలవాటుపడ్డా వంటే తాగుడికి బానిసవైపోతా"వన్నాడు రాజారావు.

"నాకామాత్రం తెలియదా? నిజంగా తాగ నేలేదు. బాటిల్‌లోంచి కొద్దిగా వంపుకున్నాను వాసన రావాలని. అసలు దాని రుచి ఎలా వుంటుందో కూడా తెలీదు. వస్తాను రాజారావు. మా ఆవిడ నాకోసం ఎదురుచూస్తుంటుంద"ని సుబ్బారావు స్కూటరు ఇచ్చేసి తిన్నగా ఇంటికి చేరుకు న్నాడు.

– తాటికోల పద్మావతి

# ఏరిన ముత్యాలు

* నోరు జారిన మాట, ఎగిరిపోయిన పక్షి, గతించిన కాలం, పోగొట్టుకున్న అవకాశం తిరిగి లభించటం దుర్లభం.

– భర్తృహరి

* అదృష్టం, దురదృష్టం అనేవి జ్ఞానులకు వర్తించవు.

– ఎపిక్యూరస్

* ఒక పక్షి తుపాను పెనుగాలులను ధైర్యంగా ఎదుర్కొనగలదు. ఎందుకంటే దాని రెక్కలపై దానికి విశ్వాసం వుంది.

– స్వామివివేకానంద

* నీ జీవిత సముద్రాన్ని దాటడానికి స్నేహాన్ని మించిన నావలేదు.

– షోర్స్

* మనుషుల్లో చిత్తశాంతి వున్నప్పుడే దేశాలమధ్య నిజమైన శాంతి నెలకొంటుంది.

– బ్లాక్ఎల్క్

* అనుభవానికి మించిన పాఠంలేదు. ప్రకృతిని మించిన గురువు లేడు.

– ఛాందోగ్యోపనిషత్తు

* శారీరక అనారోగ్యం కంటే మానసిక రుగ్మతలు ఎక్కువ హాని కల్గిస్తాయి.

– సిసిరో

* చేసే పని హృదయపూర్వకంగా చేస్తే విజయం నిన్నే వరిస్తుంది. అందులో పోటీ వుండదు.

– ఎల్బర్ట్ హాల్బార్డ్

* జీవితాన్ని పూర్తిగా సద్వినియోగం చేసుకునే నైపుణ్యం పొదుపు. పొదుపు శీలానికి మూలం.

– సి.దిలీప్‌బెనర్జీ

* సంతృప్తిలేని జీవితానికి శాంతిలేదు. వృద్ధిలేదు.

– నార్ల

* మంచి నడవడి లేనివాడిని చూసి లోకం భయపడుతుంది.

– ఫుల్లర్

* విద్యను ఆర్జించటంకంటె అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోవడం చాలా కష్టం.

– ఆండేస్ ఎకనామిస్ట్

* బలహీనులు అదృష్టాన్ని, బలవంతులు కృషిని నమ్ముకుంటారు.

– ఎమర్సన్

* న్యాయం గెలుస్తుందన్న మాట నిజమేకాని గెలిచింది అంతా న్యాయం కాదు.

– శ్రీశ్రీ

* వికృతమైన మనసుకంటే వికృతమైన ముఖం మంచిది.

– జేమ్స్‌ఎర్లిన్

సేకరణ: **ఇమ్మానేని భవసూర్యతేజ**

# చతుర

సంపుటి: 26 సంచిక: 4 మే 2003

304వ సంచిక

"మీరే అబ్బాయిని చేసుకోమన్నా చేసుకుంటాను. కానీ పెళ్ళిచూపులు పెట్టకండి. అబ్బాయిని నాకు తెలియకుండా నన్ను చూడమనండి. పెళ్ళి నిశ్చయమయ్యేదాకా నేను అతణ్ణి చూడమన్నా చూడను" ఖచ్చితంగా చెప్పిందా అమ్మాయి.

తెల్లబోయిన అమ్మమ్మ పక్కనే ఉన్న కోడలిని వివరమడిగింది.

"ఏమీలేదత్తయ్యా! మీ మనవరాలు చాలా గొప్పది. మనం పతివ్రతలమేకానీ తాను ప్రియవ్రత కూడానంటోంది" చెప్పింది కోడలు.

"అంటే?" తెల్లబోతూ అడిగింది అమ్మమ్మ.

పతివ్రత అన్నమాటేగానీ ప్రియవ్రతమేమిటో తెలియని అమ్మమ్మకి మనవరాలి వ్రతం పూర్తయ్యేసరికి ఎదురయిన అనుభవం ఏమిటి?





ఆసక్తికరంగా సాగే **వసుంధర** రచన

# నేస్ లివ్ డాట్ కామ్

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

కుడిచేతి బొటనవేలికీ, చూపుడువేలికీ మధ్య అందంగా అమరిన సిరావాహిక. ఎడమచేతి వేళ్లన్నీ కంప్యూటర్ కీబోర్డుమీద.

అక్షరాలతో ఆకారాన్నిచ్చి ప్రాణంపోసి ఆచంద్రతారార్కం నిలిచిపోగల పాత్రల్నీ, పరిసరాల్నీ, సంఘటనల్నీ సృష్టించగల అపర విశ్వామిత్రుడు ఆ రచయిత.

భీష్మణ్ణి నిర్జించిన అర్జునుడికి తనను చంపగల ఉపాయం భీష్ముడే చెప్పాడు. తనను మించినవారిని మించాలనుకునే ఎంతవారైనా ప్రత్యర్థిముందు తలవంచాల్సిందే కదా. అతడూ తన తలనువంచి కనులుమూసి సృష్టికర్తను ప్రాధేయపడుతున్నాడు.

"ప్రభూ! సూర్యుడిచుట్టూ భూమి తిరిగినట్లుగా మనిషి జీవితం స్త్రీత్వంచుట్టూ తిరుగుతోంది. సమస్త లలితకళలకూ స్త్రీ ఊపిరి అవుతోంది. నేను ఓ కవిని. ఇప్పటికే ఎందరో కవులు ఎన్నో పాత్రలు సృష్టించి స్త్రీ విశిష్టతను చాటి చెప్పారు. ఎన్నో అమర కావ్యాల్లో స్త్రీ ప్రేమకి మారుపేరయింది. అనంతకోటి వర్ణాలతో విరాజిల్లే ప్రేమను ప్రతి స్త్రీ తనకే ప్రత్యేకమనిపించే భిన్నవర్ణంలో ప్రసరిస్తుంది. అయితే శృంగారం నిండిన స్త్రీ ప్రేమ మాత్రమే ఈ సృష్టిని ముందుకు నడిపిస్తున్నదని నాకు తెలుసు. అందుకే చాలా కావ్యాలు ఆ తరహా ప్రేమనే కథాంశాలుగా ఎన్నుకున్నాయనీ నాకు తెలుసు. కానీ మన సంప్రదాయంలో ఎక్కువ కావ్యాలు విషాదాంతాలు. అందుక్కారణం స్త్రీ శీలానికి ఏర్పడిన పవిత్రత. పాతివ్రత్యానికీ పవిత్రతకీ ఏర్పడిన ముడి. స్త్రీకైనా, పురుషుడికైనా పవిత్రతలోనే ఉదాత్తత ఉన్నదని నమ్మే నేను ఇంతవరకూ ఏ కవికీ అందని పవిత్ర స్త్రీ పాత్రని పాఠకుల ముందుంచాలనుకుంటున్నాను. మన సంప్రదాయంలోని మంచిని విస్మరించకుండా పాశ్చాత్య సంప్రదాయంలోని విశృంఖల మోహానికి తలవంచకుండా స్త్రీ జాతిని న్యూనతకు గురిచేయకుండా ఆధునికతను నింపి ఆ పాత్రకు న్యాయం చేకూర్చాలని నా ఆశయం. అయితే ఆమె ఆదర్శాలని నేను అంచనా వేయగలిగాను కానీ ఆమె రూపురేఖలను దర్శించలేకపోతున్నాను. ఆమె పరిసరాలని ఊహించలేకపోతున్నాను. ఆమె ఉనికిని గుర్తించలేకపోతున్నాను. నాకు నీ సాయం కావాలి. నీవు నన్ను కనికరించాలి".

అతడి మాటలు మంత్రాలై పెదాలని దాటి పూజాపుష్పాలై సృష్టికర్తని తాకి తపోజ్వాలలై సమస్త విశ్వాన్ని శక్తితో, వెలుగుతో నింపుతున్నాయి.

ఆ వెలుగులో...

★ ★ ★

"గురూ! బారెడు పొద్దెక్కింది. ఇంకా ఈ నిద్రేమిటి? లే...లే..."

ఉలిక్కిపడి నిద్ర లేచాడు కాళిదాసు. కళ్లు నులుముకుని చుట్టూ చూశాడు.

చాలా సామాన్యమైన గది. రెండు మడత మంచాలు. ఓ చెక్కబీరువా. మూలగా ఓ బల్ల. ఇంకోమూల ఓ స్టూలు. స్టూలుమీద మట్టికూజా. పక్కన గ్లాసు. స్నానాలగదిలోకి ఓ తలుపు, గాలి రావడానికో తలుపులు లేని కిటికీ, దాన్ని కప్పుతున్న తుండుగుడ్డ తెర, వీధిలోకి పోవడానికి ఇంకో తలుపు...

ఎదురుగా రూంమేటు భారవి.

"అలా చూస్తున్నావేంటి గురూ?" అడిగాడు భారవి.

"దేవుడు నాకు ఈ సృష్టికి అపురూపమైన ఓ ఆడపిల్లని చూపిస్తానన్నాడు. సరిగ్గా అప్పుడే నువ్వు నన్ను నిద్రలేపి నీ ముఖం చూపించావు. మీసాలు పెంచకున్నా బాగుండేది. నువ్వే ఆడపిల్లవని సరిపెట్టుకునేవాణ్ణి" నిట్టూర్చాడు కాళిదాసు.

"మనం చాలా విషయాల్లో సరిపెట్టుకుంటున్నాం. ఆడపిల్ల విషయంలో మాత్రం ఇలా సరిపెట్టుకుందుకు నేనొప్పుకోను" అన్నాడు భారవి అభ్యంతరం చెబుతూ.





"అలాంటప్పుడు నా నిద్ర ఎందుకు చెడగొట్టావ్? " అన్నాడు కాళిదాసు చిరాగ్గా.

"అందుక్కారణముంది" అన్నాడు భారవి.

"అలాగనడం నీకు అలవాటు. సరైన కారణం చెప్పకపోతే నీకు తెలుసుగా. ఈరోజుకి నువ్వే ఆడపిల్లవి" అన్నాడు కాళిదాసు.

కాళిదాసు, భారవి ఒకే ఊళ్లో ఇంటర్మీడియేట్‌దాకా చదివారు. ఎంసెట్లో ర్యాంకు రాలేదు. తల్లిదండ్రులకి డొనేషన్ కట్టే స్తోమతలేదు. అందుకని ఇద్దరూ గ్రాడ్యుయేట్లయ్యారు. అదృష్టం బాగుంటే విదేశాలు కూడా వెళ్లొచ్చని కంప్యూటర్ కోర్సులు చేశారు. ఆ డబ్బుకోసం హోటళ్లలోనూ, బార్లలోనూ చిన్నచిన్న ఉద్యోగాలు చేశారు. పెద్ద వాగ్దానాలతో చిన్న కంప్యూటరు ఉద్యోగాలు దొరికితే చేరారు. ఉన్నట్లుండి రిసెషన్ వచ్చింది. కంప్యూటరు ఉద్యోగాలు పోయాయి. పాత ఉద్యోగాలకూ పోటీ పెరిగింది. ప్రస్తుతం వాళ్లు నిరుద్యోగులు.

వార్తలు రాస్తామని దినపత్రికల చుట్టూ, కథలు రాస్తామని వారపత్రికల చుట్టూ, వేషాలు వేస్తామని టీవీ చానెల్స్ చుట్టూ, ట్యూషన్లు చెబుతామని కుర్రాళ్ల చుట్టూ, పాఠాలు చెబుతామని స్కూళ్ల చుట్టూ కాళ్లరిగేలా తిరుగుతూ రోజులు గడుపుతున్నారు వాళ్లు. జాగ్రత్తపరులు కాబట్టి వాళ్లదగ్గర ఇంకా అంతో ఇంతో డబ్బుంది. ఆ డబ్బుతో ఇంకా ఎన్నాళ్లన్న భయాన్ని స్ఫురణకి రానివ్వనంత ఆశ వాళ్లలో వుంది. ఆ ఆశను వాళ్లు హితులు, సన్నిహితులు, స్నేహితులు వగైరాలనుంచి కొనుక్కుంటున్నా ఎక్కువ మొత్తంలో వాళ్లకి ఆశలని అమ్మేది కలలు మాత్రమే. కానీ కలలు వాళ్లకంత సులభంగా రావు. పగలు పగటికలలు కనడానికి కూడా వీల్లేనంత తిరుగుడు. రాత్రిళ్లు కల వరంగా లభించడానికి వీల్లేనంత కలవరం. అలాగే ఎప్పుడో నిద్రపడుతుంది. ఆ నిద్ర కలానిలయమవుతుంది. అందుకే కారణం లేకుండా ఒకరి నిద్రని ఒకరు చెడగొట్టకూడదని ఇద్దరూ ఒప్పందం చేసుకున్నారు. ఒప్పందం తప్పినవాడు ఆడపిల్ల.

మన సంప్రదాయం ఇంటిపనులను ఆడపనులంటుంది. ఇల్లు తుడవడం, గిన్నెలు కడగడం, బట్టలుతకడం, వంట చేయడం ఇవన్నీ ఆడపనులు. సంప్రదాయం ప్రభావం ఎంత గొప్పదంటే ఇలాంటి పనులు చేసే మగాళ్లని ఆడపిల్లలు ఆడంగి అంటారు. కాళిదాసు, భారవి ఆ సంప్రదాయంలోంచే పుట్టారు కానీ వారికి ఆడపనులంటే చిన్నతనంలేదు.

ఇద్దరూ ఇంట్లో చిన్నప్పుడు తల్లులకు సాయం చేసేవారు. ఆడపనులనెవరైనా ఆఖరికి తండ్రైనాసరే చిన్నబుచ్చడం జరిగితే తల్లినే చిన్నబుచ్చినంతగా ఫీలయ్యేవారు. ఇద్దరికీ చెల్లెళ్లున్నారు. తామింట్లో వుండగా చెల్లిచేత ఆడపనులు చేయనివ్వకుండా తామే చేయడంలో వాళ్లు ఎంతో తృప్తిని పొందేవారు. అయితే ఇంటిపనులు ఆడపిల్లవన్న భావం మాత్రం వారిని విడనాడలేదు.

భారతదేశం స్వతంత్రమని తెలిసినవాళ్లు కూడా బ్రిటిష్‌వారు బానిసలనేలడానికి రూపొందించిన నియమావళిని తూచా తప్పకుండా పాటిస్తూ తాము స్వేచ్ఛని గౌరవిస్తున్నామనుకుంటారు. మనదేశంలో తల్లినీ, చెల్లినీ, స్త్రీశక్తినీ ఆరాధించేవారు, అభిమానించేవారు, గౌరవించేవారు అదే స్థాయిలో ఆలోచిస్తూంటారు. కాళిదాసు, భారవి అందుకు భిన్నం కాదు.

"బ్రష్‌మీద పేస్టువేసి తీసుకునిరా" అన్నాడు కాళిదాసు.

"పేస్టుట పేస్టు... మనం పళ్లపొడికి మారి నెలదాటింది" అన్నాడు భారవి.

"నువ్వు ఆడపిల్లవైనట్లే పొడరూ పేస్టవుతుంది. అదే పట్రా"

"నిన్ను నిద్ర లేపడానికి నేనిప్పుడు కారణం చెప్పానంటే నేను ఆడపిల్లని కాను కానీ పొడరు పేస్టు కావచ్చు" అన్నాడు భారవి.



"అదెలా? "

"శశాంక తెలుసుకదా నీకు? "

"ఏ శశాంక? "

"ఎంతమంది శశాంకలు తెలుసు నీకు? "

"ఏ శశాంక అంటే ఎవరా శశాంక అని అర్థం"

"నీకు తెలుసు. గుర్తు తెచ్చుకో. అప్పుడే నేను చెప్పేదాంట్లో మజా వుంటుంది"

ఎంత ప్రయత్నించినా కాళిదాసుకు శశాంక గుర్తు రాలేదు. చివరికి విసుగ్గా "ఏమైనా క్లూ వుంటే ఇవ్వు" అన్నాడు.

"పౌడరుకీ పేస్టుకీ తేడా పదమూడు రూపాయలు. అంతే అతగాడు మనకి బాకీ" అన్నాడు భారవి.

"ఓహ్-వాడా? ఈ ప్రపంచంలో మన దగ్గర కూడా అప్పుచేసే దౌర్భాగ్యుడు"

కాళిదాసు ఇంకా మాట పూర్తికాకుండానే "అయ్యో-నేను అతగాడంటే నువ్వు వాడంటున్నావు. మనమిద్దరం శశాంకను అయ్యా, తమరు అని సంబోధించేరోజు వచ్చింది. అతడిప్పుడు కోటీశ్వరుడు. తెలుసా నీకు? " అన్నాడు.

కాళిదాసు నోరు తెరుచుకుంది ఆశ్చర్యంతో. కాసేపది అలాగే ఉండిపోయింది. తిరిగి రెండు పెదాలూ కలిశాక, "కాస్త వివరంగా చెప్పరా? " అన్నాడు.

భారవి గొంతు సవరించుకున్నాడు, "ఎందుకో పొద్దున్నే మెలకువొచ్చేసింది. వంటికి మంచిదని కాసేపు రోడ్డుమీద పరుగెత్తాలనుకున్నాను. నిన్నూ రమ్మందామంటే వళ్ళు తెలియకుండా గుర్రుకొడుతూ ఆడపిల్ల సిగ్గుపడే పోజులో నిద్రపోతున్నావు. నేను జాగింగుకు వెడితే జాగిలంతో ఎదురయ్యాడు జగన్నాథం"

"జగన్నాథంగాడికి కుక్కెడిది? "

"వాడికి కుక్కేమిటి? వాడే కుక్క..." అన్నాడు భారవి.

"అంతా అయోమయంగా వుంది, సరిగ్గా చెప్పు"

"అయోమయం నీ ప్రశ్నల్లోంచే వస్తోంది. కాసేపు ఆశ్చర్యానిక్కూడా నోరు తెరవకుండా నేను చెప్పేది విను" అన్నాడు భారవి.

కౌన్ బనేగా కరోర్‌పతి, సవాల్ దస్ కరోర్‌కా, చప్పర్ ఫాడ్‌కే లాంటి అద్భుతం జరిగి శశాంక వున్నట్లుండి కోటీశ్వరుడయ్యాడు. అయినా అతడికి కళ్లు నెత్తిమీదకెక్కలేదు. నెత్తిమీద కొమ్ములు మొలవలేదు. మొత్తం తన పాత మిత్రులందర్నీ చేరదియ్యాలనుకుంటున్నాడు. తనవద్ద కోట్ల రూపాయలున్న విషయాన్ని ప్రచారం చేయకుండా మామూలు జీవితం గడపాలనుకుంటున్నాడు. మనుషుల్ని నమ్మడం కష్టమని ముందుగా తన రక్షణకోసం ఓ కుక్కని కొన్నాడు. ఆ కుక్క సంరక్షణకోసం జగన్నాథాన్ని చేరదీశాడు. ఆ ఇంట్లో ఇప్పుడు కుక్కకి జగన్నాథమైతే, శశాంకకీ జగన్నాథమే. కుక్క పనీ, కుక్కు పనీ జగన్నాథమే చేస్తూ హాబీగా వుండే వంటని వృత్తిగా మార్చుకున్నాడు.

ఆ జగన్నాథం ఈరోజు ఉదయం భారవికి కనిపించాడు. భారవిని వెదకబోయిన తీగ అని ఉపమించి ఇంత ముఖం చేసుకున్నాడు.

"నువ్వు తీగవెట్లా అయ్యావ్? "అన్నాడు కాళిదాసు.

"నేను కాదు మనం. జగన్నాథం చేతి గొలుసు కుక్క మెడకున్నట్లే నా మనసు గొలుసు నీ మెడకూ తగులుకుని వుంటుందని నీకు తెలుసుగా. అంటే మనమిద్దరం తీగలం"

"వెధవ పోలికతో నన్ను కుక్కని చేయకు. అసలు సంగతి చెప్పు"

"శశాంకకి హీరోలా వుండాలని చాలా కోరిక. సినిమాలలో హీరోలెలా వుంటారో నిజజీవితంలో తనూ అలాగే వుండాలనుకుంటున్నాడు. అందుకు అవసరమైన డబ్బు వాడి దగ్గరుంది. ఆచరణకోసం పద్ధతులు వెతుకుతున్నాడు.





"ఏమిటా పద్ధతులు? "

"ఒకరోజు పొద్దున్నే పాట పాడుకుంటూ ఫుట్‌పాత్‌మీద నడిచాడు. దారిలో ఓ బిచ్చగాణ్ణి చూసి ఆగి వాడి చేతిలో పది రూపాయల నోటుంచాడు. బిచ్చగాడు మహదానందపడి మంచి మనసిచ్చిన ఆ దేవుడు తమకి మంచి గొంతునిస్తే బాగుండేది అన్నాడట"

కాళిదాసు ఫక్కున నవ్వి "సినిమాలు చూసిచూసి బిచ్చగాళ్లలో కూడా సెన్సాఫ్ హ్యూమర్ పెరిగిపోతోంది" అన్నాడు.

"అదే శశాంక బాధ. ఇన్ని సినిమాలు చూసినా తనెందుకు హీరో కాలేకపోతున్నాడని ఒకటే మథనపడుతున్నాడు"

"తను కోటీశ్వరుడన్న హింట్ ఇచ్చి ఏ అమ్మాయికైనా లైనేస్తే సరి ఇట్టే హీరో కావచ్చు. వాడికీమాత్రం ఐడియా రాలేదూ? "

"మాటిమాటికీ శశాంకని 'వాడు' అనకు, బాగుండదు. బీ అటెంటివ్. నా మనసు గొలుసు చివరుండి నాతోబాటు తీగవయ్యావని నీ మేలు కోరి చెబుతున్నాను"

"సరే. నా స్టేటస్ కుక్కనుంచి తీగకు పెంచావు. సంతోషం. శశాంక మహాశయుడికి ఆడపిల్లకి లైనేయాలన్న ఆలోచన ఎందుకు రాలేదో చెప్పు"

"రాకేం, వచ్చింది. ప్రాక్టీసు కోసమని ముందో అమ్మాయిని సెలక్ట్ చేసుకున్నాడు. ఆ పిల్ల దినచర్యని గమనించాడు. వెంటపడి పలకరించాడు. తనకి చాలా డబ్బుందనీ ఆమె జాతకాన్ని మార్చేస్తాననీ చెప్పాడు. ఎన్నో ఆశలు పెట్టాడు"

"ఆ అమ్మాయి అతణ్ణి ప్రేమించిందా? "

"చెప్పేది విను. ఆ పిల్ల చాలా ఫాస్టు. గ్రాడ్యుయేషన్ అయ్యేదాకా తనకి పెళ్లి చేసుకునే ఉద్దేశం లేదని చాలా ఫ్రాంక్‌గా చెప్పింది. ప్రేమించడానికైతే అభ్యంతరం లేదటకానీ పెళ్లయ్యాక మొగుడేం మాట్లాడినా భరించక తప్పదు కాబట్టి కనీసం ప్రేమలోనైనా రొమాంటిక్ కబుర్లు వినాలనుకుంటోందట. అందుకని శశాంకని డైలాగ్ ఇంప్రూవ్ చేసుకోమంది"

"చిత్రంగా వుందే. ఆడపిల్లకి డబ్బే ముఖ్యమంటారు"

"అది మగాళ్లనేమాట. మా అమ్మనీ, మీ అమ్మనీ చూడు. వాళ్లేం చేసినా మొగుడి కోసమో, పిల్లల కోసమో అంతేకదా"

"అవుననుకో... కానీ పెళ్లికాని ఆడపిల్ల"

"డబ్బుదేముంది? ఈరోజొస్తుంది, రేపు పోతుంది. ముందు నేను నా కాళ్లమీద నిలబడగలిగాకే తర్వాత మగాడిమీద ఆధారపడాలనుకుంటాను అందట ఆ పిల్ల"

"వండ్రఫుల్. స్త్రీజాతికే గొప్ప సందేశం" అన్నాడు కాళిదాసు.

"మగజాతికి హెచ్చరిక" అన్నాడు భారవి.

"సరే. శశాంక మహాశయుడు ఇంకా ఏంచేశాడు? "

"గుడ్, ఇంప్రూవయ్యావు. శశాంకను మహాశయుడని మెయింటెయిన్ చేస్తున్నావు. అందుకే మనకి కబురొచ్చింది. తొందరగా రెడీకా. మనం శశాంకని కలవాలి"

"కలిసి ఏంచేస్తాం? "

"శశాంకని హీరో చేయడానికి మనం ఐడియాలివ్వాలి"

"అందువల్ల మనకేం లాభం? "

"ఇది లాభం కాదు. ఒకప్పుడు మనమిచ్చిన పదమూడు రూపాయల అప్పుకు కృతజ్ఞతగా శశాంక మనకిస్తున్న అద్భుత అవకాశమిది"

"అంటే? "

"శశాంక నిజజీవితంలో హీరో కావాలనుకుంటున్నాడు. హీరో అంటే తెలుసుకదా. వాడి మాటలు వాడివి కావు. వాడి పాటలు వాడివి కావు. వాడి తెలివి వాడిది కాదు. మొహం- అదొక్కటే వాడిది"

"కానీ శశాంక మొహం హీరోల మొహంలా వుండదే"

"అమితాబ్ బచ్చన్ గురించి ఒకప్పుడ



లాగే అన్నారు. ఇప్పుడాయన స్టారాఫ్‌ది మిలేనియం అని విదేశీయులచేత అనిపించు కున్నాడు. అందుక్కారణం ఆయనకొచ్చిన బ్రేక్. మన శశాంకకి డబ్బే బ్రేకునిస్తోంది. శశాంక హీరో కావడం ఖాయం. అతగాడు సాంకేతిక వర్గం కోసం వెతుకుతున్నాడు. కథ, మాటలు, పాటలు మనం రాయాలం టున్నాడు. మనకి మన సత్తా చూపించు కునే అవకాశం వచ్చింది."

"కానీ సాహిత్యం మనకి హాబీ మాత్రమే కదా"

"మల్లాది, యండమూరి సాహిత్యాన్ని హాబీగా మొదలెట్టారు. చివరికి ఉద్యోగాల్ని వదిలి సాహిత్యాన్నే వృత్తిగా చేసుకున్నారు. మనదేశంలో హాబీలే మనిషికి కూడు పెడ తాయి. అందుకే ప్రజాసేవకని నియమించ బడ్డ ప్రభుత్వోద్యోగులూ, మంత్రులూ కూడా పైవాళ్లని సంతోషపెట్టే భట్రాజు విద్యలని హాబీలుగా మార్చుకుని వాటిమీదే దృష్టిని కేంద్రీకరిస్తున్నారు. అదలాగుంచితే సినీఫీ ల్డులో టాలెంట్‌కంటే అవకాశం, అదృష్టం ముఖ్యమైనవి. మనకి అవకాశం వచ్చింది. అదృష్టం వుండబట్టే ఈ అవకాశం వచ్చిం దని నా నమ్మకం" అన్నాడు భారవి.

"యూ ఆర్ రైట్. నువ్వు నిద్రలేపే ముందు నేను కొత్త కథకు కథానాయిక గురించే దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను కలలో. బహుశా నా సిక్త్‌సెన్సు శశాంకకోసం ఓ హీరోయిన్ను వెతుకుతోందనుకుంటాను..." అంటూ కాళిదాసు తన కలను వివరించాడు.

"గురూ యూ ఆర్ రైట్, నీకల బాగుంది. మరి హీరోయిన్ దొరికిందా?"

"ఇంకొక్క నిముషం నన్ను నిద్రపోనిస్తే దొరికేదేమో"

"గురూ! మనకిది నిద్ర పోవాల్సిన సమ యంకాదు. పూర్తి మెలకువతో వ్యవహరించ డానికి నీ సిక్సుసెన్సుకు పదునుపెట్టు..."

"అయితే మనం త్వరగా తెమలాలి. బ్రష్ మీద పేస్టువేసి తీసుకునిరా"

"నిద్ర లేపడానికి కారణం చెప్పాను. మర్చి పోయావా?"

"సరేలే... నా పనులు నేనే చేసుకుం టాలే" అంటూ ఉపక్రమించాడు కాళిదాసు.

★ ★ ★

భారవి, కాళిదాసు వెళ్ళేసరికి శశాంక ఇంట్లో గొడవ గొడవగా ఉంది. సుమారు డజనుమంది ఏమేమో మాట్లాడుతున్నారు. మధ్యమధ్య కూనిరాగాలు ధ్వనిస్తున్నాయి. అప్పుడప్పుడు కుక్క మొరుగులూ వినబడు తున్నాయి.

"రండి, రండి..." అన్నాడు శశాంక వాళ్ళి ద్దర్నీ ఆప్యాయంగా చూస్తూ.

కాళిదాసు శశాంకను పరీక్షగా చూశాడు. మనిషి పొడగరి. రంగు చామనఛాయ. వ్యాయామం చేసిన శరీరం కాదుకానీ బొజ్జ లేదు. కురూపి అని కొందరనవచ్చేమోకానీ అందగాడు కాదని అందరూ అనవచ్చు

'సామాన్యుడు, రాజయోగం పట్టింది' అనుకున్నాడు కాళిదాసు మనసులో సామా న్యులకే రాజయోగం పట్టడం కలియుగ ధర్మమని తనకు తెలిసినప్పటికీ!

"ఇదంతా మన ట్రూపు. మంచి టీమ్ వర్కుంటే మంచి ఫలితాలు సాధించగలం" అన్నాడు శశాంక.

ఆ ట్రూపులో దర్శకుడు, సింగర్ కమ్ మ్యూజిక్ డైరక్టర్, వీడియో కెమేరామన్, కమెడియన్, ఇద్దరు ఫైటర్సు, ఓ ప్రొడక్షన్ మేనేజర్ ఉన్నారు. మిగతావాళ్ళు ఎక్స్‌ట్రా లుట.

"నువ్వు చాలా సీరియస్‌గా ప్లాన్ చేస్తున్న ట్లుందే" అన్నాడు కాళిదాసు.

శశాంక అతడివంక అదోలా చూశాడు. నన్ను నువ్వంటావా అంటున్నాయా చూ పులు. ఆ చూపుల అర్థాన్ని ముందుగా పసి కట్టిన భారవి, ఓ అడుగు ముందుకేసి కాళి దాసుముందు నిలబడి "శశాంకగారూ! ఈరోజు మిమ్మల్నిలా కలుసుకోవడం నా అదృష్టం. ఇకమీదట మీరు ఆజ్ఞాపిస్తారు.





నేను శిరసావహిస్తాను" అన్నాడు.

అప్పుడు వీడియో కెమేరామన్ పొజిషన్లోకి వెళ్లాడు. దర్శకుడు యాక్షన్ అన్నాడు.

"డబ్బు ఈరోజు ఉంటుంది. రేపు పోతుంది. మనమధ్య కలకాలం నిలబడేది స్నేహం మాత్రమే. నన్ను మీరు అని మన స్నేహాన్ని చిన్నబుచ్చవద్దు. ఎప్పటికీ ఇప్పటి లాగే ఉంటానని మాటివ్వు" అంటూ శశాంక తనచేతిని సాచాడు. భారవి ఆ చేతిలో చెయ్యివేశాడు. వెంటనే శశాంక భారవిని బలంగా కౌగలించుకుని, "అదృష్టం నీది కాదు, నాది" అన్నాడు.

"కట్" అన్నాడు దర్శకుడు. అంతా చప్పట్లు కొట్టారు. అప్పుడు దర్శకుడు భారవిని పక్కకు తప్పుకోమని, "ఏక్షన్" అన్నాడు. భారవి పక్కకు తప్పుకుంటూ మిత్రుణ్ణి గిల్లి వెళ్లాడు. కంప్యూటర్ చిప్‌లా అతడి గోళ్ళు కాళిదాసులోకి ఎన్నో సందేశాలు పంపాయి.

"శశాంకగారూ! ఈరోజు మిమ్మల్నిలా కలుసుకోవడం నా అదృష్టం. ఇకమీదట మీరు ఆజ్ఞాపిస్తారు. నేను శిరసావహిస్తాను" అన్నాడు కాళిదాసు.

వీడియో కెమేరామన్ పొజిషన్లో ఉన్నాడు. శశాంక, "డబ్బు ఈరోజుంటుంది..."తో మొదలుపెట్టాడు. శశాంక అతణ్ణి కౌగలించుకుని, "అదృష్టం నీదికాదు, నాది" అనేదాకా ఆ సీను కొనసాగింది.

దర్శకుడు కట్ అన్నాక, "నా జీవితంలోని మధుర ఘట్టాలు, వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించే సంఘటనలు ఇలా చిత్రీకరించడం జరుగుతుంది. ముందు తరాలవారు నిజజీవితంలోని హీరో గురించి తెలుసుకోవాలికదా" అన్నాడు శశాంక.

"మీ అయిడియా గొప్పగా ఉంది" అన్నాడు కాళిదాసు.

"అదిగో- మీరని మాట తప్పుతున్నావ్" అన్నాడు శశాంక.

"కాళిదాసు ఇంకా సిట్యుయేషన్‌కి అడ్జస్టవలేదు. ఏమీ అనుకోకు శశాంక! మనవాడు తొందరగానే పికప్ చేస్తాడని నేను నీకు మాటిస్తున్నానుగా" అన్నాడు భారవి.

దర్శకుడు భారవివంక చురుగ్గా చూసి, "నీ మిత్రుడు బాగానే పికప్ చేశాడు. ఇంకా నువ్వే వెనకబడ్డావు. నువ్వు అడపాదడపా శశాంకని మీరంటూనే వుండాలి. మాట తప్పుతున్నందుకు శశాంక నిన్ను హెచ్చరిస్తూనే వుండాలి. ఈ మిక్సప్పే మన స్టోరీకి హైలైట్" అన్నాడు.

"అయాం సారీ. ఇంతకీ మా డ్యూటీ ఇంకేమైనా వుందా ఈ మిక్సప్పేనా? " అన్నాడు భారవి టాపిక్ మారుస్తూ.

"మీ డ్యూటీ చాలా వుంది. మీరు లేక ఈరోజు డైలాగ్సుకోసం మథనపడి చివరకు ఓ సినిమాలోంచి కాపీకొట్టి వాడాను. ఇకమీదట డైలాగ్సు విషయం మీ ఇద్దరికీ వదిలి పెడుతున్నాను. నేను సిట్యుయేషన్ స్పెషలిస్టుని. సిట్యుయేషన్ చెప్పగానే మీరిద్దరూ దానిచుట్టూ మంచి కథ అల్లి డైలాగ్సు రాయాలి. అర్థమయిందా? " అన్నాడు దర్శకుడు.

"ఇంతకీ సిట్యుయేషన్ ఏదైనా రెడీగా ఉంటే చెప్పు. శాంపిల్ చేద్దాం" అన్నాడు భారవి.

"శాంపిల్ కాదు, వియార్ బిగినింగ్ విత్ వెరీ వెరీ పవర్‌ఫుల్ సిట్యుయేషన్. ఆ తరువాత కథంతా దానిమీదే ఆధారపడి ఉంటుంది" అన్నాడు దర్శకుడు.

"ఊఁ" అన్నాడు భారవి.

ఉన్నట్లుండి అక్కడి వాతావరణమంతా నిశ్శబ్దంగా అయిపోయింది. దర్శకుడు గొంతు సవరించుకుని "మన హీరోకి ఓ అద్భుతమైన హీరోయిన్ని పెట్టాం. అందంలో వెండితెర ఐశ్వర్య. అభిరుచులకు పురాణాల అనసూయ. ఆ అమ్మాయిని మన శశాంక అనుకోకుండా ఏకాంతంలో కలుసుకోవాలి. అందుకు మంచి సిట్యుయేషన్ సృష్టించాలి" అన్నాడు.

"డన్" అన్నాడు భారవి.
"అనుకోని పరిస్థితుల్లో మన హీరో అపరిచితురాలైన హీరోయిన్ని రేప్ చేస్తాడు"
ఈసారి భారవికంటే తాను ముందుండాలని "డన్" అనబోయాడు కాళిదాసు. కానీ అభిరుచులకి అనసూయ అయిన ఆడపిల్లకి అపరిచితుడితో బలాత్కారయోగాన్ని తలచుకోగానే అతడి శరీరం నిలువెల్లా కంపించింది.



అప్పుడే స్నానంచేసి తడి ఆరని వంటితో అద్దంముందు నిలబడింది శకుంతల. అందమైన ప్రతిబింబం ఆమెని "హలో" అని పలకరిస్తున్నట్లు చూస్తోంది.
సమర్థుడైన చిత్రకారుడు తన బొమ్మని చూసుకుని తనే మురిసిపోయినట్లు మురిసిపోతోంది శకుంతల.
ఉన్నట్లుండి "హాయ్" అన్న పలకరింపు వినిపించి ఉలిక్కిపడిందామె. అయితే ఆ పిలుపు అద్దంలోంచి వచ్చింది.
'నా ప్రతిబింబం నన్ను పలకరిస్తోంది' అనుకుందామె.
"ఏమిటే, అచ్చం నాలాగే వున్నానని నీకు గర్వమా? " అంది స్వగతంలా.





"హలో! నేను ప్రతిబింబాన్ని కాదు, అద్దాన్ని"
సన్నని, తీయని స్వరం. అద్దం ప్రాణం లేనిదని తెలిసీ శకుంతల రవంత తొట్రుపడింది. అప్రయత్నంగా ఆమె రెండుచేతులూ ఛాతీకి అడ్డమయ్యాయి.
"నా ముందు నీకు సిగ్గా? ఇంతకాలంలేని ఈ సిగ్గు ఇప్పుడెక్కణ్ణించి వచ్చింది? " అద్దం ఆమెని నిలదీసింది.
"మరి నువ్వు మాట్లాడే అద్దంగా మారావుగా"
"మారాను. నీలో సిగ్గు పుట్టించాలని కాదు. నీకు థాంక్స్ చెప్పాలని"
"నాకు థాంక్సా, ఎందుకు? "
"నాకు అందాన్నిచ్చే ప్రతిబింబాన్నిచ్చావు. మరి థాంక్స్ చెప్పొద్దూ? "
"ఛీ... ఫో!"
"అప్పుడే ఎక్కడికి పోతాను తల్లీ? ఇంకా నీతో చాలా మాట్లాడాలిగా" అంటూ అద్దం వెనకనుంచి ముందుకు వచ్చిందో అమ్మాయి.
క్షణంపాటు అప్రతిభురాలై "నువ్వా? " అంది శకుంతల. ఉన్నట్లుండి వెనక్కి తిరిగి పరుగున వెళ్లి మంచంమీంచి తువ్వాలు తీసి వంటికి చుట్టబెట్టుకుంది.
"నాకింకా తనివితీరలేదే. ప్లీజ్, మరికాసేపు చూడనీ" అందా అమ్మాయి.
"అద్దాన్నని అబద్ధం చెబుతావా? " చిరుకోపంతో, పెనుసిగ్గుతో అంది శకుంతల.
"అబద్ధం చెబితే నమ్మేస్తావా? ఏ లోకంలో వున్నావే తల్లీ? " అందా అమ్మాయి.
"ఏమో ఈరోజు నా మనసుకి చాలా ఉల్లాసంగా వుంది. ఈ జన్మకి మరచిపోలేని గొప్ప అనుభూతి నాక్కలగబోతోందని మనసు చెబుతోంది. స్నానాలగదికి వెడితే గది గోడలు నన్ను పలకరించాయి. షవర్ నీళ్లు ప్రేమగా నా వళ్లు నిమిరాయి. సబ్బు నురగ నాతో ఆడుకుంది. తువ్వాలు నన్ను లాలించింది. అలాగే అద్దమూ మాట్లాడింద

నుకున్నాను"

"బాత్రూంలోకి వెళ్లేముందే నీ పరిస్థితి గమనించాను. నేను బెడ్రూంలో ఓ మూల నున్నప్పటికీ మామూలుగా అయితే నన్ను చూసి వుండేదానివి. బెడ్రూం తలుపులు మూశావు, నన్ను చూడలేదు. గడియ వేశావు, నన్ను చూడలేదు. బాత్రూంలో దూరావు నన్ను చూడలేదు. స్నానంచేసివ చ్చాక నేను నిన్ను చూడాలనుకున్నాను, చూశాను అబ్బ... ఎంత గొప్ప అందమే నీది? !"

"అబ్బ... నా అందం నీకు ఈరోజే తెలిసిందా? ఇంతకు ముందెన్నడూ నన్ను చూడలేదా? " మొహమాటపడుతూ అంది శకుంతల.

"చూశాను. కానీ మనిషికోసం మనిషి చేసిన దుస్తులకంటే అస్థిపంజరానికి భగవంతుడు తొడిగిన దుస్తులు ఎంత గొప్పవో ఇప్పుడే నాకు అర్థమయింది"

"అబ్బ... అలా మాట్లాడకే, నాకు సిగ్గేస్తోంది"

"నీ సిగ్గు పోవాలంటే ఓ మార్గముంది. నేను మగాడినని ఓ అబద్ధం చెబుతాను. నువ్వు అబద్ధాలు నమ్మే మూడ్‌లో వున్నావు కాబట్టి అది నమ్మి నన్ను కౌగలించుకునే దాకా వస్తావు నువ్వు. అవునా? " అందా అమ్మాయి.

"నా గురించి నువ్వేమనుకుంటున్నావు? ఏకాంతంలో అబ్బాయి కనిపించాలని ఆరాటపడిపోతున్నాననా? నువ్వు చూశావనే సిగ్గుతో నా వళ్లు చచ్చిపోతూంటే... నువ్వే మగాడైవుంటే నేనే చచ్చిపోదునేమో. నా గురించి నీకు తెలియదా? "

"నా గురించి నాకు తెలీదు. నీ గురించి నీకు తెలీదు. అదీ వయసు ప్రభావం. ఎన్నో ప్రేమకథలకి రసపుష్టినిస్తున్నది ప్రేమకాదు, వయసు"

"సరే. మన మాటలు చర్చలుగా మారుతున్నాయి. ఈ విషయం ఇక్కడితో ఆపుదాం. ఎందుకంటే నా అభిప్రాయంలో ప్రేమ, వయసు వగైరాలన్నింటికంటే సంప్రదాయం గొప్పది. సంప్రదాయం గొప్పదైతే సమాజం గొప్పదవుతుంది"

"నేను అద్దాన్నంటే నమ్మావు. ఇప్పుడు సంప్రదాయం గొప్పతనాన్ని నమ్ముతున్నావు. తల్లీ! నీ మెదడెందుకో ఈరోజు భ్రమలకి నిలయమైంది" అందా అమ్మాయి.

"నీ పేరు దర్పణి కదా. అందుకని నువ్వు అద్దానివంటే నమ్మాను. అలాగే సంప్రదాయం విషయంలోనూ పొరబడలేదని నమ్ముతావుగా"

"ఎవరి పిచ్చి వారికానందం"

"కానీ, నీ పిచ్చి నాకానందం కాదు. నువ్వు బయటకు వెడితేనే నేను బట్టలు మార్చుకుంటాను మరి" అంది శకుంతల.

★ ★ ★

దర్పణి, శకుంతల రెండేళ్లుగా స్నేహితురాండ్రు. ఇద్దరూ కాలేజిలో బియ్యే రెండో సంవత్సరం చదువుతున్నప్పటికీ, ఇద్దరిదీ ఓ కాలేజి కాదు. ఒకరోజున థియేటరువద్ద కలిశారిద్దరూ. ఇద్దరికీ టికెట్లు దొరకలేదు. ఇద్దరూ బ్లాకులో టికెట్లు కొనడానికి ఇష్టపడలేదు. మాటలు కలిశాయి. ఇద్దరూ ఒకరికొకరు నచ్చారు. స్నేహం మొదలయింది, బలపడింది.

దర్పణి తల్లిదండ్రులిద్దరూ డాక్టర్లు. నాలుగు చేతులా సంపాదిస్తున్నారు. వారింట్లో అన్ని సదుపాయాలూ వున్నాయి. కానీ దర్పణి ఆ ఇంట ఒంటరి. తను ఒంటరినని దర్పణికి తెలీదు. డబ్బుకు లోటులేని ఆమెచుట్టూ చాలామంది చేరారు స్నేహంపేరిట. వారిలో అబ్బాయిలూ వున్నారు. అమ్మాయిలూ వున్నారు. దర్పణిది కాస్త దుడుకు స్వభావం. అయినా ఎవరూ ఆమెని తప్పుపట్టేవారు కాదు. దర్పణి స్వేచ్ఛని నమ్ముతుంది. అందుకని అబ్బాయిలు ఆశగా ఆమె చుట్టూ తిరిగేవారు. దర్పణికి సంప్రదాయం తెలుసు. దాన్నెదిరి



స్తేనే తప్పు స్త్రీకి స్వేచ్ఛ వుండదని అనుకుంది. అటు తల్లిదండ్రులు, ఇటు స్నేహితులు ఆమెని తప్పుపట్టలేదు. అయినా ఆమె ఇంకా తప్పు చేయలేదు. అందుక్కారణం ఆమెకీ అంతుపట్టడం లేదు.

పరమత సహనం, శాంతి సంప్రదాయమైతే ఒసామాబిన్ లాడెన్ ఆఫ్ఘనిస్తాన్‌లో మకాంపెట్టి దానికి ఎదురు తిరిగాడు. అటు రష్యాకూ, ఇటు ఇండియాకూ బెంబేలెత్తించే ఉగ్రవాదాన్ని నిర్వహించాడు. రష్యా తోక ముడిస్తే, ఇండియా అవాక్కైతే ఎన్నేళ్లు నిర్వహించినా ఉగ్రవాదం అతడికి తృప్తినివ్వలేదు. 2001లో సెప్టెంబరు 11న అతడు అమెరికాని రెచ్చగొట్టి తృప్తిచెందాడు.

సంప్రదాయాన్నెదిరించాలనుకునే వారికి రెచ్చిపోయేవారు కావాలి. దర్పణికి తల్లిదండ్రులు స్వేచ్ఛనిచ్చారు. స్నేహితులు ఆమోద ముద్రనిచ్చారు. సమాజం ఆమె డబ్బుకి తలవంచగలనంటోంది. ప్రతిఘటనలో దర్పణికి మజా కనిపించలేదు.

అంతేకాదు. ఆమె పురుషుడిచేతిలో మర బొమ్మ కావాలనో, పురుషుడి వినోదానికి ఆటబొమ్మ కావాలనో అనుకోవడంలేదు. జీవితంలో ఏదో సాధించాలనీ, సమాజానికి తానూ ఏమైనా ఇవ్వాలనీ కోరుకునే ఆమె ఆలోచనల్లో శృంగారానికి ప్రముఖస్థానం లేదు. అందువల్ల కూడా ఆమె సంప్రదాయం దేన్నైతే తప్పు అందో ఆ తప్పుజోలికి ఇంకా వెళ్లలేదు.

ఇలాంటి పరిస్థితుల్లో థియేటరువద్ద బ్లాక్ టికెట్‌ను నిరసించిన శకుంతల ఆమెని ఆకర్షించింది. మరెప్పుడైనా అయితే బ్లాకులో టికెట్ కొనేదేమోగానీ ఆ క్షణంలో శకుంతల ఆదర్శమే ఆమెకీ ఆదర్శమైంది. ఇద్దరి స్నేహానికీ దారితీసింది.

చాలా విషయాల్లో శకుంతలకి ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. ప్రతి అభిప్రాయం వెనుకా తార్కికమైన వివరణ వుంది. ఆమె చాలా పట్టుదలగా తన అభిప్రాయాలని పాటిస్తుంది. అయితే ఏ అభిప్రాయాన్నీ ఇతరులమీద రుద్దదు. ఇతరుల అభిప్రాయాన్ని తనపై రుద్దనివ్వదు.

శకుంతలతో పరిచయమైనాక దర్పణికి తన అభిప్రాయాలపట్ల తనకి సరైన అవగాహనలేదని అర్థమైంది. ఇద్దరూ చాలాసార్లు ఎన్నో విషయాలపై వాదించుకున్నారు. ఒక్కోసారి ఆ వాదన తీవ్రతరంగా మారేది. అయినా వారి స్నేహం చిక్కుల్లో పడలేదు.

శకుంతల స్నేహం దొరికాక దర్పణికి ఒక విషయం తెలిసింది. మనచుట్టూ వుండే వారు మన అభిప్రాయాలకి అనాలోచితంగా తల ఊపినంతకాలం వారెంతమంది వున్నా మనం ఒంటరిగానే వుండిపోతాం. అభిప్రాయాల్లో విభేదించడంలోనో, అభిప్రాయాలని చర్చకు పెట్టడంలోనో మన ఒంటరితనం మాయమవుతుంది.

అంతకాలం తను ఒంటరిననీ శకుంతలే తనకి ఒంటరితనం నుంచి విముక్తిని కలిగించిందనీ దర్పణికి అనిపించింది. అప్పట్నించీ ఆమెలో శకుంతలపట్ల ప్రేమ పుట్టింది. ఆ ప్రేమ దినదినప్రవర్ధమానం అవుతూ వచ్చింది.

అసహనం, అసూయ కూడా ప్రేమలోంచే పుడతాయి. తాను శకుంతలనుంచి ఎంతో తీసుకున్నదనీ శకుంతలకి తానేమీ ఇవ్వలేక పోతున్నదనీ దర్పణికి తరచుగా అనిపిస్తూండేది. అలాగే ఎప్పుడూ తనకంటే ఎత్తులోనే వున్నట్లు కనబడే శకుంతలని చూస్తే ఆమెకి అసూయగానూ వుండేది.

శకుంతల తెలివైనది, మంచిది, అమాయకురాలు.

దర్పణి తెలివైనది. చెడ్డది కాదు, గడసరి.

ఈ భేదాన్ని దర్పణి పసికట్టింది. ఆమెలోని అమాయకత్వాన్ని పారద్రోలడానికి నడుంకట్టింది. ఫలితంగా ఇద్దరూ సంప్రదాయం గురించి పదేపదే చర్చలకి దిగేవారు.

"పాము కాటు వేస్తుంది. డాక్టరు మందు




లతో విషాన్ని విరిచేస్తాడు. విషం ఎలాగ శరీరగతమో శీలమూ అంతే. సంప్రదాయం శీలానికి చాలాచాలా ప్రాధాన్యతనిచ్చింది. దాన్నెదిరించడానికి ప్రతి మగువా శీలం కోల్పోయి అప్పుడు పెళ్లి చేసుకోవాలి" అంటుంది దర్పణి.

"శీలం స్త్రీ పురుష సంబంధంతో ముడిపడింది. స్త్రీ పురుష సంబంధం శారీరకమైనప్పుడు అది జంతుసంబంధం. మానసికమైనప్పుడు శాశ్వతానుబంధం. ఈ సంప్రదాయాన్ని నమ్మడంలోనే మానవజాతి పురోగతి వుంది. ఆ విషయం ఎన్నోసార్లు రుజువైంది" అంటుంది శకుంతల.

వారిద్దరి చర్చల్లో ఎన్నో స్త్రీ పాత్రలు దొర్లేవి.

గాంధారికి ఆమె ఇష్టంతో నిమిత్తం లేకుండా గుడ్డివాణ్ణిచ్చి కట్టబెట్టారు. ఆమె సంతానం సర్వనాశనమైంది. కుంతిని సూర్యుడు బలవంతంగా అనుభవిస్తే కర్ణుడు పుట్టి సర్వసమర్థుడైనా అష్టకష్టాలూ పడ్డాడు. అదే కుంతి ఇష్టపడి యమ, వాయు, ఇంద్ర దేవులను రప్పించుకుంటే అది సంప్రదాయంలో అరుదే అయినా ఆమెకి పుట్టిన బిడ్డలు భారత వీరులనిపించుకున్నారు. ద్రౌపది తాను ప్రేమించిన అర్జునుడితోబాటు అతడి అన్నలనూ భర్తలుగా స్వీకరించవలసివస్తే ఆమె పాతివ్రత్యం భర్తలని కాపాడిందేమోగానీ బిడ్డలకు చిరాయువు నివ్వలేదు.

ఈ విశ్లేషణ అంతా విన్నాక "అవునులే... ప్రియుడినే భర్తగా భావించి సంతానవతియైన శకుంతల పేరు నీది. మన పుణ్యభూమికి పేరునిచ్చిన మహనీయుడికి జన్మనిచ్చిన ఆ తల్లి గుణాలన్నీ నువ్వు పుణికిపుచ్చుకున్నావు. నీ విషయంలోనూ ఆ శకుంతల కథే రిపీట్ అయితే ఏం చేస్తావు? " అంది దర్పణి ఒకసారి.

"ఆ అవకాశం లేదు. ఎందుకంటే గాంధర్వ వివాహాన్ని నేను నమ్మను" అంది శకుంతల.

"ఎందుకని?

"ఈ రోజుల్లో అవి నప్పవు"

"పెళ్లికి ఈ రోజులూ ఆ రోజులూ అని వుండవు. అన్ని రోజులూ ఒకటే. ఇంకా చెప్పాలంటే ఈ రోజుల్లో జరిగే పెళ్లిచూపుల తతంగముందే ఒకవిధంగా అది గాంధర్వ వివాహమే అనిపిస్తుంది. శారీరక సంబంధం లేదంతే" అంది దర్పణి.

పెళ్లిచూపుల్లో వరుడు, వధువు పరస్పరం చూసుకుంటారు. కలల్లో తేలిపోతారు. అతడి కలల్లో ఆమె, ఆమె కలల్లో అతడు. ఒకరికొకరు చేరువౌతారు. తర్వాత ఉత్తరం రాశామంటారు వరుడి పెద్దలు. ఎక్కడో మాటల్లో తేడా వస్తుంది. సంబంధం కుదరదు. అమ్మాయికీ, అబ్బాయికీ వేరెవరితోనో మళ్లీ పెళ్లిచూపులు. అలా ఇంకా ఎన్నో. చివరికి పెళ్లి. అయితే ఆ వధూవరులు అప్పటికెన్ని పెళ్లిళ్లు చేసుకున్నట్లు? "

"నువ్వు చెప్పింది నిజమే. ఈ విషయమై బాగా ఆలోచించాలి" అంది శకుంతల.

"ఏమిటాలోచిస్తున్నావు? పెళ్లిచూపులు లేకుండానే నీకు పెళ్లి కుదురుతుందనుకుంటున్నావా? " నిలదీసింది దర్పణి.

"ఇప్పుడు మనకి పెళ్లి కబుర్లెందుకు? ఇంకేమైనా మాట్లాడు" అంటూ అప్పటికి మాట మార్చింది శకుంతల.

అప్పట్నుంచీ దర్పణికి శకుంతల గురించిన ఆలోచనలు మరింత ఎక్కువయ్యాయి. ఆమె జీవితంపై ఏదైనా వింత ప్రయోగం చేయాలన్న కోరిక ఆమె మనసులో రోజురోజుకీ పెరుగుతోంది.

ఈరోజామె తొలిసారిగా శకుంతల నగ్న సౌందర్యాన్ని చూసింది.

"సందేహంలేదు. శకుంతల తనువులో వయసుక్కూడా అందని మెరుపులేవో వున్నాయి. నాకైతే భగవత్సాక్షాత్కారం లభించినట్లు అపురూపమైన అనుభూతి కలిగింది. కానీ ఇలాంటి పరిస్థితి శకుంతలకీ



పురుషుడికీ మధ్య ఏర్పడితే ఏం జరుగుతుంది? ఆ పురుషుడి భావాలెలా వుంటాయి? శకుంతల స్పందన ఎలా వుంటుంది? " అని ఆలోచిస్తోంది దర్పణి. ఆలోచిస్తున్నకొద్దీ ఆమెలో కుతూహలం పెరిగిపోతోంది.

★ ★ ★

బట్టలు మార్చుకుని వచ్చింది శకుంతల. దర్పణి తననే అబ్బురంగా చూస్తూంటే "ఇంకెప్పుడు రమ్మన్నా నేను నీ ఇంటికి రాను. నీ చూపులు నాకు ఇబ్బందిగా వున్నాయి" అందామె.

"ఉంటే ఉండనీ. నిన్ను మరింత ఇబ్బంది పెట్టాలనే ఈరోజు నిన్ను రప్పించింది"

"ఇంకా ఏం ఇబ్బంది పెడతావు? " అంది శకుంతల నిట్టూరుస్తూ.

"మా ఇంటికొచ్చి ఇక్కడే స్నానంచేసి ఫ్రెష్‌గా డ్రెసప్ కావాలని నేను నీకెందుకు చెప్పాననుకుంటున్నావు? నా ఫ్రెండ్సు కొందరు నిన్ను చూడ్డానికొస్తున్నారు. ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్ ది బెస్ట్ ఇంప్రెషన్ కదా! వాళ్లు చూసే చూపులు నిన్నెంత ఇబ్బందిపెడతాయో చూడాలన్నదే నా తాపత్రయం"

"ఫ్రెండ్సంటే? "

"ఇంతకాలం నాకు స్నేహాన్నిస్తూ నా ఒంటరితనాన్ని పోగొట్టలేకపోయినవాళ్లు, నీలోని ప్రత్యేకత ఏమిటో తెలుసుకోవాలని తాపత్రయపడుతున్నవారు. అర్థమయిందా? "

"దర్పణి నన్ను తన ఫ్రెండ్సు ముందు ఆకాశానికెత్తేసినట్లుంది. అలాంటప్పుడు వాళ్ల చూపులు నాకు ఇబ్బందే" అనుకుంది శకుంతల. అయితే ఆమె మనసులో ఇంకో భయంకూడా వుంది. అందులో అబ్బాయిలెందరో అని.

కానీ శకుంతల భయం వృథాగా మారింది. ఆమెని చూడ్డానికి వచ్చిన ఆరుగురూ అమ్మాయిలే. అందరూ నిండు యౌవనంతో మిసమిసలాడిపోతున్నారు. శకుంతలని చూసి వాళ్లు నిజంగానే వావ్ అన్నారు. వాళ్ల చూపుల ఇబ్బందిని తప్పించుకోవడం కోసం శకుంతల వాళ్లతో తన అలవాటుకు మించి కలుపుగోలుగా మాట్లాడింది. చాలా తక్కువ వ్యవధిలోనే వాళ్లు ఆత్మీయుల్లా కలిసిపోయి అంతవరకూ మాట్లాడని ఎన్నో విశేషాలు చెబితే దర్పణి కూడా ఆశ్చర్యపోయింది.

"ఏమిటర్రా మీరు, నాతో ఎప్పుడూ ఇలా ఉండలేదు? " అంది దర్పణి.

"ఏమో, ఈరోజు మనమంతా అక్కచెల్లెళ్ల మనిపిస్తోంది" అందో అమ్మాయి.

"అయితే అక్కలెవరు? చెల్లెళ్ళెవరు? " అంది శకుంతల.

"మిగతావాళ్ళ సంగతి నాకు తెలియదు. నేను మాత్రం చెల్లినే" అందో అమ్మాయి.

"ఆమాట ప్రవీణ్ దగ్గర అను. ఆత్మహత్య చేసుకుంటాడు..." అంది దర్పణి.

ప్రవీణ్ ఆమెకు ప్రియుడని అర్థమై, "ఏంటీ నువ్వూ, ప్రవీణ్ ప్రేమించుకున్నారా? " అంది శకుంతల.

ఆ అమ్మాయి తలాడించింది.

"మరి పెళ్లెప్పుడు చేసుకుంటారు? " అంది శకుంతల.

"పెళ్ళా- ఆ విషయం మేమెప్పుడూ అనుకోలేదు. ప్రవీణ్ ఈజ్ జస్ట్ మై బాయ్ ఫ్రెండ్, అంతే" అందా అమ్మాయి తేలికగా.

"బాయ్ ఫ్రెండ్ అంటున్నావు. చెల్లిని కానంటున్నావు. ప్రేమంటున్నావు. పెళ్ళిలేదంటున్నావు. ఇంతకీ మీ వ్యవహారం మొత్తానికి పేరేమిటి? " అంది శకుంతల.

"పేరంటే- నువ్వన్నదే. ఇంగ్లీషులో ఎఫైర్ అంటారు" అందింకో అమ్మాయి.

"ఎఫైర్ తప్పుకదూ" అంది శకుంతల.

"సరే, ఒక అక్క తెలిసింది. మిగతా అక్కలెవరో తెలుసుకుందుకు ఇంకో టెస్టు" అంది దర్పణి.

"అంటే మీరంతా కలిసి నన్ను ర్యాగింగ్ చేస్తున్నారా? మనలో అక్కలెవరూ లేరు.




మనమందరం కవల పిల్లలం" అంది శకుంతల.

అందరూ నవ్వి, "ఇది బాగుంది" అన్నారు.

"మనం కవల పిల్లలనడం బాగానే ఉంది కానీ శకుంతలను అక్క అంటే అదే ర్యాగింగా? మీలో ఎవ్వరికీ అసలుసిసలు ర్యాగింగు గురించి తెలిసినట్లులేదు..." అంది దర్పణి.

"నీకు తెలుసా? "

"తెలుసు. మీరంతా ఒప్పుకుంటే మా ఇంట్లో ఎల్లుండికి ర్యాగింగ్ ఏర్పాట్లు చేస్తాను. ప్రత్యక్షంగా తెలుసుకుందురు గాని..."

"ఏంచేస్తావ్? "

"ముందుగా చెబితే సస్పెన్సు పోతుంది కదా, ర్యాగింగ్‌లోని మజా అంతా సస్పెన్సులోనే" అంది దర్పణి.

"ఒకే" అన్నారు ఆడపిల్లలంతా ఏకకంఠంతో.

★ ★ ★

శకుంతల ఇల్లు చేరేసరికి గుమ్మంలోనే అమ్మమ్మ ఎదురై, "ఏమిటమ్మా- ఇంత ఆలస్యం. ఎక్కడికెళ్ళావ్? " అంది.

"డాక్టరుగారింట్నించి వస్తున్నా అమ్మమ్మా" అంది శకుంతల.

"పెళ్ళీడు పిల్లవి. నువ్వు కాస్త తిరుగుళ్ళు తగ్గించుకోవాలి" అంది అమ్మమ్మ.

"అమ్మమ్మ అలా అందని ఏమీ అనుకోకమ్మా. నువ్వెంత బుద్ధిమంతురాలివో ఇంటిల్లిపాదికీ తెలుసు. ఎటొచ్చీ ఈరోజే మంచి పెళ్ళిసంబంధం వస్తే అత్తయ్యకిలాంటి ఆలోచనలన్నీ వస్తున్నాయి. అంతే" అంటూ అత్త ఆమెకు అసలు విషయం వివరించింది.

"బాగుంది మరి పెళ్ళెప్పుడు? " అంది శకుంతల నిర్లిప్తంగా.

"ఇంకా పెళ్ళిచూపులే కాందే, అప్పుడే పెళ్ళేమిటే మరీ విడ్డూరంగా మాట్లాడతావు" అంది అమ్మమ్మ చిరాకు పడుతూ.

"మీరేబ్బాయిని చేసుకోమన్నా చేసుకుంటాను. మీరు తెచ్చిన సంబంధానికి ఏవంకలూ పెట్టను. కానీ పెళ్ళిచూపులు మాత్రం నాకిష్టంలేదు. ముందు అన్ని మాటలూ మాట్లాడుకోండి. అబ్బాయిని నాకు తెలీకుండా నన్ను చూడమనండి. పెళ్ళి నిశ్చయమయ్యేదాకా నేను మాత్రం అతణ్ణి చూడమన్నా చూడను" ఖచ్చితంగా చెప్పేసింది శకుంతల.

"ఎందుకు చూడవు? "

"ఆలోచించు. నీకే తెలుస్తుంది. ఆలోచించవూ, నీకు చెప్పినా తెలియదు"

"తెలియకపోతే పోయిందికానీ చెప్పి చూడమ్మా. నాకు ఆలోచించే అలవాటు లేదు"

"అత్తయ్యా, అమ్మమ్మకు నువ్వే చెప్పు" అంటూ లోపలకు వెళ్ళిపోయింది శకుంతల.

"ఏమిటీ అదంటుంది? " అంది అమ్మమ్మ.

"ఏమీ లేదత్తయ్యా, మీ మనవరాలు మనందరికంటే చాలా గొప్పది. మనం పతివ్రతలమేకానీ తను ప్రియవ్రత" అంది శకుంతల అత్త.

"ప్రియవ్రతేమిటే? " అడిగింది అమ్మమ్మ ఆశ్చర్యంగా.

"ముందొకళ్లని ప్రేమించి తర్వాత ఇంకొకళ్ళని పెళ్ళిచేసుకుని కట్టుకున్నవాడికే కట్టుబడి ఉండేవాళ్ళు పతివ్రతలు. ఒకసారి ఒకణ్ణి ప్రేమించాక పెళ్ళైనా కాకపోయినా ప్రియుడికే జీవితాంతం కట్టుబడి ఉండేవాళ్ళు ప్రియవ్రతలు. మనదేశాన్ని పతివ్రతలనుంచి ప్రియవ్రతలవైపు మళ్లిస్తానని మీ మనవరాలు కంకణం కట్టుకుంది. ఆ నడక ముందుకో, వెనక్కో కాలమే చెబుతుంది కానీ శీలానికి సంబంధించినంతవరకూ ప్రియవ్రతను అలనాటి పతివ్రతలు కూడా మించలేరు" అంది అత్త.

"ఏడిసింది. దీనికిదేం పిచ్చి? వీళ్లమ్మేమో చిన్నప్పుడు మా ఇంటావంటా లేని ప్రేమ

పేరు చెప్పి ఎవడో కులంకానివాణ్ణి చేసుకుంటానని పట్టుబడితే నేనూ, మీ మావయ్యా కూడా ప్రాణాలు తీసుకుంటామని బెదిరిస్తే చెప్పిన మాట వింది. ఇప్పుడు నిక్షేపంగా అమెరికాలో వుంది. అన్నీ చేసి తనదాకా వచ్చేసరికి మళ్లీ తన కూతురు సంప్రదాయాన్ని కాదనకూడదని పిల్లను మా దగ్గర వదిలింది. ఎక్కడో ఏ మూలో దీనికీ దాని పిచ్చి వున్నట్లుంది" అంది అమ్మమ్మ.

"అలాగంటారేమిటత్తయ్యా? అమ్మాయి మీరు చెప్పినవాణ్ణే చేసుకుంటానందిగా"

"అంటే మాత్రం పెళ్లిచూపులు వద్దంటే ఎలా? " అని విసుక్కుంది అమ్మమ్మ.

రాత్రి భోజనాలయ్యేక శకుంతలకి తాతగారిచేత పెళ్లిచూపుల గురించి చెప్పించిందమ్మమ్మ. శకుంతల ఆయన దగ్గర ఏమీ నోరెత్తకపోతే ఎంతో సంతోషించిందావిడ. అయితే పడుకోబోయేముందు శకుంతల అమ్మమ్మ దగ్గరకి వెళ్లి "పెళ్లిచూపులకి ఒప్పుకుంటున్నాను. కానీ చూపులయ్యాక పెళ్లి కుదరలేదో... అంతే మరి" అంది.

"ఏమిటే బెదిరిస్తున్నావు, ఏం చేస్తావే మిటి? "

"పెళ్లికొడుకుని చంపేసి జైల్లోకెళ్లి కూర్చుంటాను"

అమ్మమ్మ ఉలిక్కిపడి మనవరాలివంక చూసింది. ఆమె కళ్లల్లో కనబడ్డ దృఢ నిశ్చయం చూసి ఆవిడ మరింత భయపడి "పెళ్లి చేసుకోనంటే చంపేస్తావా? ఇదేం చోద్యమే? " అంది.

"నేను వాణ్ణి చూడకుండా పెళ్లికి ఒప్పుకుంటున్నాను. వాడికేమొచ్చె... అయినా చాటుగా నాకు తెలీకుండా చూసి పెళ్లి చేసుకోవచ్చునన్నాను కదా. అలా చేయడానికేం? ఇంత కన్సెషనిచ్చినా అర్థం చేసుకోనివాణ్ణి బ్రతకనివ్వకూడదు. అమ్మమ్మా! మనం పతివ్రతలుగా వుండడంవల్లనే మగాళ్లు బ్రతికిపోతున్నారు. ప్రియవ్రతలుగా మారేమనుకో... అప్పుడే మగాళ్లకి ఇబ్బందీ, ఆడవాళ్లకి అభివృద్ధీను. అర్థంచేసుకో" అంది శకుంతల.

★ ★ ★

నేలమీద అందమైన కార్పెట్. గదిలో ఖరీదైన ఫర్నిచర్. నేపథ్యంలో సన్నగా సీడీ సంగీతం. వాతావరణంలో ఆహ్లాదకరమైన పరిమళం.

ఆ గదిలో వున్నది భారవి, కాళిదాసు కాకపోతే అది వారి గదేనని నమ్మడం కష్టం.

"ఇది చాలా అన్యాయం" అన్నాడు కాళిదాసు.

"నీ ఆలోచనలు రాంగ్‌రూట్లో వెడుతున్నాయి. ఇందులో అన్యాయమేమీ లేదు" అన్నాడు భారవి.

"ఒక ఆడపిల్లని బలాత్కరించడం అన్యాయం కాదనేటంత స్వార్థం నీలో చేరి వుండొచ్చు. కానీ నీ ఆలోచనను సమర్థించేటంత స్వార్థం నాలో ఇంకా చేరలేదు"

"ఉద్దేశ్యం మంచిదైనప్పుడు తప్పు కూడా తప్పనిపించుకోదు. శశాంక శకుంతలని ప్రేమించాడు. కులం అడ్డుగోడని తెలుసుకున్నాడు. పెళ్లికి ఆమె పెద్దలు ఒప్పుకోరు. పెద్దలొప్పుకోనిదే ఆమె ఒప్పుకోదు. కానీ ఆమె శీలాన్ని నమ్ముకుంది. మాంత్రికుడి ప్రాణం చిలకలో వున్నట్లు ఆమె ప్రేమ శీలంలో దాగుంది. ఆ శీలాన్ని హరించి ఆమెని తనదాన్ని చేసుకోవాలనుకుంటున్నాడు శశాంక. వాళ్లిద్దరూ పెళ్లి చేసుకుంటే సమాజానికి అభ్యుదయం. శకుంతల జీవితాంతం సుఖపడుతుంది"

"కానీ మానసికంగా మానభంగం ఆడదాన్ని అతి దారుణంగా కృంగదీస్తుందని ఎన్నో పుస్తకాల్లో చదివాం"

"అంతేకాదు, మానభంగం జరిగిన శకుంతల శశాంకలో రాక్షసుణ్ణి చూస్తుంది. అతణ్ణి అసహ్యించుకుంటుంది. అప్పుడే మన హీరో కథ రక్తికడుతుంది. తను మంచివాడినని శకుంతలకి రుజువు చేసుకుందుకు శశాంక రకరకాల ప్రయత్నాలు చేస్తాడు.





వాటికి రూపకల్పన చేయడంలో మన ప్రతిభకి గట్టి పరీక్ష ఎదురవుతుంది. నిత్యజీవితంలో ఓ సినిమాకథని రూపొందించి నడిపించడం సామాన్యమైన విశేషం కాదు. కాశీ! నీకు అర్థంకావడంలేదు. మనమొక అపూర్వ కావ్యానికి స్రష్టలం కాబోతున్నాం"

"అంతా బాగానే వుంది కానీ శకుంతలకి మనం అన్యాయం చేస్తున్నామేమోనన్న అనుమానం నన్ను విడిచిపెట్టకుండా బాధిస్తూనేవుంది. ఎందుకంటే శశాంక ఉద్దేశం నిజంగానే మంచిదా? ఒక ఆడపిల్లని పెళ్లాడ్డానికి ఇలాంటి మార్గం ఎంచుకున్నవాడు నిజంగా మంచివాడౌతాడా? బలాత్కారమయ్యేక అతడికి శకుంతలమీద మోజు తీరిపోతే ఆ తర్వాత ఆమె జీవితం ఏమవుతుంది? ఇలాంటి ప్రశ్నలెన్నో నన్ను పట్టి పీడిస్తున్నాయి. నీకివి తట్టకపోవడం ఆశ్చర్యం"

భారవి నిట్టూర్చి "మనమిద్దరం మంచివాళ్లం. కానీ నీ హృదయం సున్నితం. నేను వాస్తవవాదిని. ఆదర్శాలని నమ్ముకుని ఈ గదిలో వున్నాం, బావిలో కప్పల్లా. ఇప్పుడు మనకో మంచి అవకాశం వచ్చింది. దీని ఆసరాతో శకుంతలకి మంచి భవిష్యత్తు నిద్దాం. శశాంకచేత ఎన్నో మంచిపనులు చేయిద్దాం. మనం బాగుపడి పదిమందిని బాగుచేద్దాం. ప్రగతిపథంలో కాంప్రమైజస్ తప్పవు. మనం రాజకీయాల్లో కుళ్లుని చూస్తున్నాం. అవినీతినీ, కరడుకట్టిన స్వార్థాన్నీ చూస్తున్నాం. కానీ దేశం ముందుకు నడుస్తున్నది కూడా రాజకీయవాదులతోనే కదా. ఈ సిస్టంలో రాజకీయం ఒక భాగం. మనమూ ఒక భాగం. నువ్వింకా నా దారికి రాకపోతే నేనో పరమ దుర్మార్గుడినన్న ఫీలింగు నాలో మొదలవుతుంది" అన్నాడు.

"సారీరా. చనువుకొద్దీ నా ఆలోచనలు నీ ముందు పెట్టానుకానీ నువ్వు మంచివాడివి కాదన్న ఫీలింగు నాలోలేదు. ఆ మాటకొస్తే శశాంకకి కథ అల్లిపెట్టడంలో నీకంటే నాదే ముఖ్య పాత్ర కదా. అందువల్ల దోషభావం నన్ను మరింతగా బాధిస్తోంది. ఇక ఏం మాట్లాడను? కానీ ఏ పని చేసినా మన మొక మంత్రం పఠిద్దాం. మనసు తేలికవుతుంది"

"ఏమిటది? "

"విత్తనం గోచరం, ఫలం అగోచరం"

"అంటే? "

"మనక్కనిపించేది విత్తనం మాత్రమే ఫలంకాదు"

"అంటే? "

"మనం బీర విత్తనమని పాతితే అది కాకరకాయలు కాయొచ్చు. విత్తనం కనబడుతుంది. కానీ అది మొక్కై ఫలించేదాకా ఫలితం తెలీదు"

"అలా ఎందుకు జరుగుతుంది? బీర విత్తనం పాతితే బీర పాదే వస్తుంది. బీరకాయలు కాస్తాయి" అన్నాడు భారవి.

"ముందు నీకు విత్తనాల గురించిన పరిజ్ఞానం కావాలికదా! నీకు బాగా అర్థంకావడానికి రాజకీయంలోకి వెడదాం. ఒసామాను విత్తనమనుకుంటే అమెరికా ఆశించినది రష్యాని పరాభవించడం. కానీ వరల్డ్ ట్రేడ్ సెంటర్ కుప్పకూలింది"

"అంటే మన కథలో చివరికి శశాంకే దెబ్బతింటాడంటావా? "

"ఏమో విత్తనం గోచరం, ఫలం అగోచరం. పద శశాంక దగ్గరికి వెడదాం"

"సరే, విత్తనం గోచరం, ఫలం అగోచరం. పద" అన్నాడు భారవి.

★ ★ ★

"శశీ! ప్లీజ్! ఒక్కసారి... నన్ను కాదనకు"

ఆమె కన్నుల్లో వగలు. ఆమె ఊపిరిలో పొగలు, సెగలు...

"రమా, ప్లీజ్! నేనలాంటివాణ్ణి కాను" అతడి గొంతులో శాంతం.

"అందుకే ఈ మోహం..."

"నామీద మోహం నీకు తగదు. ఇప్పటికే

నేనో అమ్మాయిని ప్రేమించాను. ఆమెని తప్ప ఎవరినీ పెళ్లాడలేను"

"నేను నిన్ను పెళ్లాడమని అడగను. ఒక్క సారి... అంతే... ఒక్కసారి..."

అతడు చిరాగ్గా "ఛీ, నువ్విలాంటిదానివని అనుకోలేదు. నీలో మంచి స్నేహితురాలిని చూశాను. అందుకే ఇంత దగ్గరగా రానిచ్చాను. ఇప్పుడనిపిస్తోంది. చాలా పొరపాటు చేశానని. నీలో కండకావరం పెచ్చు మీరిపోయింది. నీకు కండకావరమున్న మగాడు కావాలి. పోయి అలాంటివాణ్ణి వెతుక్కో" అన్నాడు.

"శశీ! ఛీ... నా గురించి నువ్వేమనుకుంటున్నావు?! నాకు పెళ్లి కూడా కుదిరింది. ఎల్లుండే నా పెళ్లి. నా మనసు, తనువు నిన్నే కోరుతున్నాయి. నీకిష్టంలేదని తెలిసి పెద్దలు కుదిర్చిన పెళ్లికి ఒప్పుకున్నాను. కానీ నువ్వే నా దేవుడివి. ఒక్కసారి నన్ను నీకు పూజాపుష్పంలా అర్పించుకోకుండా కాబోయే నా భర్తకి న్యాయం చేకూర్చలేను. శశీ! నన్ను నీ దాన్ని కానివ్వు. ఆ తర్వాత నీ ఆనతిపై నా భర్తను సుఖపెడతాను. శశీ! ప్లీజ్!"



ఆమె అతడికి మరీమరీ చేరువవుతుంటే "కట్" అన్నాడు దర్శకుడు.

శశాంక కోపంగా "సీనింకా అయిపోలేదుగా" అన్నాడు.

"లేదు. కానీ మీ ఫీలింగ్స్ బాగోలేవు. గొంతులో శాంతమున్నా కళ్లలో కోరిక రేగుతోంది. అలాగే షూట్ చేస్తే మీ కారెక్టరు దెబ్బతింటుంది" అన్నాడు దర్శకుడు.

"నిజమే. ఆడపిల్ల దగ్గరగా వస్తుంటే వళ్లు వేడెక్కుతోంది. మనసులో కోరిక పుడుతోంది. అంతా వయసు ప్రభావమేమో" అన్నాడు శశాంక.

"ఏం కాదండి. కొత్త అంతే. సినిమాల్లో కుర్ర హీరోలంతా ఆడది మీదపడ్డా చలించకుండా ఎలాగుంటున్నారు? పాతబడి... వాళ్లదాకా ఎందుకు? నేనే వున్నానుగా. ఇందాకట్నించి కోరిక కోరిక అంటూ మీదకొస్తున్నాను కానీ నా వంట్లో పిసరంత వేడి పుట్టలేదు" అంది రమ.

"ఇది నీ ఎక్స్‌పీరియన్స్‌లా లేదు. మా శశాంక బాబుని చిన్నబుచ్చుతున్నట్లుంది" అన్నాడు అక్కడున్నవారితో ఎక్స్‌ట్రా.

అప్పుడు శశాంక నిజంగానే చిన్నబుచ్చుకున్నాడు. దర్శకుడు మాట మార్చుతూ "రమా! నువ్వు నటనలోనే కాదు, మాటల్లోనూ బరితెగించిపోయావు. కాస్త వందనీకం నేర్చుకో" అన్నాడు.

"వందనీకం అంటే నేనిక్కడ ఎవర్నైనా ఏద్దైనా అన్నానా? " అడిగింది రమ.

"ఆడదానికి వందనీకం అంటే సిగ్గు"

"సరే. సిగ్గు నాకెలా వస్తుంది? డబ్బు కోసం వళ్లే కాదు. సిగ్గునీ అమ్మేశాను"

"అమ్మేశానంటే ఎలా? నువ్వు నటిగా రాణించాలంటే బోలెడు సిగ్గులు వలికించాలి"

"అయ్యో, నాకామాత్రం తెలియదా? నటనంటేనే మన దగ్గర లేనిది చూపించడం. గొప్ప నటిని కావాలని సిగ్గునుంచి దూరంగా పోతున్నా"

సరిగ్గా అప్పుడే అక్కడ ప్రవేశించారు కాళిదాసు, భారవి.

"ఈ డైలాగు మా డైలాగులకంటే గొప్పగా వుంది. ఎక్కడైనా వాడాలి" అన్నాడు భారవి.

"నిన్న రాసిన సీను షూటింగైపోయిందా? " అన్నాడు కాళిదాసు.

"హీరోగారికి కొత్తకదా. చివర్లో ఆపేయాల్సొచ్చింది" అంది రమ.

"మళ్లీ చేస్తారా? " అన్నాడు కాళిదాసు.

"అమ్మో, ఇప్పుడా? " అన్నాడు శశాంక. అతడి శరీరంలో గగుర్పాటింకా పోలేదు.

"మేము ప్రయివేటుగా నాలుగు రిహార్సల్సు వేస్తే అప్పుడు ఒక్క షాటులో ఓకే అవుతుంది" అంది రమ శశాంక వంక చిలిపిగా చూసి నవ్వుతూ.

అందరికీ నవ్వొచ్చింది కానీ శశాంక మొహం చూసి ఆగిపోయారు. అతడి ముఖం గంభీరంగా వుంది. దర్శకుడు విషయం గ్రహించి రమని అక్కణ్ణించి పంపేశాడు.

"ఈ అమ్మాయి కాస్త ఫాస్టు" అన్నాడు శశాంక.

"మన సీనుకా స్పీడుండాలి కానీ తప్పు నాది. రొమాన్సుకు రాఘవేంద్రరావు టైపు కాక విశ్వనాథ్ టైపు ఎన్నుకోవాల్సింది" అన్నాడు దర్శకుడు.

"మీకు మీదంటూ స్టైల్ లేదా? " అన్నాడు దర్శకుడు.

"మీరు ఫీల్డుకి కొత్త కాబట్టి ఇలాగంటున్నారు. ఇండస్ట్రీలో ఒరిజినాలిటీ అంటూ ఏమీ వుండదు. అందరూ ఇమిటేషనే. నేను విశ్వనాథ్‌ని కాలేను కదా, అందువల్ల నాది ఒరిజినాలిటీయే అవుతుంది" అన్నాడు దర్శకుడు.

"ఒరిజినాలిటీకి ఇదో గొప్ప డెఫినిషన్. ఎక్కడైనా వాడాలి" అన్నాడు భారవి.

శశాంక భారవి వంక మెచ్చుకోలుగా చూసి, "నీకు మంచి పికప్ వుంది. మన





కథ గ్రాండ్ సక్సెస్ అవుతుందని నాకు నమ్మకంగా వుంది" అన్నాడు.

"విత్తనం గోచరం ఫలం అగోచరం" అన్నాడు కాళిదాసు వెంటనే.

"అదేమిటి? " అన్నాడు శశాంక ఆశ్చ ర్యంగా.

"అది విజయమంత్రం. దీన్ని ఎక్కడో మన కథలో వాడతాం" అన్నాడు భారవి.

"సరే, ప్లాట్ ఆలోచించారా? "

"ఆలోచించాం కానీ అంతకుముందు ఇందాకటి షాట్ ఒకసారి చూడాలి"

అప్పటికప్పుడు వీడియోలో ఇందాకటి షాట్ ప్రదర్శించబడింది.

"ఇది చాలా ఇంపార్టెంట్ షాట్. నాకంత తృప్తిగా లేదు" అన్నాడు భారవి.

"ఏమిటి నీ ప్రోబ్లం? చెబితే నేను సాల్వ్ చేస్తాను"

" శశాంక నీతికి విలువిచ్చే మనిషి. ప్రలో భాలకి లొంగని ఆదర్శాలున్నవాడు. రమ అతణ్ణి కోరింది. అతడు చలించలేదు. ఆమె అతణ్ణి రెచ్చగొట్టింది. అయినా లొంగలేదు. అలాంటివాడు అమాయకత్వం మూర్తీభవిం చిన ఓ సిగ్గులమొగ్గని బలాత్కరించాడంటే అదంతా అతడి ప్రేమబలం. ఈ షాట్ ఎంత పండితే ఆ షాట్ అంత గొప్పదిగా వస్తుంది.

"అది నిజమే. కానీ ఈ షాట్లో శశాంక బాగా ఉద్రేకపడ్డాడు. శశాంకతో ఈ షాట్ మనకి అనుకూలంగా వచ్చే అవకాశం కని పించడంలేదు. ఈ షాట్ పండాలంటే మనకి డూప్ కావాలి" అన్నాడు దర్శకుడు.

"డూపా? " అన్నాడు శశాంక తెల్లబోయి.

"అవును. డూప్ లేకపోతే సినిమా పరి శ్రమే లేదు. మనం తొందరగా ఓ డూప్ని వెతికి పట్టుకోవాలి" అన్నాడు దర్శకుడు.

అక్కడ వెంటనే డూప్ గురించిన చర్చ ప్రారంభమైంది.

శశాంక జీవితం రసపుష్టితో కూడిన గొప్ప చలనచిత్రం కాబోతోందంటే అందులో ఇంకా ఎన్ని విశేషాలు జరుగుతాయో తెలీదు. కథకి పాటలతో పాటు ఫైట్స్ని కావలసిరావచ్చు. అలాంటప్పుడు డూప్ అవ సరం ఎంతైనా వుంటుంది. ప్రస్తుతానికి రమతో షాట్సు తీయడానికి డూప్ అవస రమే ననిపిస్తోంది. లాంగ్ షాట్సు డూప్తో తీస్తే క్లోజప్ షాట్సు విడిగా శశాంకతో తీసి రెండింటినీ మిక్సప్ చేయొచ్చు.

"క్లోజప్ షాట్స్లో మాత్రం శశాంకలో ఫీలింగ్స్ రాబట్టడం ఎలా? " అన్నాడు భారవి.

"అందుకేమరి డైరెక్టరు శశాంకకి మన వీధి చివర అడుక్కునే ముష్టిదాన్ని చూస్తే మహా ఎలర్జీ. దాన్ని తీసుకొచ్చి నాలుగు రొమాంటిక్ డైలాగ్స్ చెప్పించి శశాంక ఫీలిం గ్సుని క్లోజప్లో షూట్ చేస్తాం. తిరుగుం డదు పిక్చరు" అన్నాడు దర్శకుడు.

"ఛీ, మీ ఐడియా వింటూంటేనే వళ్లు కంపరమెత్తుతోంది" అన్నాడు శశాంక.

"అలాగంటే ఎలా? సినీ మాయాజా లాన్ని మనముందు ప్రదర్శించే హీరో, హీరో యిన్ల అవస్థలు మా దర్శకులకే తెలుసు" అన్నాడు దర్శకుడు.

"నేను చేయకపోతే నువ్వు దర్శకుడివే కాదు. ఆ విషయం మర్చిపోయి ఏదో పెద్ద సినిమా డైరెక్టర్లా మాట్లాడకు" అన్నాడు శశాంక.

"శశాంకా! అదే వద్దంటున్నా. నువ్వు జీవి తంలో హీరోవి కావాలనుకుంటున్నావు. నీ దర్శకుణ్ణి గౌరవించడం నేర్చుకో" అన్నాడు దర్శకుడు.

"టాపిక్ గాడి తప్పుతోంది. డూప్ గురించి ఆలోచించాలి మనం" అన్నాడు భారవి.

"డూప్ అంటూ దొరికితే మన కథకి మంచి ప్లాటు తట్టింది" అన్నాడు కాళిదాసు.

"ప్లాటు ఏదైనా సరే, రేప్ సీన్తోనే మన



కథ మొదలు" అన్నాడు శశాంక.



ఓ చిన్న డాబా ఇల్లు. ఇంటిముందు పూలమొక్కలు. ఇంటివెనుక ఫలవృక్షాలు. ఇంటిపక్కల కూరల పాదులు. ఇంటిలోపల ఓ మధ్య తరగతి సంసారం. ఆ కుటుంబానికి పెద్ద బడిపంతులు రామనాథం. ఆయన భార్య సుశీల ఇటీవలే ఏదో తెలియని రోగంతో మంచంపట్టింది. రామనాథం తన నిల్వలన్నీ ఊడ్చి ఆమెకి వైద్య పరీక్షలు చేయిస్తే రోగం తగ్గలేదు. కానీ అది తగ్గడానికి లక్ష రూపాయలు కావాలని తెలిసింది.

ఉంటున్నది అద్దె ఇల్లు. వేరే సెంటు భూమి లేదు. ఇంట్లో ఎమ్మే పూర్తిచేసిన రాజు, బియ్యే అయిందనిపించిన రాధ వున్నారు. ఇద్దరూ తమ కాళ్లమీద నిలబడి లేరు.

రాజుకో మామయ్యున్నాడు. ఆయనకి బాగా డబ్బుంది. ఓ కూతురుంది. డబ్బుతో ముడిపెడితే కానీ పెళ్లి కాని రూపురేఖలు ఆ కూతురివి. రాజు ఆ పిల్లని చేసుకుంటే రాధ పెళ్లి, తల్లి వైద్యం రెండూ సులభమైపోతాయి. తల్లికోసం త్యాగానికి రాజు సిద్ధంగానే వున్నాడు. కొడుకు త్యాగం సుశీలని జబ్బుకంటే ఎక్కువ బాధించేలా వుంది. త్యాగాల పెళ్లి వద్దని ఆమె కొడుక్కి చెప్పింది.

"అందుకని తల్లినే త్యాగం చేయాలా?" అన్నాడు రాజు.

"అన్నింటికీ దేవుడున్నాడు. ఆయనేం తల్చుకుంటే అదౌతుంది" అంది సుశీల.

"హోరుగాలిలో దీపం పెట్టలేను" అన్నాడు రాజు.

రాజు, సుశీల, మేనమామ కలిసి విషయాన్ని చర్చించారు.

"చెల్లెలి ప్రాణాలు నాకూ ముఖ్యమే. దాని వైద్యానికి నేను డబ్బిస్తాను. అది అప్పుగా భావించి ఏడాదిలో నా బాకీ తీర్చాలి. ఏడాదిలోగా తాను పెళ్లి చేసుకోనని రాజు తల్లి మీద ఒట్టేయాలి. ఏడాదిలోగా బాకీ తీర్చలేకపోతే రాజు నా కూతుర్ని పెళ్లి చేసుకోవాలి. ఇది స్వార్థం కాదు. కూతురిమీద నాకున్న ప్రేమ" అన్నాడు మేనమామ.

సుశీల ఒప్పుకోలేదు.

"అన్నింటికీ దేవుడున్నాడు. మామయ్య బాకీ తీర్చినా మరదల్ని పెళ్లాడినా అది దైవ నిర్ణయం. అమ్మకి వైద్యం జరిపించకపోతే మాత్రం అది నా నిర్లక్ష్యం" అన్నాడు రాజు.

రామనాథం, రాధ, రాజు మాటలకి వత్తాసు పలికారు. రాజు తల్లిమీద ప్రమాణం చేసి మామయ్యకి మాటిచ్చాడు. సుశీలకి వైద్యం జరిగింది.

ఏడాదిలో నెల గడిచింది. సుశీల మామూలు మనిషయింది కానీ రాజుకి డబ్బు సంపాదించే మార్గం దొరకలేదు. అయితే రాధకి మంచి పెళ్లి సంబంధం వచ్చింది.

వరుడు పంజాబులో లెక్చరరు. బుద్ధిమంతుడన్న పేరుంది. అతడి కుటుంబం సంప్రదాయమైనది. ఆ సంప్రదాయంలో కట్నం లేదు.

ఇలాంటి సంబంధం రాధకి మళ్లీ దొరక

దని అయినవాళ్లంతా అన్నారు. అయితే

ఎంత తగ్గించినా కట్నంలేని పెళ్ళి ఖర్చు కూడా లక్ష రూపాయలకు తగ్గదని అంచనాలో తేలింది.

రాజు మేనమామ ఉత్సాహంగా ముందుకొచ్చాడు.

"రాధ నా మేనకోడలు. నా కూతురెంతో అదీ అంతే నాకు. దాని పెళ్ళి నా బాధ్యతగా భావిస్తాను. అవసరమైనంతా ఇస్తాను. రానున్న పదకొండు నెలల్లో నా మొత్తం బాకీ తీర్చినాసరే, లేదా నా కూతుర్ని పెళ్ళి చేసుకున్నా సరే" అన్నాడాయన.

రాజు తటపటాయించాడు. అప్పు పెరిగినకొద్దీ తన మెడచుట్టూ ఉచ్చు మరింతగా బిగుసుకుంటుందని అతడికి తెలుసు. కానీ తండ్రి అతడి భుజం తట్టాడు.

"రాధకు మళ్ళీ ఇలాంటి సంబంధం రాదు. ఏడాదిలో ఎన్ని విచిత్రాలో జరగొచ్చు మన ఆర్థికస్థితి మారిపోవచ్చు కానీ ఇలాంటి పెళ్లిసంబంధం మళ్ళీ దొరకదు. అయినా నీ మేనమామది ఎంతో మంచి మనసు. అంత మంచి బుద్ధి ఉన్నవాడి కూతురూ అంతమంచిదీ అయి ఉంటుంది. అందం శాశ్వతంకాదు. గుణం ముఖ్యం. నీ పెళ్ళివల్ల అమ్మ కూడా సుఖపడుతుందని నాకనిపిస్తోంది. అయినా మనమిప్పుడు ఆలోచించాల్సింది రాధ పెళ్ళి గురించి. నీ పెళ్ళికింకా బోలెడు టైముంది. ఆలోగా నీకిష్టం లేకుంటే తల తాకట్టు పెట్టినాసరే మామయ్య బాకీ తీర్చే ఏర్పాటు నే చేస్తాను" అన్నాడాయన.

తండ్రి మాటలకు రాజు కాస్త నిరుత్సాహపడ్డాడు. మేనమామలాగే తండ్రి కూడా కూతురి గురించి మాత్రమే ఆలోచిస్తున్న స్వార్థపరుడిలా అనిపించాడు. అయినా తల్లి ఏమంటుందోనని ఆమెకు తండ్రిమాటలు చెప్పాడు.

"రాధకు మళ్ళీ ఇలాంటి సంబంధం రాదేమోనన్న ఆయన భయంలో నిజముంది. తల తాకట్టు పెట్టినా మామయ్య బాకీ తీరుస్తానంటున్న ఆయన మాట మాత్రం నిలబడుతుందని నాకు అనిపించదు. అయినా నువ్వు ఇంతకుముందే నిర్ణయం తీసేసుకున్నావు. ఆలోచించవలసిందల్లా పెరుగుతున్న బాధ్యతల బరువు గురించే" అంది సుశీల.

తన ఆరోగ్యానికీ, కొడుకు భవిష్యత్తుకీ ముడిపడితే ఆమె రెండో దానికే ప్రాధాన్యాన్నిచ్చింది. కానీ ఇప్పుడు కూతురి పెళ్ళి, కొడుకు భవిష్యత్తు అనేసరికి మొగ్గు మొదటి దానిమీదే ఉందనిపించి రాజులో నిరుత్సాహం మరి కాస్త పెరిగింది.

సుశీల అతడి ముఖభావాలను గమనించినట్లే ఉంది, "నాకు రాధ ఎంతో, నువ్వూ అంతే! దాని పెళ్ళి జరిగాక నువ్వు తన కూతుర్ని పెళ్ళి చేసుకోనంటే మామయ్య మాత్రం ఏం చేస్తాడు? అదీ నా ఆలోచన' అంది.

"అలాగంటావేమిటి. నేను నీమీద ఒట్టేశానమ్మా" అన్నాడు రాజు.

"ఒట్టుతీసి గట్టుమీద పెట్టు"

"పెట్టేవాడినేమో కానీ నేను ఒట్టేసింది నీమీద. ఆ ఒట్టుకు కట్టుబడి ఉండకపోతే నా బతుక్కే అర్థముండదు" అన్నాడు రాజు.

తండ్రి ఆలోచన లేకుండా మాట్లాడితే తల్లి మాట తప్పుతుంది. ఇద్దరి లక్ష్యమూ ఒకటే. అది రాధ పెళ్ళి. రాజు అదే తన లక్ష్యమూ చేసుకున్నాడు.

★ ★ ★

రాధ పెళ్ళి జరిగి నెలరోజులైంది. రాజు ఆదాయం పైసా కూడా లేదు.

రోజులు గడుస్తున్నాయి. బాకీ తీర్చాల్సిన గడువు ఎనిమిది నెలలకు దిగింది.

కౌంట్ డౌన్!

రాజుకు కాలం శరవేగంతో పరుగెడుతున్న అనుభూతి కలుగుతోంది. ఇష్టంలేని పెళ్ళి తప్పదన్న భయం పెరుగుతోంది.

తన మరదలు కురూపి అని అతడు బెంగపడడంలేదు. మేనమామకు తమ ఇంట మంచి పేరు లేదు. సాధారణ మధ్య తరగతి స్థాయినుంచి విలాసాల భోగభాగ్యాలకు ఆయన ఎదగడం వెనుక ఎన్నో కుతంత్రాలు, దౌర్జన్యాలు ఉన్నాయి. ఆయన పాపాలే శాపమై కూతురి ముఖాన్ని ఆవహించాయని కూడా ఇంట్లో అనుకునేవారు. ఆయనే అనుకుంటే ఆయన కూతురూ తండ్రి గుణాలు పుణికి పుచ్చుకుందని ఇంట్లో బాధపడేవారు. మేనమామ కుటుంబమన్నా ముఖ్యంగా ఆయన కూతురన్నా అతడికెంతో అసహ్యం ఏర్పడింది. ఈరోజు తన తల్లి ఆరోగ్యం బాగుచేయించి, రాధకు పెళ్ళి చేయించగానే తండ్రి మాటల్లో ఆయనకూ, ఆయన కూతురికీ మంచిమనసు ఏర్పడిపోయింది. అవసరం మన రంగులనేకాదు అవతలి వారి రంగులనూ మార్చగలదనీ లేదా మార్చి చూడగలదనీ రాజుకు స్పష్టమైంది. కానీ అతడింకా మేనమామనూ, మరదల్నీ రంగులు మార్చి చూడలేకపోతున్నాడు.

అలాంటి సమయంలో ఒకరోజున రామనాథం ఇంటిముందు కారాగింది. కార్లోంచి ఓ నడివయస్కుడు దిగి ఇంటి తలుపు తట్టాడు. తలుపు తెరుచుకోగానే, "ఇది రామనాథంగారి ఇల్లేనా? " అనడిగితే తలుపు తెరిచిన వ్యక్తి, "నేనే రామనాథాన్ని" అంటూ ప్రశ్నార్థకంగా చూశాడు.

"రాజు మీ అబ్బాయేకదూ? " అడిగాడు నడివయస్కుడు.

"అవును... మీరు? "

"నా పేరేమైతేనేం. నన్ను దర్శకుడు అని గుర్తుంచుకోండి చాలు" అని, "రాజున్నాడా? " అన్నాడా నడివయస్కుడు.

రామనాథం ఆశ్చర్యపడుతూ అతణ్ణి లోపలకాహ్వానించి కూర్చోపెట్టి రాజును పిలిస్తే తన గదిలో మంచంమీద పడుకుని ఆలోచనల్లో ఉన్న రాజు వెంటనే లేచి వచ్చాడు.

దర్శకుడు రాజును చూస్తూనే, "బాప్‌రే, హీరోలా ఉన్నావు. నిన్ను డూప్ అనాలంటే ఇబ్బందిగా ఉంది" అంటూ అస్పష్టంగా గొణిగాడు.

"ఎవరండీ మీరు? " అన్నాడు రాజు. అతడి కళ్ళలో కనిపించే ప్రశ్నార్థకం గొంతులోనూ వినిపించింది.

"అదృష్టాన్ని వెతుక్కుంటూ వచ్చాను" అన్నాడు దర్శకుడు.

ఏమీ అర్థంకాక అయోమయంగా చూశాడు రాజు.

"నీ మిత్రుడు శశాంక ఇప్పుడు కోటీశ్వరుడు. నీకో మంచి ఆఫర్ పంపాడు. అతడికోసం ఏమైనా చెయ్యగలననుకుంటే నువ్వు వెంటనే నాతో బయల్దేరవచ్చు" అన్నాడు దర్శకుడు.

ఆఫర్... కోటీశ్వరుడు అన్నమాటలు రాజుకు అమృతోపమానంగా తోచాయి. అయితే తల్లిమీద వేసిన ఒట్టును అనుక్షణం గుర్తు చేసుకునే ఆ మాతృభక్తుడు "ఒక్క పెళ్ళి తప్ప దేనికైనా నేను సిద్ధమే" అన్నాడు.

ఆ తర్వాత కారెక్కడానికి అతడికెంతోసేపు పట్టలేదు.

★ ★ ★

"అందరూ సిద్ధంగా ఉన్నారుకదా" అంది దర్పణి.

ఆ ఇంటి డ్రాయింగ్ రూం అందమైన ఆడపిల్లలతో మనోహరంగా ఉంది. దర్పణి చెయ్యబోయే ర్యాగింగు ఎలా ఉంటుందోనని అందరికీ కుతూహలంగా ఉన్నట్లుంది. ఆమె వంకే కన్నార్పకుండా చూస్తున్నారు.

"శ్రావణీ స్టాండప్" అంది దర్పణి.

అమ్మాయిల్లో శ్రావణి లేచి నిలబడింది.

"పక్కన గది ఉందికదా. అందులోకి వెళ్ళు. తలుపు గడియ వేసుకో. గదిలో నీకు భయంకర దృశ్యాలు కనిపించవచ్చు. ఉన్నట్లుండి పిచ్చి కేకలు వినిపించవచ్చు. ఏం జరిగినా నువ్వు భయపడకూడదు. అయిదు




# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత (త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ అవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారం లోనే పంపబడుతుంది.

ఎడిటర్:
**చతుర**
'ఈనాడు' కాంపౌండ్,
హైదరాబాద్ 500 482.

శ్రీచంద్ర




ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/– ప్రథమ బహుమతి, రూ. 75/– ద్వితీయ బహుమతి, రూ. 50/– చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**మే చతుర నవల సేవ్ లవ్ డాట్ కామ్**

సమీక్షకుని పేరు: ..........................................................

చిరునామా: ..........................................................

..........................................................

..........................................................

నిమిషాలపాటు ఎలాంటి విపత్కర పరిస్థితినైనా ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉండాలి. ఎట్టి పరిస్థితుల్లోనూ గదిలోంచి బయటకు రాకూడదు. అయిదు నిమిషాలు పూర్తి కాగానే నేను గదిలోకి వినబడేలా బెల్ మోగిస్తాను. వెంటనే రావాలి. సరేనా? " అంది దర్పణి.

"అమ్మో... నాకు భయం" అంది శ్రావణి

"భయమంటే కుదరదు" ఆజ్ఞాపించింది దర్పణి. తప్పనిసరై లోపలకు వెళ్ళింది శ్రావణి. మరుక్షణం గదిలోపల తలుపుకు గడియ పడింది.

"అసలే... అది భయస్థురాలు. జడుసు కుంటుందో ఏమో" అంటూ కొందరామె తర పున వకాల్తా పుచ్చుకున్నారు.

"ర్యాగింగా, మజాకానా! ఈ వయసులో మనం రాటుదేలాలంటే ర్యాగింగు కావాలి" అంది దర్పణి. అలా అయిదు నిమిషాలు గడవగానే ఆమె తను కూర్చున్న సోఫామీదున్న ఓ మీట నొక్కింది. అన్ని గదులకూ కాలింగ్ బెల్ మోగించడానికి ఆ సోఫాకు మీటలు అమర్చబడి వున్నాయి.

శ్రావణి భళ్ళున తలుపు తెరుచుకుని వచ్చింది.

"ఏం జరిగిందే? " అడిగారామెను మిగతా పిల్లలు.

"చెప్పేస్తే సస్పెన్సు పోతుంది. ఎవరికి వారే తెలుసుకోవాలి" అంది దర్పణి.

శ్రావణి తర్వాత శకుంతలతో సహా మిగతా ఆరుగురు పిల్లలూ ఆ గదిలో అయిదేసి నిమిషాల చొప్పున గడిపి వచ్చారు.

"ఇప్పుడు మీ అనుభవాలు చెప్పండి" అంది దర్పణి.

"అనుభవాలదేముంది? అంతా ఫ్రాడ్. అయిదు నిమిషాలసేపు లోపలేం జరుగుతుందోనని హడలి చచ్చాను. తీరా చూస్తే ఏమీ జరగలేదు" అంది శ్రావణి.

"అదే థ్రిల్. ర్యాగింగ్ అంటే థ్రిల్ కోసమే" అంది దర్పణి. తర్వాత ఆమె "ఇప్పుడు రెండో అయిటం. వెరీ అట్రాక్టివ్ ఫర్ యూత్. అక్కడ దూరంగా ఓ కుర్చీ ఉందికదా. ఆ కుర్చీలో ఓ పుస్తకముంది కదా. అందులో సరిగ్గా ముప్పై అయిదు పేజీలు. ప్రతి పేజీలోనూ మనుషుల బొమ్మలు. ఆ మనుషుల ముఖాలకు ముసుగులుంటాయి కానీ వంటికి బట్టలుండవు. ఒకరితర్వాత ఒకరు వరుసగా వెళ్ళి కుర్చీలో కూర్చుని ఒక్కొక్కరు అయిదేసి బొమ్మలు చొప్పున శ్రద్ధగా చూసి రావాలి. ఆ బొమ్మలేమిటో ఈ పాటికి మీరూహించే ఉంటే ఎస్... కరెక్టే" అంది.

శకుంతల దర్పణివంక ఇబ్బందిగా చూసింది.

"ఏమిటలా చూస్తున్నావ్? " అంది దర్పణి.

"అసభ్యతను నేను చూడలేను" అంది శకుంతల.

"సినిమాలు చూస్తావా? "

"ఊ..."

"అయితే ఈ బొమ్మలూ చూడగలవులే. పోజులవే బట్టలుండవంతే" అని,

"అయినా నీ కోసమే నేను ముఖానికి ముసుగులున్న ఫొటోలు సెలక్ట్ చేశాను. ర్యాగింగంటే అదే. అసభ్యతనే కాదు, చూసే వాళ్ళలో కలిగే స్పందన కూడా చూడ్డం" అంది దర్పణి.

అయిష్టాన్ని ప్రకటించేవాళ్ళు కొందరు, నటించేవాళ్ళు కొందరు. అందరూ ఒకరి తర్వాత ఒకరుగా అయిదేసి బొమ్మలు చొప్పున చూసి వచ్చారు. ఒకరు బొమ్మలు చూస్తుంటే మిగతావాళ్ళు వాళ్ళ ముఖభావాలు చూసి వినోదించారు. అందరికంటే చివర్న వెళ్ళిన చారులత అనే అమ్మాయి ఓ బొమ్మచూసి, "ఛీ..." అని పుస్తకాన్ని అక్కడే పారేసి వెనక్కి వచ్చింది.

"తను మాత్రమే మీరనుకున్న బొమ్మ చూసింది. మిగతావాళ్ళంతా చంటిపిల్లల బొమ్మలే చూశారు" అని నవ్వింది దర్పణి.



"అదేం చూసిందో" శ్రావణి కుతూహలపడింది.

"తనేం చూసిందో చారులత చెప్పాలి. లేదా మిగతావాళ్ళంతా ఒక్కొక్కరే వెళ్ళి ఆ బొమ్మను చూసి రావాలి" అంది దర్పణి.

"నాకు నీ వరస నచ్చలేదు. ర్యాగింగునీ, సెక్స్‌నీ కలుపుతున్నావు" అంది శకుంతల.

"మనం ముసలాళ్లంకాదు. చంటిపిల్లలం కాదు. మన ర్యాగింగు వయసు ప్రభావంతో నడుస్తుంది" అంది దర్పణి.

"వయసంటే సెక్సొకటేనా? వయసు ఓ గొప్ప శక్తి. వయసొక ఉద్వేగం. వయసొక విప్లవం, వయసంటే కైనెటిక్ ఎనర్జీ"

"రైట్ నువ్వు చెప్పినవన్నీ సెక్స్‌కీ సరిపోతాయి. అంటే వయసూ, సెక్సూ ఒకటేకదా" అంది దర్పణి.

"నీకు సెక్స్ కామెర్లు వచ్చాయి" అంది శకుంతల.

"అవును. ఆ కామెర్లు వయసులో ఉన్న అందరికీ వస్తాయి. కావాలంటే నేను రుజువు చేయగలను. అదే ర్యాగింగ్‌లో మన మూడో అయిటం" అంది దర్పణి.

"నేను వెళ్ళిపోతాను. నాకీ ర్యాగింగ్ నచ్చలేదు" అంది శకుంతల.

"సరే ఇష్టంలేనివారికి బలవంతంలేదు. నువ్వు వెళ్ళిపోవచ్చు కానీ కూల్‌డ్రింక్ తాగకుండా మాత్రం వెళ్ళనివ్వను" అంది దర్పణి.

అంతా సరేనన్నారు. దర్పణి అందరికీ కూల్‌డ్రింక్స్ సెర్వ్‌చేసింది. తాగడాలయ్యాక,

"స్నేహితురాలిని కాబట్టి ముందుగా హెచ్చరించక తప్పదు. ఇప్పుడు మీరు తాగిన డ్రింక్స్‌లో భంగు కలిసింది. భంగు అంటే అదొక ప్రత్యేకమైన మత్తుపదార్థం. కాసేపుపాటు మిమ్మల్ని ఏవో వింత లోకాలకు తీసుకునిపోతుంది. మీ మనసులో ఏ ఆలోచన ఉన్నా నిర్భయంగా, సంకోచం లేకుండా చెప్పగలుగుతారు. మనుషుల నిజ స్వరూపాలను బయటపెట్టే గొప్పమందు ఈ భంగు. మీలో ఇప్పుడు ఎవరు బయటకు వెళ్ళినా మీకు కాళ్ళు తడబడచ్చు. కళ్ళు తిరగొచ్చు మాట ముద్దగా రావచ్చు మీమీద మీకే అదుపు లేకపోవచ్చు. కాబట్టి మీరు కొన్ని గంటలదాకా ఇక్కడే ఉండి మీ మాటలు నన్ను రికార్డు చెయ్యనివ్వండి. అవి తర్వాత మిమ్మల్ని మీరు తెలుసుకుందుకు ఉపయోగపడతాయి" అందామె.

"యూ చీట్" అంది శకుంతల.

"నేను చీట్‌నో, నిన్ను నువ్వే చీట్ చేసుకుంటున్నావో తెలుసుకుందుకే చిన్న ట్రిక్ చేశాను శకుంతలా. నేను నీకు ఫ్రెండ్‌నేకానీ శత్రువును కాను. లెటజ్ ఎంజాయ్ లైక్ యూత్. దట్ డజంట్ మీన్ సెక్స్... ఓకే..." అంది దర్పణి.

శకుంతల లేవాలనుకుంది. కానీ వళ్ళు తూలుతున్నట్లనిపించింది.

"నా... లెట్ మీ గో టూ శ్రావణి" అంటూ ఓ పాకెట్ టేపురికార్డరుతో ఆమె వద్దకు వెళ్ళింది దర్పణి.

ముందు శ్రావణి ఆమెతో సంభాషించడానికి ప్రతిఘటించింది. దర్పణి ఆమెను మాటలతో రెచ్చగొట్టింది. వయసొచ్చినా అందరికీ భయపడే చిన్నపిల్లవంది.

"భయమా... నాకేం భయం. మా ఇంట్లో వాళ్ళంటేనే నాకు చిరాకు. చిరాకు భయమైపోతుందా. బయట తిరగడానికేమో ఇంకా చిన్నపిల్లవు కాదంటారు. ఇంట్లోమాత్రం చిన్నపిల్ల అప్పుడే పెళ్ళేమిటి అంటారు. తను చదువుకుని కాళ్ళమీద నిలబడ్డాకే పెళ్ళి అంటారు. నాకేమో చదువంటే ఇష్టంలేదు. చదువుకున్నా కాళ్ళమీద నిలబడగలనన్న నమ్మకంలేదు. పెళ్ళి చేసుకుంటే బాగుంటుందనిపిస్తుంది. అందులోనూ వదిన్ని చూస్తానుగా ఇంచుమించు నా ఈడుదే కానీ నాకంటే ఎంత సంతోషంగా ఉంటుందో. నాకేం కావాలన్నా అన్నయ్యనడగాలి. కానీ అన్నయ్య కూడా వదిన ఒప్పు





కోందే ఏ పనీ చెయ్యడు. ఏ ఖర్చూపెట్టడు. అయినాసరే వాడు కూడా నన్ను చిన్నపిల్ల అప్పుడే పెళ్ళేమిటీ అంటాడు. తనుమాత్రం నా ఈడుపిల్లనే మూడేళ్ళక్రితమే పెళ్ళి చేసుకున్నాడు. వయసన్నాక కోరికలుండవా... అవి చల్లారకుండా చదువెక్కుతుందా"

ధారాప్రవాహంలా కొనసాగిపోతోంది శ్రావణి నోటివెంటనుంచి. కాసేపు రికార్డింగ్ అయ్యాక దర్పణిని చిత్ర పిలిచింది, "ఏయ్ నన్నడుగు. బోలెడు చెప్పాలి"

దర్పణి చిత్రను సమీపించి, "నీకు బాయ్ ఫ్రెడ్సుంటే చెప్పు. మిగతా విశేషాలైతే నాకు బోర్" అంది.

చిత్ర తమాషాగా నవ్వి, "నాకూ అంతే" అని, "ఈ దేశంలో మనకు బాయ్‌ఫ్రెండ్సేమిటిలే. అస్తమానూ అమ్మాయిలేనా అని వెరైటీకోసం అబ్బాయిలతో స్నేహం చేద్దామంటే వాళ్ళ చూపులెప్పుడూ ముఖాన్ని తాకవు. అన్నింటికీ కేంద్రం బొడ్డు. బొడ్డుపైనుంచి మెడను దాటవు. బొడ్డుకిందనుంచి మోకాళ్ళు దాటవు... ఎంత ఇబ్బందిగా ఉంటుందో" అంది.

"అయితే నీకు బాయ్‌ఫ్రెండ్స్ లేరా? "

"లేరుకానీ మా వీధిలో ఇద్దరికి నేనంటే ఇష్టం. ఒకడివి పోకిరీ వేషాలు. పలకరిస్తే చాలు భుజంమీద చెయ్యేయడానికి రెడీ అన్నట్లుంటాడు. నేను బయటకు వెళ్లినప్పుడల్లా కాస్తదూరంలో నన్ను వెంటాడుతుంటాడు. నేను తన్ని ప్రేమిస్తున్నాననీ, ఆడపిల్లను కాబట్టి సంకోచిస్తున్నాననీ వాడి భ్రమ"

"పాపం... నువ్వు వాణ్ణి ప్రేమించడం లేదా? "

"మా వీధిలోనే మోహన్ ఉండగా ఇంకొకణ్ణి ప్రేమిస్తానా? మోహన్ చాలా స్మార్టుగా ఉంటాడు. తెలివిగా మాట్లాడతాడు. డిగ్నిఫైడ్‌గా బిహేవ్ చేస్తాడు. మా ఇంట్లో కూడా అందరికీ మోహన్ అంటే ఇష్టం. నాన్నగారతడితో రాజకీయాలు చర్చిస్తారు. తమ్ముడు లెక్కల్లో డౌట్లు అతణ్ణే అడిగి తీర్చుకుంటాడు"

"అయితే అతణ్ణి పెళ్ళి చేసుకోవచ్చుగా"

"అబ్బే... కులాలు కలవ్వు. మా ఇంట్లో కులం పట్టింపు చాలా ఉంది. నేను మోహన్ని పెళ్ళాడాలనుకోలేదు. ప్రేమించాలనుకున్నాను"

"ప్రేమ, పెళ్ళి వేరంటావా? "

"పూర్తిగా వేరు. ప్రేమ నాకోసం పెళ్ళి పెద్దలకోసం"

"మరి నీ ప్రేమను మోహన్‌కి చెప్పావా?

"ఎలా చెప్పను? ఎప్పుడు కలుసుకున్నా అతడి చూపులు నా కళ్లకు మాత్రమే గుర్రై ఉంటాయి. నేనతడివంక ధైర్యంగా సూటిగా చూస్తే అప్పుడప్పుడు తడబడి నేలచూపులు చూస్తాడు. అప్పుడతడు నా పాదాలను మాత్రం చూస్తాడు. అతడి చూపులు ఎక్కడుంటే నాకు థ్రిల్లింగ్‌గా ఉంటుందో అక్కడికి మాత్రం ఎప్పుడూ పోవు. నాతో ఎప్పుడు మాట్లాడినా మన సంప్రదాయం గురించీ, మహిళలకు జరుగుతున్న అన్యాయం గురించీ అంతే! ఆ సంప్రదాయమే మా బంధానికి అడ్డుగోడని నాకు తెలిసినా నేను చెప్పలేను. అతడు చొరవ చేస్తే సహకరిస్తానని కూడా చెప్పాలనుంటుంది. చెప్పలేను. చొరవ చేస్తాడేమోనని తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి తెలుసుకున్నాను. కానీ వేస్ట్... ఆ అవసరమేలేదు"

"నువ్వే చొరవ తీసుకుంటే..."

"ఏమో ఫిమేల్ ఇగో అనుకుంటాను. ఓ పుస్తకంలో చదివాన్లే. ఫిమేల్ ఇగో పెళ్ళికి ముందుట. మేల్ ఇగో పెళ్ళికి తర్వాతట" అదోలా నవ్వింది చిత్ర.

"అయితే నీ ప్రేమకథ విషాదాంతమేనా? " నిట్టూర్చింది దర్పణి.

"అప్పుడేనా... నా పెళ్ళికింకా బోలెడు టైముంది. ఈలోగా మోహన్ని నా ప్రియుణ్ణి చేసుకుతీర్తాను. ఆ తర్వాతే ఓ సన్నాసికి పతివ్రతగా పడిఉంటాను"

"ఏయ్..." అన్న పెద్ద అరుపు వినపడిం

దప్పుడు. దర్పణి ఉలిక్కిపడి అటుచూస్తే శకుంతల తూలుతూ తనవైపే వస్తోంది.

"నీకేమయింది? " అంది దర్పణి.

"మగాడు బ్రిటిష్‌వాడు. ఆడది భారత దేశం. స్వేచ్ఛకోసం పోరాటం మొదలైంది. అందుకు ఓ పద్ధతి సుభాష్‌బోస్‌ది. యుద్ధం. అందులో మనకు మనమే ఆహుతి అయ్యే ప్రమాదముంది. ఇంకో పద్ధతి గాంధీది. సత్యం, అహింస, ఆ పద్ధతి మనపట్ల గౌరవాన్ని కలిగిస్తుంది. మన మంటే భయాన్ని పుట్టిస్తుంది. మనని ఎంతో ఎత్తులో నిలబెడుతుంది"

"ఆడదానికి సత్యం, అహింస అంటే ఏమిటి? "

"ఆ రెండూ కలిపితే ఆడదానికి శీలం అనే ఆయుధం వస్తుంది. ఆడదాన్ని అణచేయాలని మగాడు శీలాన్ని ఆయుధం చేశాడు. ఆ శీలాన్నే మగాడిమీద తిప్పికొట్టడానికి ఆడవాళ్ళంతా ఒక్కతాటిమీద నడవాలి"

"ఎలా? "

"ఆడదాని గుండెలో ఒక్కడికి మాత్రమే చోటు. ఇది ప్రతి ఆడదీ కచ్చితంగా పాటిస్తే కావాలన్నా ఏ మగాడికీ రెండో ఆడది దొరకదు"

"మరి ప్రేమించినవాడితో కాకపోతే వేరే ఎవరితోనైనా పెళ్లయితే..."

"ఏయ్..." అరిచింది శకుంతల.

"అదే వద్దంటున్నా. మనిషి మనిషిలాగే పుడతాడు తప్ప వాణ్ణెవ్వరూ మనిషిగా మార్చరు. కులం, మతం, జాతి ఇవన్నీ కృత్రిమాలు. మనిషంటే మనిషి. అంతే! అలాగే ప్రేమంటేనే పెళ్ళి. పెళ్ళి వేరే ఉండదు. ప్రియుడే మగడు. మగడంటూ వేరే వుండడు. అందుకే ఆడది పతివ్రత కాదు. ప్రియవ్రత కావాలి. అంటే ఏ ఆడదానికైనా ఒక్కడే ప్రియుడు. ఆ ప్రియుడే మగడు.. అర్థమైందా..." అంది శకుంతల.

"నీదంతా వేదాంతంలా వుంది. నాకర్థం కాదు. ఇంతకీ నీ ప్రియుడెవరో చెప్పు వాడిని నీ మగడిగా ఎలా మార్చుకుంటావో చెప్పు" అంది దర్పణి. భంగుప్రభావంలో శకుంతల వంటి సంప్రదాయపు ఆడపిల్ల నోట ఎలాంటి మాటలు వస్తాయోనని ఆమెకు మహా కుతూహలంగా వుంది.

"నా ప్రియుడా..." గొంతు సవరించుకుంది శకుంతల.

★ ★ ★

"ఒకప్పుడు నేనెంత సామాన్యుణ్ణో నీకు తెలుసు. ఇప్పుడు కోటీశ్వరుణ్ణి. అందుక్కారణం జీవితంలో నేను తీసుకున్న కొన్ని రిస్కులు. అవేమిటో చెప్పను. నువ్వూ కొంత రిస్కు తీసుకుంటే నీ జీవితం మారిపోయే అవకాశముంది. ఇది నీకో గొప్ప అవకాశం. మనకున్న పాతపరిచయంలో నువ్వంటే నాకేర్పడిన ప్రత్యేకాభిమానంతో నేను నీకీ అవకాశాన్నిస్తున్నాను" అన్నాడు శశాంక.

అతడికెదురుగా కూర్చున్న రాజు ముఖం గంభీరంగా ఉంది.

ఏడాది క్రితం శశాంక తమ పొరుగింటి వారి బంధువుగావచ్చి నెలరోజులున్నాడు. అప్పుడు తామిద్దరికీ మంచిస్నేహం కలిసింది. ఇద్దరిదీ ఒకే ఎత్తు. ఒకేలావు. వెనుకనుంచి చూస్తే ఇద్దరూ ఒకేలా అనిపించేవారు. ఆశయాలు మాత్రం ఇద్దరివీ వేరు.

ఏమైనాచేసి జీవితంలో పైకి రావాలంటాడు శశాంక. జీవితంలో పైకి రావడం కంటే మంచిని ఆశ్రయించి బతకడమే తన ఆశయమంటాడు రాజు.

"నువ్వు నాకు నచ్చావ్. నా ఆశయంతో నేను పైకి వస్తే నిన్ను ఆదుకుంటాను. నీలాంటివాళ్లను ఎవరో ఒకరు ఆదుకుంటే తప్ప పైకి రాలేరు. పైకి రావడమేమిటి, అసలు బతుకుబండినే ఈడ్వలేరు..." అన్నాడప్పుడు శశాంక.

ఇప్పుడు శశాంక పైకి వచ్చాడు. మాట నిలబెట్టుకుంటున్నాడు. మరి రాజు జీవితాశయం మాటేమిటి?





రాజు తన బాధ్యతల్ని బేరీజు వేసుకుంటు న్నాడు.

శకుంతల మంచి సంప్రదాయంలో పెరిగిన మధ్యతరగతి అమ్మాయి. ఆమెను తను కిడ్నాప్‌చేసి ఓ ఇంట్లో చేర్చాలి. ఆ ఇంట్లో శశాంక ఆమెను బలాత్కరిస్తాడు.

ఆవిధంగా తనకు మేనమామ కూతురితో బలవంతపు వివాహం తప్పుతుంది. కానీ మరి శకుంతల భవిష్యత్తేమిటి?

శశాంక ఆమెను పెళ్ళిచేకుంటానంటు న్నాడు. కానీ పెళ్ళిచేసుకునేవాడికీ బలాత్కారపు సరదాలేమిటి?

"ఇది సరదాకాదు. రాక్షసత్వంకాదు. ఆడదాని పెళ్ళికి కులమత జాతి బంధాలనుంచి విముక్తి కలిగించాలంటే మానభంగాన్ని మించిన దారిలేదు. మన సమాజం గర్వపడాలో, తలవంచుకోవాలో తెలియని విచిత్ర పరిస్థితి ఇది" అన్నాడు శశాంక.

"ఇంతకీ శకుంతల పెళ్ళికి ఈ విముక్తి అవసరమా?"

"అవసరమే- ఆమెను నేను ప్రేమించాను కాబట్టి..."

"మరి ఆమె కూడా నిన్ను ప్రేమించాలి కదా..."

ఏదో చెప్పబోయి ఆగిపోయాడు శశాంక. జేబులోంచి ఓ కాగితంతీసి, "సారీ, డైలాగ్ మర్చిపోయాను" అన్నాడు.

రాజు తనలోతనే నవ్వుకున్నాడు. శశాంక జీవితాన్ని సినిమాగా మార్చి హీరో అయ్యాడు. ఇప్పుడతడి కథ అతడిదికాదు. మాట అతడిది కాదు.

"ఇప్పుడు చెప్పు, నువ్వడిగిన ప్రశ్నేమిటి?"

"శకుంతల కూడా నిన్ను ప్రేమించాలి కదా"

"పెళ్ళికోసం మానభంగం చేసినవాణ్ణి కూడా ప్రేమించగలదు ఆడది. కానీ సాక్షాత్తూ ఆ భగవంతుడే వచ్చి ఎదుట నిలచినా ప్రేమవరాలు పుచ్చుకోలేదామె. అది మన సంప్రదాయం"

"మిస్టర్ శశీ, ప్రయత్నానికి అసాధ్యం ఉండదంటారు. నీ తరఫున నేను ప్రయత్నించి శకుంతల మనసును నీవైపు మళ్ళించనా?" అన్నాడు రాజు.

శశాంక తన చేతిలోని కాగితాన్నే చూస్తూ, "తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు... చేరి మగువల మనసు రంజింపరాదు. అదీ మన సంప్రదాయం" అన్నాడు.

రాజు ఆశ్చర్యంగా, "నా ప్రశ్నలు నీకెవ్వరూ రాసివ్వలేదే, మరి వాటికి సమాధానాలు నీ దగ్గరెలా రాసి ఉన్నాయి?" అన్నాడు.

శశాంక గర్వంగా తలాడించి, "అదేమరి, హీరో అంటే! సిట్యుయేషన్ నీకూ నాకూ మధ్య. నా రైటర్లు నీ ప్రశ్నలనూహించి కొన్ని డైలాగ్సు రాసిస్తారు. ఓవరాల్‌గా నేను చెప్పాల్సిన మాటలకు హిట్సు కూడా ఇస్తారు. వాటినుపయోగించుకొని నేను కొన్నింటిని యథాతథంగా చెబుతాను. కొన్నింటిని అప్పటికప్పుడు కల్పించుకుంటాను. ఇప్పుడు నీకు చెప్పానే ఈ డైలాగు మాత్రం నా స్వంతంకాదు. యథాతథంగా నా రైటర్లు రాసింది చదివాను. వాళ్ళు సామాన్యులు కాదులే..." అన్నాడు.

"నీ రైటర్లు సామాన్యులు కాకపోవచ్చు కానీ నీకు వాళ్ళమీద పూర్తి నమ్మకమున్నట్లు లేదు" అన్నాడు రాజు.

"అదేమిటి? నీకలాంటి డౌటే రాకూడదే" అన్నాడు శశాంక తెల్లబోయి.

"వాళ్ళమీద నీకు నమ్మకమే ఉంటే డైలాగ్సుతో ఆమె మనసు మార్చాలనుకునేవాడివి"

శశాంక మళ్ళీ కాగితం చూసి, "మన సమాజంలో సంప్రదాయం కొండ. డైలాగ్సు పొట్టేలు. డైలాగ్సుతో పనిజరగాలంటే సంప్రదాయంవల్ల బలహీనపడ్డ ఆడది కావాలి. ఇక ఈ విషయంలో తర్జనభర్జనలనవసరం. నామాట నీకు శిలాశాసనం" అన్నాడు.

"అలాగని నువ్వు తప్పు చెప్పినా చెయ్యాలా?"



"గీతాకారుడేమన్నాడు. 'కర్తృత్వంపట్ల అహంలేనివాడూ, నేనే చేస్తున్నాననే అజ్ఞానంలేనివాడూ ఈలోకంలో అందర్నీ వధించినాసరే- ఆ పాపం వాడికే మాత్రమూ అంటదు' అని అన్నాడు. జగన్నాటక సూత్రధారి ఆడిస్తున్న పాత్రలం మనం. కాదంటే నష్టపోయేదీ మనమే..." అన్నాడు శశాంక.

"పోనీ, నాకో అవకాశమిస్తావా? నేనా అమ్మాయిని మార్చుతాను. మార్చకుంటే నీ పద్ధతిలోనే వెడుదువుగాని..." అన్నాడు రాజు.

"సారీ, మై డిసిషన్ ఈజ్ ఫైనల్" అన్నాడు శశాంక.

"కట్" అన్నాడు దర్శకుడు.

"అరే, నేనింకా ఏదో చెప్పాలనుకుంటున్నాను" అన్నాడు రాజు.

"సారీ మిస్టర్ రాజూ! ఆ సీనుకు అంతం అదే! నువ్వింక నెక్స్ట్ సీన్లోకి వెళ్లాలి. అయితే ఆ సీన్కుకి షూటింగుండదు. అయినా షార్ట్ సీన్ కదా- నువ్విప్పుడు తిన్నగా దర్పణి ఇంటికి వెళ్ళాలి. అంతే! ఆ తర్వాతేం చేయాలో తెలుసు కదా" అన్నాడు భారవి.

★ ★ ★

"అయామ్ రాజు"

శకుంతల గొంతు బొంగురయిందేమిటన్న ఆశ్చర్యంతోపాటే ఆ మాట తన వెనుక నుంచి వచ్చిందన్న అనుమానమూ కలిగి వెనక్కు తిరిగింది దర్పణి.

"అయాంరాజు. నేను శకుంతలకోసం వచ్చాను. అమెరికానుంచి ఆమె అమ్మా, నాన్నా వచ్చారు. ఆమెను అర్జంటుగా తీసుకురమ్మని కారు పంపారు"

దర్పణి అతడిని పరీక్షగా చూస్తూ, "హాయ్ హీరో, నువ్వు శకుంతలకేమౌతావో తెలుసుకోవచ్చా? " అంది.

"ఏమీ కాను, కారు డ్రైవర్ని నేను"

"ఐ కాన్ట్ బిలీవ్- యూఆర్ హీరో" అంది దర్పణి.

"లారీడ్రైవర్, టాక్సీడ్రైవర్, ఆటోడ్రైవర్- సినిమాలపేర్లు వినలేదా మేడం. డ్రైవర్లు హీరోలు కాకూడదని లేదు"

"గుడ్ సజెషన్, అదిసరే... ఇప్పుడు శకుంతల బయల్దేరే స్థితిలో లేదు. కాసేపయ్యాక నేను తీసుకొచ్చి దిగబెడతానన్నానని చెప్పు" అంది దర్పణి.

"నో మేడమ్, అర్జంటుగా తీసుకు రావాలని నాకు మరీ మరీ చెప్పి పంపారు"

దర్పణి శకుంతలవైపు తిరిగి, "ఇతడి పేరు రాజు. ఇతడితో నువ్విప్పుడు అర్జంటుగా మీ ఇంటికి వెళ్ళాలట- వెడతావా? " అంది.

శకుంతల రాజును ఎగాదిగా చూసింది. ఆమె కళ్ళు మెరిశాయి. ఆమె స్నేహితురాలివైపు తిరిగి, "థాంక్యూ మైడియర్ ఫ్రెండ్" అంది.

ఆమె మాట ముద్దముద్దగా వినిపిస్తున్నందుకు రాజు ఆశ్చర్యపడితే థాంక్సుకు దర్పణి ఆశ్చర్యపడి, "నువ్వు నీ ఇంటికి వెళ్లడానికి నాకు థాంక్సెందుకు? " అంది.

"థాంక్సు చెప్పకుండా ఎలా? నా ప్రియుడెవరో నాకే తెలియదు. అయినా అడిగావు కదా అని ఊహించి చెబుదామనుకుంటే- ఈలోగా నువ్వే నా ఊహా రూపాన్ని నా ముందు నిలబెట్టి అతడితో వెళ్ళమంటున్నావు. దర్పణీ నేను నిన్ను ర్యాగ్ చేస్తున్నాననుకోకు. నిజంగా నువ్వు నాకు చాలా గొప్ప సాయంచేసావు" అంది శకుంతల.

రాజు, దర్పణి కూడా ఈ మాటలకు ఒకేసారి ఉలిక్కిపడ్డారు.

★ ★ ★

స్టీరింగు రాజు చేతిలో వుంది. కారు ముందుకు దూసుకుపోతోంది.

కారు వెనకసీట్లో వుంది శకుంతల. ఆమె రాజు రూపురేఖల్ని పదేపదే మెచ్చుకుంటూ మధ్యమధ్య అనవసరంగా నవ్వుతోంది.

"ఎందుకు నవ్వుతావ్? " అన్నాడు రాజు. అతడి గొంతులో చిరాకులేదు.

"ఎందుకో నాకు చాలా సంతోషంగా వుంది. నవ్వాలనిపిస్తోంది. బహుశా నిన్ను

చూసినందుకేమో" అంది శకుంతల.

"అది నా దురదృష్టం. ఈలోకంలో అందరికీ నన్నుచూసి నవ్వాలనిపిస్తుంది" అన్నాడు రాజు.

"ఏయ్- నా నవ్వువేరు. అందులో ప్రేమ వుంది" అంది శకుంతల.

"ప్రేమ ఎవరికోసం" అన్నాడతడు గంభీరంగా.

"ఇంకెవరి కోసం... నీకోసమే" అంది శకుంతల.

"అయినింటి ఆడపిల్లవి. అపరిచితుడితో ఇలా మాట్లాడ్డానికి సిగ్గుగా లేదూ నీకు? "

"ప్రేమిస్తే సిగ్గుపడాలా? " అందామె ఎంతో అమాయకంగా.

"ఇంతకుముందెన్నడూ నువ్వు నన్ను చూడలేదు. ఇలా చూసీచూడగానే ప్రేమించానంటున్నావ్... నీ గురించి నేనేమనుకుంటానన్న సంకోచమైనా లేదా? " పొడి గొంతుతో అడిగాడతడు.

"ప్రేమకు సంకోచముండదు"

"అంత సంకోచంలేని ప్రేమ నీకు నామీదెలా పుట్టింది? " అన్నాడు రాజు.

"ఏమో, దర్పణి నన్ను నా ప్రియుడెవరంది. ఎవరూ లేరని చెప్పాలనుకున్నాను. అనుకుంటూనే ఆలోచనలో పడ్డాను. ప్రియుడంటూ నాకుంటే అతడెలాగుండాలని! అంతే నా ఆలోచనలకు రూపం దిద్దిన నువ్వు కనబడ్డావు. ఆశ్చర్యపోయాను. ఏయ్ సిగ్గులేదూ అనద్దు. నిజంగా ఐ లవ్‌యూ. నిన్నిలా చూడగానే అలా నాలో ప్రేమ పుట్టింది"

"ఊఁ"

"నీకు చాలా చాలా థాంక్స్. మంచి సమయానిక్కనపడ్డావు. నాలో ప్రేమను పుట్టించావు. ఇప్పుడు నాకేమనిపిస్తోందంటే" మాటలకోసం తడుముకుంటూ ఆగిందామె.

"వద్దు. నువ్వు కాసేపు మాట్లాడొద్దు. నీ పరిస్థితి బాగాలేదు. మనస్థితి సరిగ్గాలేదు. ఇప్పుడు నువ్వేం మాట్లాడుతున్నావో నీకే తెలియదు. కాసేపు నిశ్శబ్దంగా ఉండు" అన్నాడు రాజు.

"ఏయ్" అందామె. "నా గురించి నువ్వేమనుకుంటున్నావ్. ప్రేమిస్తున్నానన్నానని చీప్‌గా ఆలోచిస్తున్నావా, గుర్తుచేసుకో. కార్లో ముందు సీట్లోకి వచ్చానా, వెనకాల కూర్చున్నాను. ఎందుకని? నిన్ను నేను ప్రేమించానుగానీ మనకింకా పెళ్లికాలేదుకదా... కాబట్టి మనం ఒకళ్ళనొకళ్ళు తాకకూడదు. అయాం వెరీ స్ట్రిక్ట్ యూనో"

"అలా స్ట్రిక్ట్‌గానే ఉండు. రేపు నీకు ఇంకా మంచి కుర్రాణ్ణి చూపిస్తాను. అతడికి బోలెడు డబ్బు. అతణ్ణి స్ట్రిక్ట్‌గా ప్రేమించి పెళ్ళి చేసుకో"

"ఏయ్... ఏయ్... నేను నిన్ను ప్రేమించానంటే నువ్వింకెవరి గురించో చెబుతావేమిటి? " ఆమె గొంతులో చిరుకోపం.

"ఎందుకంటే నేను నిన్ను ప్రేమించలేదు కాబట్టి"

"అబద్ధం. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావని నాకు తెలుసు" నమ్మకంగా అందామె.

"ఎలా? "

"నువ్వు దర్పణికి అబద్ధం చెప్పావు. మా అమ్మా నాన్న అమెరికానుంచి వచ్చారని. ఇప్పట్లో వాళ్లు రారనీ నాకు తెలుసు. అనుకోకుండా రావల్సి వచ్చినా ఏరోజొస్తే ఆరోజు నాకు తెలియకుండా ఉండదనీ నాకు తెలుసు"

"మరి అబద్ధమని తెలిసీ నాతో ఎందుకొచ్చావ్? "

"ఎందుకేమిటి? నిన్ను ప్రేమించానుగా..."

"నేను మోసగాణ్ణయితే"

"నువ్వబద్ధం చెప్పింది నామీద ప్రేమతో మోసం చేసినా నామీద ప్రేమతోనే చేస్తావు. నాకెందుకూ భయం" చాలా నమ్మకంగా చెప్పిందామె.

"నాకు నీమీద ప్రేమలేదని చెప్పానుగా... నమ్మవేం? "



"ఎలా నమ్ముతాను? నిన్ను చూశాను, నా కలల రాకుమారుడు కనిపించాడు. నీకళ్ళలో మంచితనం వెన్నెలై విరిసింది. నువ్వు నాకేకాదు, ఈ ప్రపంచంలో ఎవ్వరికీ అపకారం తలపెట్టలేవు. నువ్వు ప్రేమమూర్తివి. అందుకు నీతో వచ్చేయాలనిపించింది. తనవారందర్నీ వదిలి కొత్త జీవితం కోసం మరోమనిషి చిటికెన వేలు పట్టుకున్న నవవధువులా ఉత్సాహంతో, ఉద్వేగంతో నీతో నడిచాను. ఏయ్, నన్ను ఎక్కడికి తీసుకెళ్ళినా అభ్యంతరం పెట్టను. ఏకాంతం కావాలి మనిద్దరికీ. మనం మనసులు విప్పి మాట్లాడుకుందాం. అభిరుచులు తెలుసుకుందాం. అయితే మన హద్దుల్లో మనముండాలిసుమా..."

"ఉండకపోతే"

ఆమె ఉత్సాహంగా నవ్వి, "హమ్మయ్య, ఇప్పటికి నువ్వు నన్ను ప్రేమించడం లేదన్న డైలాగు విడిచిపెట్టావు" అంది.

"హద్దులు దాటడానికి ప్రేమ ఉండితీరాలన్న నియమం ఏమీలేదు"

"చాలా తెలివిగా మాట్లాడుతున్నావుకానీ నేను నీకంటే తెలివైనదాన్ని. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావనీ తెలుసు. నేను గీత గీస్తే అది దాటవనీ తెలుసు" అంది శకుంతల.

"ష్యూరే, నువ్వు చాలా తెలివైనదానివి. తెలివికాక ఇంకేమైనా ఉందా నీలో?"

"అంటే"

"నువ్వు పాడగలవా?"

"ఆఁ అటు సినిమా పాటలూ, ఇటు అన్నమయ్య, త్యాగరాజు అన్నీ వచ్చు"

"ఏదైనా పాడు" అన్నాడు రాజు. ఆమె ధోరణిని బాట మళ్లించాలని అతడి ప్రయత్నం.

శకుంతల గొంతు సవరించుకుంది. తడబడుతున్న నాలికను కూడగట్టుకుని, "కొత్తవాళ్ళడిగితే ఇంత వెంటనే పాడను. ఎందుకని అడగవేం?" అంది.

"ఎందుకు?"

"నాకు సిగ్గు, మొహమాటం..."

"తెలుస్తోందిలే..."

శకుంతల పాట మొదలయింది. "కొండగాలి తిరిగింది గుండె ఊసులాడింది. గోదావరి వరదలాగా కోరిక చెలరేగింది"

'గొంతు తియ్యనిది' అనుకున్నాడు రాజు.

శకుంతల పాట ఆపి, "నీపేరేమిటన్నావ్?" అంది.

"రాజు"

"హాయ్ రాజూ- నా పరిస్థితి ఇప్పుడీ పాటలాగే ఉంది..."

రాజు మాట్లాడలేదు.

"ఈ పాటను రాసింది ఆరుద్ర. పాడింది ఘంటసాల. పాట ట్యూను పెండ్యాలది. చూశావా- నాకెన్ని తెలుసో?"

రాజు మాట్లాడలేదు.

"ఈ పాట ఘంటసాల కోసమేనని మా బాబాయంటాడు. ఈ పాట ఆడాళ్ళు పాడితే బాగుండదని ఆయనన్నాడని పంతం పట్టి నేనీపాట నేర్చుకున్నాను. ఆ తర్వాతనుంచి ఆయన అసలిది ఆడాళ్ళపాటే- నీ అంత గొప్పగా పాడే ఆడవాళ్ళు లేక దీన్ని ఘంటసాలకిచ్చారు అని ఒప్పుకున్నాడు. ఈ పాటని తాతయ్య అడిగి పాడించుకున్నాడు. అమ్మమ్మ పాడించుకుంది. పాట విన్నాక అమ్మమ్మ నా గొప్పతనాన్ని దండోరా వేసేస్తే వీధిలో చాలామంది అడిగారు పాడమని. ముఖ్యంగా ఎదురింట్లో సుబ్బారావు అంకుల్ ఎన్నిసార్లడిగారో- ఒక్కసారి కూడా పాడలేదు నేను... ఎందుకని అడుగూ?"

"ఎందుకు?" రాజు గొంతులో రవంత కుతూహలం ధ్వనించింది మొదటిసారిగా.

"ఆ అంకుల్ ఎప్పుడూ కిళ్ళీ నములుతూ ఎర్రటి ఉమ్ము ఊస్తూఉంటారు. అందుకని ఆయనంటే నాకిష్టంలేదు. మరి ఇష్టంలేని వాళ్ళ దగ్గర పాడనుగా- అందుకని పాడలేదు. నువ్వంటే ఇష్టంగా అందుకని ఈరోజు నీ దగ్గర ఈ పాట పాడాను..."





'అందమైన ఆడపిల్లల ముఖాలే కాదు- మనసులు కూడా పసిపిల్లలవే' అనుకున్నాడు రాజు.

ఆమె మాట్లాడుతూనే ఉంది. కారు ముందుకు దూసుకుపోతోంది.



"ఇంకా రాజు అనుకున్న చోటుకి చేరలేదుట..." అన్నాడు శశాంక.

"ఇంతసేపు పట్టకూడదే" అన్నాడు భారవి.

"రాజు మోసంకానీ చెయ్యలేదుకదా!" అన్నాడో ఎక్స్‌ట్రా.

శశాంక ముఖం గంభీరంగా మారింది. అతడినే గమనిస్తున్న దర్శకుడు వెంటనే, "ఓసారి వెరిఫై చేద్దాం" అన్నాడు. అతడు చెప్పిన ప్రకారం వీడియో ప్రదర్శన జరిగింది.

శశాంక, భారతి కాళిదాసు, దర్శకుడు-వీడియో తెరమీదనే దృష్టిని కేంద్రీకరించారు.

తెరమీద రమ రెచ్చిపోతోంది. రాజును రెచ్చగొడుతోంది. రాజు గంభీరంగా ఉన్నాడు. ఆమె తనను తాకుతున్నా తానామెను తాకే ప్రయత్నం చెయ్యలేదు.

"రాజు నటుడుకాదు. తెరమీద మనం చూస్తున్నది నటనకాదు. అతడి నిగ్రహం ఎక్కడో యోగులకుకానీ సాధ్యంకాని నిగ్రహం" అన్నాడు శశాంక.

"కానీ రాజు యోగి కూడా కాదుగా" అన్నాడు భారవి.

"లక్ష్యసాధనే యోగమైతే రాజుకు పరమ యోగులకు మించిన లక్ష్యాలున్నాయి" అన్నాడు కాళిదాసు.

"రాజు గురించి ఇంతలోతుగా నువ్వెప్పుడు తెలుసుకున్నావు? " అన్నాడు శశాంక.

"ఎప్పుడైతేనేం- రాజు నిన్ను మోసం చెయ్యడనే నా నమ్మకం" అన్నాడు కాళిదాసు.

వీడియో షో ఆగిపోయింది. శశాంక మళ్ళీ సెల్ నంబరు నొక్కి, "ఇంకా రాజు అక్కడికి చేరలేదు" అన్నాడు.

"ఇప్పుడు నాకు అనుమానంగా వుంది. ఇంత టైము పట్టిందంటే రాజు ఆలోచన వేరే ఏదో వుంది" అన్నాడు దర్శకుడు.

అక్కడున్న అందరి ముఖాలూ గంభీరంగా అయిపోయాయి.

"ఉన్నట్లుండి రాజుని కూడా ఎవరో కోటీశ్వరుణ్ణి చేసేశారు. అందుకని కథలో శశాంక బదులు రాజే హీరో అయిపోయాడు" అన్నాడు కమేడియన్. అంతా సీరియస్‌గా చూస్తుంటే "నవ్వరేం, ఇది కాళిదాసు నాకు రాసిచ్చిన జోకు" అన్నాడు.

అతడి ముఖం చూసి అంతా నవ్వారు. కానీ శశాంక అనుమానంగా, "ఈ డైలాగు అవసరపడుతుందని నీకు ముందే ఎలా తెలుసు? " అన్నాడు.

"నాకు తెలిసిన దొకే మంత్రం" అన్నాడు కాళిదాసు.

అప్పుడందరూ ఏకకంఠంతో "విత్తనం గోచరం ఫలం అగోచరం" అన్నారు.

★ ★ ★

"శకుంతలేదీ? " అన్నాడు తాతయ్య.

"దర్పణి అని దాని స్నేహితురాలుంది. వాళ్ళింటికి వెళ్ళింది. ఈ రాత్రికి అక్కడే పడుకుంటానంది. బోలెడుమంది ఆడపిల్లలు చేరి కాలక్షేపం చేస్తారుట" అంది అమ్మమ్మ.

"అయ్యో, దానికీవేళ ఎలాగైనా పెళ్ళికొడుకు ఫొటో చూపించాలనుకున్నాను"

"ఈవేళ కాకపోతే రేపు, అంత తొందరేముంది"

"తొందరంటే తొందరే- దాని జాతకంలో ఈరోజు మహత్తరమైనరోజు. తన జీవితభాగస్వామిని చూడ్డానికీరోజు దాని మనసు పూర్తి అనుకూలంగా ఉంటుంది. ఎన్నుకుందుక్కూడా ఈరోజు ఎంతో అనుకూలమైనది. ఇంకా చెప్పాలంటే ఈరోజు ఎవడితో పెళ్ళి కుదిరితే వాడితో అది జీవితమంతా సుఖపడుతుంది"

"ఏమిటో అన్నీ మీరు జాతకాలతో ముడిపెడతారు. మనిషి మనసు జాతక చక్రంలో ఇముడుతుందంటారా? " అంది అమ్మమ్మ.

"భలేదానివే. మన మనసును, చర్యలను అదుపుచేసేది మనచుట్టూ ఉండే వాతావరణమూ, గ్రహాల స్థితిగతులూ అని ఆధునిక విజ్ఞానం కూడా ఒప్పుకుంది. అనుభూతి లోంచి పుట్టిన హోమియోపతి, అనుభవం లోంచి పుట్టిన ఆయుర్వేదం ఇప్పుడు వైద్య విజ్ఞానంలో భాగాలయ్యాయి. అనుభూతి, అనుభవాల కలయికలోంచి వచ్చిన జాతక చక్ర విజ్ఞానం సామాన్యమైంది కాదు. శ్రద్ధగా అధ్యయనం చేస్తే జాతకచక్రాన్ని మన దినచర్యకి మార్గదర్శకం చేసుకోవచ్చు. ఈరోజు శకుంతలకి వరుణ్ణి నిశ్చయించడానికి భేషైన రోజు" అన్నాడు తాతయ్య.

"మీరంతలా చెబుతుంటే నాకూ అవుననిపిస్తోంది. పిల్లాడి ఫొటో అది చూడాలా ఏమిటి? ఈ సంబంధాన్ని మనమే ఖాయం చేసేస్తే సరిపోదూ"

"సంబంధం ఎలాగూ ఖాయమయ్యేలాగుంది. ఫొటో పోస్టులో నిన్ననే వచ్చింది. జాతకచక్రం చూశాను కాబట్టి ఈరోజు కోసం అట్టేపెట్టి వుంచాను. వరుడి ఫొటోని అది చూస్తేనే బాగుంటుంది. జాతకాలకి మనం కాదు, అది చూడ్డమే ముఖ్యం"

"అయితే ఆ అమ్మాయింటికి ఫోన్ చేసి పిలిపిద్దాం" అంది అమ్మమ్మ.

ఇంట్లో ఫోన్ నంబరుకోసం ప్రయత్నిస్తే ఎక్కడా దొరకలేదు. చివరికి మనిషినెవరినైనా పంపుదామనుకుంటూండగా వాళ్ళకి ఫోను వచ్చింది.

రిసీవరెత్తితే "హలో! నేను దర్పణిని. శకుంతల స్నేహితురాలిని మాట్లాడుతున్నాను" అంది అవతలి గొంతు.

★ ★ ★

కార్లో రాజు, శకుంతల ఓ ఇంటికి చేరుకున్నారు. ఇంట్లో ఎవరూలేరు. రాజు తనే స్వయంగా ఇంటి తాళం తీశాడు.

చిన్న ఇల్లు. అన్ని సదుపాయాలూ వున్నాయి. ఎంతకాలంనించో రెగ్యులర్ మెయింటెనెన్స్ చేస్తున్నట్లు ఎంతో శుభ్రంగా వుంది.

శకుంతల ఉత్సాహంగా ఇల్లంతా తిరిగింది. గదులు చూసి సంబరపడింది. ఇల్లు చిన్నదైనా తమ ఇద్దరికీ అది చాలని మురిసిపోయింది. ఆమె ప్రవర్తన రాజుకి చాలా ఆశ్చర్యంగా వుంది.

ఆమె కబుర్లన్నీ ప్రేమ, పెళ్ళి చుట్టూ తిరుగుతున్నాయి. మాటలు మాత్రం పసిపిల్లలని స్ఫురింపచేస్తున్నాయి. తను వయసులో వుండి, పరాయి మగాడితో అరమరికలు లేకుండా మసలుతోంది. కళ్ళలో అమాయకత్వమే తప్ప భయంలేదు. అప్పుడప్పుడామె మాటలు రాజు హృదయానికి తగులుతున్నాయి కానీ అతడు తన హృదయానికి బుల్లెట్ ప్రూఫ్ కవచాన్ని తొడిగివుంచాడు. అందుకేనేమో నిబ్బరంగా వున్నాడు.

అయితే ఈ పిల్లని శశాంక బలాత్కారం చేస్తాడన్నదే అతడికి మింగుడు పడడం లేదు. కానీ ఇప్పుడు శశాంక ఒక మహత్తర శక్తి. అతడిని ఆపడం తనవల్లకాదు. ఏంచే





సినా ప్రయోజనం వుండదు కాబట్టి ఆమెని శశాంకకి అనుకూలంగా మార్చాలి. అందుకే అతడు కొంత ధైర్యం చేశాడు. శశాంక పథ కాన్ని మార్చాడు.

నిజానికతడు శకుంతలని వేరే ఇంటికి తీసుకుని వెళ్లాల్సివుంది. కానీ అది సరైన పద్ధతి అని రాజుకి తోచలేదు. ఆమెని మానసికంగా సంసిద్ధం చేయడానికి కనీసం ఒక్కరోజు గడువు కావాలని అతడనుకు న్నాడు. ఆమెని వేరేచోటుకు తీసుకొచ్చాడు. అందుకు ఏర్పాట్లు ముందే చేసుకున్నాడు. అయినా ఈ రోజుల్లో డబ్బుంటే జరగనిదే ముంది? శశాంక దయవల్ల రాజు దగ్గర పుష్కలంగా నోట్ల కట్టలున్నాయి.

కానీ శకుంతల ప్రవర్తనే అతడికి అయో మయంగా వుంది. ఆమె గురించి తను విన్నది వేరేగా వుంది. అందం తను విన్న దానికంటే ఎక్కువే వున్నా మొహమాటం బొత్తిగాలేదు. ఇలాంటి పిల్లతో శశాంక చొర వచేసి కనీసం మాటలకైనా దిగివుంటే ఎంతో బాగుండేది. అమాయకురాలు... శశాంక పూనుకుని వుంటే అతడితో లేచి వచ్చేసేదేమో.

ఏమీలేని తనతోనే లేచి వచ్చేసింది. చూసీచూడగానే కలల రాకుమారుడంది. ప్రేమిస్తున్నానంది. తను అబద్ధం చెబుతు న్నాడని తెలిసీ సంకోచించకుండా బయల్దేరి వచ్చేసింది.

అసలీమె ఎలాంటిది? పెళ్లికి ముందు ఒకరినొకరు తాకనైనా తాకరాదని పదేపదే అంటోంది కానీ చొరవచేస్తే పడిపోతుందనే అనిపిస్తోంది. అయినా తనకి స్ఫురించడంలే దనే చొరవ గురించి గుర్తు చేస్తోందేమో. ఆడపిల్ల అంతకుమించి ఏం చెబుతుంది?!

ఆమె గురించి ఏదైనా నిర్ణయం తీసుకునే లోగా ఆమె ప్రవర్తనని అంచనా వేయాలని అతడు గట్టిగా అనుకున్నాడు. దానిమీదనే అతడిముందు ప్లానంతా ఆధారపడివుంది.

ఇంట్లో స్థిరపడ్డాక అతడు శకుంతలతో "ఇల్లు వచ్చింది కదా. ఈరోజుకిది మన ఇల్లు. ఓకే?!" అన్నాడు.

"నువ్వు నన్ను కలుపుకుని మన అంటూంటే నాకెంతో బాగుంది. శరీరం నిలువెల్లా పులకరిస్తోంది. ఏదైనా పాట పాడనా?" అంది శకుంతల.

"ఇప్పుడు పాట కాదు, ఆట కావాలి" అన్నాడు రాజు.

"ఆట అంటే డాన్స్. అది నాకు రాదే" అంది శకుంతల.

"అందమైన ఆడపిల్ల ఎలా కదిలినా అది డాన్సే" అన్నాడు రాజు.

"నువ్వడిగితే కాదనలేను. డాన్సు చేస్తాను" అంటూ చటుక్కున ఓ కుర్చీలో కూర్చుంది శకుంతల.

"డాన్సు చేయాలంటే కూర్చున్నవాళ్లు నిల బడతారు. నువ్వేమో నిలబడ్డదానివి కూర్చు న్నావు"

"ఇంకా నేను రెడీ అవుతున్నాను. అప్పుడే మొదలెట్టేశాననుకున్నావా?" అని పకపకా నవ్వింది శకుంతల.

"ఊ" అంటూ ఆమెనే పరీక్షగా చూశాడు రాజు.

సమర్థుడైన కళాకారుడు మలచిన అద్భుత శిల్పంలా వున్నదామె. ఆమె ముఖంలో ఆలోచన. బహుశా డాన్సెలా చేయాలని ఆలోచిస్తోందేమో అనుకున్నాడ తను.

ఉన్నట్లుండి ఆమె మెడ అటూ ఇటూ కది లింది. తర్వాత రెండు చేతులూ గాలిలో ఆడాయి. పాదాలు నేలపై సవ్వడులు సృష్టించాయి. అప్పుడామె రెండు చేతులూ జోడించి నమస్కరించి ఫక్కున నవ్వేసి, "డాన్స్ అయిపోయింది" అంది.

"ఇదేం డాన్సు?"

"ఇష్టదేవతా వందనం. నా ఇష్టదేవతవు నువ్వే కదా. నీకు దణ్ణం పెట్టాను"

"దణ్ణంపెడితే డాన్సైపోతుందా?"

"ఉత్తినే దణ్ణం పెట్టానా? తల ఊపాను.



చేతులూపాను. కాళ్లు ఊపాను. అందమైన ఆడపిల్ల ఎలా కదిలినా అది డాన్సే అని నువ్వే అన్నావు. ఇప్పుడు కాదంటావేం? ”

ఫక్కున నవ్వాడు రాజు.

“ఏయ్ నువ్వు నవ్వావు. నవ్వితే ఎంత బాగున్నావో?! రాజూ! అస్తమానం నువ్విలా నవ్వచ్చు కదా, ఎందుకలా మూతి ముడుచుక్కూర్చుంటావు? ” అంటూ అతడెలా మూతి ముడుచుకుని వుంటాడో అభినయపూర్వకంగా చూపిందామె.

రాజుకి మళ్లీ నవ్వొచ్చింది.

“మళ్లీ నవ్వావు. నిన్ను నేను నవ్వించగలనన్నమాట. ఏయ్ రాజూ! నువ్వు నన్ను పెళ్లి చేసుకో. జీవితమంతా నవ్వుతూనే వుంటావు”

ఉలిక్కిపడ్డాడు రాజు. అంతలా ఆమె తనతో ఎలా మాట్లాడగల్గుతోంది? అసలామె ఏం మాట్లాడుతోందో ఆమెకి తెలుసా? మాట మార్చుడానికి, “నువ్వు నిలబడి డాన్సు చేయి, చూడాలనివుంది” అన్నాడు.

"చేసేదాన్నే. కానీ నిలబడితే వళ్లు తూలు తోంది"

"తాగేవా? "

"ఊ"

"సిగ్గులేదూ, మగాణ్ణి నేనే తాగను. ఆడ పిల్లవి తాగుడు అలవాటు చేసుకున్నావా? "

"నేను తాగింది అది కాదు, కూల్ డ్రింకు"

"కూల్ డ్రింకు తాగితే వళ్లు తూలు తుందా? "

"నా ఫ్రెండు అందులో భంగు కలిపింది. డ్రింకిచ్చేటప్పుడు చెప్పలేదు. తాగేక చెప్పింది" అంటూ శకుంతల దర్పణి కథ చెప్పసాగింది.

పరిస్థితి అర్థమైంది రాజుకి. అంటే ఈ అమ్మాయిప్పుడు భంగు ప్రభావంలో వుంది. అందుకే అంతలా సిగ్గువిడిచి మాట్లాడు తోంది. ఆమెలో ఇన్హిబిషన్సు లేవు.

"అరే, ఇది పూర్తిగా శశాంకకి అనువైన, అనుకూలమైన పరిస్థితి. నేను అనవసరంగా ఇప్పటికే జాప్యం చేశాను. చివరగా ఓ టెస్టు చేస్తే సరి" అనుకుంటూ అతడు "వళ్లు తూలుతుంటే కుర్చీలో కూర్చోకూడదు. బెడ్రూంలో పడుకోవాలి. పద, బెడ్రూంకి వెడదాం" అన్నాడామెతో.

★ ★ ★

"రాజు నన్ను మోసం చేశాడేమోననిపి స్తోంది. కానీ నాకతడిమీద ఏమాత్రమూ కోపం రావడంలేదు" అన్నాడు శశాంక.

"ఎందుకని? " అన్నాడు భారవి.

"స్వతహాగా మంచివాణ్ణి. బలాత్కారానికి పాల్పడ్డం నావల్లనవుతుందో లేదో తెలి యదు. కథకోసం ఒప్పుకున్నాను కానీ నాకు మనస్కరించడంలేదు. రాజు నన్ను మోసం చేస్తే బాగుండునని మనసు కోరుకుంటోంది"

"తిండి దొరక్క తోడేలు ఉపవాసం చేద్దా మనుకుందట. అనుకోకుండా ఓ మేకపిల్ల కనబడితే ఉపవాసాన్ని మర్నాటికి వాయిదా వేసిందట. కానీ ఆ మేకపిల్ల ఎలాగో తప్పిం చుకునేసరికి ఇంకానయం, ఉపవాసం వాయి దాపడలేదు అనుకుందట. నీ కథ అలా గుంది" అన్నాడు కమేడియన్.

"నువ్వు చెబుతున్నది తోడేలు గురించి. దానికి మేకపిల్లల్ని తినే అలవాటుంది. నన్ను తోడేలుతో పోల్చకు. ఇంతవరకూ ఒక్క బలాత్కారం కూడా చేయలేదు నేను" అన్నాడు రాజు.

"ఇకముందు కూడా చేయకూడదని ఖచ్చి తంగా నీకనిపిస్తే నేన్నీకు కొన్ని పేపర్ కటింగ్సిస్తాను. అవి చదివితే నీ ఆలోచనలు ఆరోగ్యకరమైన కొత్తపుంతలు తొక్కే అవకా శముంది" అన్నాడు కాళిదాసు.

"ఏమో, ఎక్కడ ఫోను మోగుతుందోనని గుండెలదురుతున్నాయి నాకు" అంటూండగా సెల్ మోగింది. శశాంక "హలో!" అని, అంతలోనే "అరే, శకుంతల గమ్యస్థానం చేరుకుంది. ఇక నేను బయల్దే రాలట" అన్నాడు.

"యాక్షన్" అన్నాడు దర్శకుడు.

శశాంక ప్యాంటు విప్పి పంచె కట్టాడు. మల్లెపువ్వులాంటి లాల్చీ తొడిగాడు. పరిమ ళాన్నిచ్చే స్ప్రేని వంటిమీద జల్లుకున్నాడు. మల్లెపూలదండను వార్తాపత్రికలో చుట్టాడు. పాలిథిన్ కవర్లోంచి తెల్లచీరనూ, బ్లవుజునూ బయటకి తీసి ఓసారి ముద్దుపెట్టుకుని మళ్లీ సంచీలో పెట్టేశాడు.

"గురూ, నిన్ను చూస్తే రేపుకు వెడుతు న్నావని ఎవ్వరూ అనుకోరు" అన్నాడు కమే డియన్.

"ఎందుకని? "

"నీ ముఖంలో క్రౌర్యంలేదు. కామం లేదు. ఉద్వేగం లేదు. సంకోచం లేదు. చెప్పలేనంత ప్రశాంతత. పట్టలేనంత ఉత్సాహం"

"ఎందుకుండవూ? నేనేమైనా కాని పని చేస్తున్నానా? రేపుకి అంటే టుమారోకి సన్నాహం. అంతే కదా"

"అందుకే అమెరికా ఆఫ్ఘన్ ప్రజలమీద





బాంబుల వర్షం కురిపిస్తున్నా అంతా మెచ్చుకుంటున్నారు. అది వారి రేపుకి అంటే టుమారోకి సన్నాహం కదా"

"బాగా చెప్పావు. డబ్బున్నవాళ్ల, రేపు లేని వాళ్ల రేపుకి ఎంతో మంచిది. నేను అమెరికా అంత మంచివాణ్ణి. ఆ మాట ఆఫ్ఘన్లకంటే ముందు శకుంతలచేత అనిపిస్తాను" అన్నాడు శశాంక.

"కట్" అన్నాడు దర్శకుడు.

"ఇప్పుడే ఊపులోకొచ్చాను. కట్ అనేశావేంటి? " విసుక్కున్నాడు శశాంక.

"ఏం చేయను? నువ్వు డైలాగు ఫ్రీగా చెప్పలేకపోతున్నావు. నీ ముఖంలో క్రౌర్యం, కామం, ఉద్వేగం, సంకోచం మాత్రమేకాక భయం కూడా కనబడుతోంది. రవంత కూడా ప్రశాంతత, ఉత్సాహం, సంతోషం కనబడ్డంలేదు" అన్నాడు దర్శకుడు.

"అనుకున్నాను. నేనే భావాలు దాచుకుందామని విశ్వప్రయత్నం చేస్తున్నానో సరిగ్గా అనే గుర్తుచేశాడీ కమేడియన్"

"నేనేం చేసేది? నా డైలాగ్ నేను పొల్లుపోకుండా చెప్పాను"

"శశాంక్! ఒక్కమాట. బయల్దేరేముందు నువ్వొక్క విషయం బాగా ఆలోచించుకో. మనిషిని క్రూరుడిగా మార్చడానికి పరిస్థితులొక్కటే చాలవు. జీన్సు ఎఫెక్ట్ కూడా వుంటుంది. నీకు రెండూ వున్నాయనిపించదు" అన్నాడు కాళిదాసు.

"అంటే నేనెందుకూ పనికిరానివాణ్ణనా నీ ఉద్దేశం? "

"మంచితనాన్ని కొందరలాగే అనుకుంటార్లే కానీ నువ్వు స్వతహాగా చాలా మంచివాడివని నాకు తెలుసు. మన షూటింగులో అది రుజువౌతూ వుంది. ఈ కథ నీది. అది నీ వ్యక్తిత్వానికి అనుగుణంగా వుండటమే మంచిది. చేతకాని పనులకి పూనుకోకు" అన్నాడు కాళిదాసు.

"పొగ చిమ్మేదాకా అగ్నిపర్వతం కూడా ప్రశాంతంగానే వుంటుంది. శశాంకమీద నాకు పూర్తి నమ్మకముంది" అన్నాడు భారవి.

"భారవీ! మన లోపాలు దాచిపెట్టుకోకూడదు. ఎంత క్షుణ్ణంగా వాటి గురించి తెలుసుకుంటే అంత బాగా మనం లక్ష్యాన్ని సాధిస్తాం. నా మాటని కొట్టిపారేయొద్దు. శశాంక తన ఉద్దేశాన్ని మార్చుకోవడం మంచిది. మార్చుకుంటే మన కథకింకో మార్గం చూపిస్తాను" అన్నాడు కాళిదాసు.

"శశాంక ముక్కుకి సూటిగాపోతాడు. కొండలెదురైనా ఢీ కొంటాడు తప్ప వెనక్కి చూడడు. భగవంతుడు మంచివాళ్లకి మేలు చేస్తాడు. శశాంక మంచివాడు" అన్నాడు భారవి.

"విత్తనం గోచరం, ఫలం అగోచరం. ప్రొసీడ్" అన్నాడు కాళిదాసు.

★ ★ ★

గుమ్మంలోనే ఎదురై శశాంకని సాదరంగా ఆహ్వానించాడు రాజు. లోపలికి వచ్చి స్థిమితపడ్డాక "ఆ అమ్మాయి శకుంతల కళ్లలో ఏదో సమ్మోహన శక్తి వుంది. దేవతలకి కీడు తలపెట్టాలనిపించదు కదా. నేనామెని అనుకున్న చోటుకి కాక వేరే చోటుకు తీసుకుని వెళ్లాను. నా పద్ధతిలో ఆమెకి నాలుగు మంచి మాటలు చెప్పి నీకు అనుకూలంగా మనసు మళ్లించి అప్పుడు నీకు అప్పజెప్పాలనుకున్నాను. కానీ చివరికి నువ్వు చెప్పినట్లే చేశాను" అన్నాడు రాజు

"ఊ" అన్నాడు శశాంక డైలాగ్ కోసం తడుముకుంటూ.

"నువ్వు శకుంతల ప్రేమకోసం రాక్షస మార్గాన్నెందుకెన్నుకున్నావో నాకర్థం కాలేదు"

"అదే వెరైటీ. అమితాబ్ బచ్చన్, చిరంజీవిల ట్రెండు. మన సమాజంలో అసలు సిసలు మంచితనం కంటే చెడ్డనుంచి మారిన మంచికి గ్లామర్ ఎక్కువ. నేను శకుంతల చుట్టూ ఎంత తిరిగినా ఆమె



నన్ను పట్టించుకోకపోవచ్చు. కానీ నాలో దుర్మార్గాన్ని చూశాక ఆమె కోసం నేను మంచిగా మారితే ఆమె మనసులో నాకు స్థానం ఏర్పడుతుంది. అక్కడ స్థానం సంపాదించాక మా ప్రేమకీ తిరుగుండదు"

"అలా జరక్కపోతే?"

"జరిగితీరుతుంది. ప్రతి మనిషిలోనూ ఇగో వుంటుంది. ఆడవాళ్లలో అది మరికాస్త ఎక్కువ. అన్నింటికీ తామే కేంద్రబిందువు కావాలని వారి కోరిక. ప్రతి పురుషుడి విజయం వెనుకా ఓ స్త్రీ వున్నదనే సామెత కూడా ఆడవాళ్ల అహాన్ని తృప్తిపరచడానికే పుట్టింది. తన కారణంగా నేను మారితే అది శకుంతలకి గొప్ప విజయం. అందుకు కృతజ్ఞతగా ఆమె జీవితాంతం నాకు కట్టుబడి వుంటుంది"

"ఇది వీడి స్వంతమో, భారవి రాశాడో... కానీ ఆలోచన మాత్రం తప్పుదారిలో వుంది. సినిమాలు మనుషుల ఆలోచనలను దారుణంగా మార్చేస్తున్నాయి" అనుకున్నాడు రాజు.

"అయినా ఎంతో ఆలోచించి తీసుకున్న నిర్ణయం నాది. దాని గురించి చర్చ అనవసరం. నేను చెప్పిందానికి వ్యతిరేకంగా నువ్వు చేశావని నాక్కోపంలేదు. నువ్వు మంచివాడివి. మంచివాళ్లెలా ఆలోచిస్తారో అలాగే నువ్వూ ఆలోచించావు. అందుకే నువ్వు జీవితంలో పైకి రాలేవు. ఇది గ్రహించే నేను నా ఆలోచనలను చెడువైపు మళ్లించాను. ప్రథమ ఫలితం డబ్బు. అదొచ్చాక నా ఆలోచన ప్రేమవైపు మళ్లింది. ఇక్కడా నా ఆలోచనలు చెడు చుట్టూ తిరుగుతున్నాయి. తిరగనీ అందువల్ల కనీసం నీకు నష్టంలేదు. నువ్వింక ఇక్కణ్ణించి వెళ్లొచ్చు వెళ్లేముందు ఓ విషయం చెప్పి వెళ్లు. ఆ అమ్మాయి కళ్లలో సమ్మోహనశక్తి వుందన్నావు. దానికి లొంగి ఆమెకి మేలు చేయాలనిపించిందన్నావు. అదెంతవరకూ నిజమో నేనిప్పుడెలాగూ తెలుసుకుంటాను. ఇక నీ సంగతి చెప్పు. మేలు చేయాలనుకున్న నీ బుద్ధి ఎందుకు మారింది? నాకు భయపడ్డావా?" అన్నాడు శశాంక.

"అది తెలుసుకుని ఏం చేస్తావు?"

"మంచివాళ్ల ఆలోచనలెందుకు ఎలా మారుతుంటాయో తెలిస్తే మంచివాళ్లని ఢీకొనడం మరింత ఈజీ కదా"

"కానీ నువ్విక్కడికి ఢీకొనడానికి వచ్చినట్లు అనిపించదు. నువ్వు ధరించిన దుస్తుల్లోనే ఎంతో సుహృద్భావం కనబడుతోంది"

"థాంక్స్. శకుంతలపట్ల నాకున్నది సుహృద్భావమేనని బాగానే గుర్తించావు. నా ప్రశ్నకి సమాధానం కూడా చెప్పు"

"ఆ అమ్మాయి భంగు పుచ్చుకుని ఆ నిషాలో ఎడతెరిపి లేకుండా ప్రేమకబుర్లు చెబుతోంది. అందుకని నాకు ఆమెపై సింపతీ కాస్త తగ్గింది"

"మరి ఆమె కళ్లలోని సమ్మోహన శక్తి?"

"ఆమె మాటలు విన్నాక ఆమె మొహం వైపు చూడ్డం మానుకున్నాను. సంప్రదాయంలో పుట్టిపెరిగిన ఆడపిల్ల ఈరోజిలా ప్రవర్తిస్తోందంటే బహుశా అది నా సంకల్పబలమని కూడా అనిపించింది. ఇక ఈ వ్యవహారంలో నా ప్రమేయం వుండరాదనుకున్నాను"

"గుడ్ డెసిషన్. ఇక నువ్వు వెళ్లు"

"ఆమె నిద్రపోతోంది" అన్నాడు రాజు.

"ఆమె సంగతి నేను చూసుకుంటాను. ఇక నీవామెని నీ ఆలోచనలనుంచి కూడా తొలగించవచ్చు 'గుడ్‌బై" అన్నాడు శశాంక.

రాజు వెళ్లిపోయాడు.

★ ★ ★

అందంగా అలంకరించిన పడకగదిలో మెత్తటి పాన్పుమీద ఆదమరచి నిద్రపోతోంది శకుంతల. శశాంక ఆమెని సమీపించి ఆగిపోయాడు.

అందం... ఆ పదం గురించి వినని వారి నోటివెంట కూడా పలుకుతుందా పదం ఆమెని చూడగానే. ఆమె శరీరంలోని ఏ





వంపునూ ఏ చిత్రకారుడూ కూడా రవం తైనా మార్చాలనుకోడు.

అనుభవం కోసం ఆమెని సమీపించిన శశాంక క్షణంపాటు అప్రతిభుడయ్యాడు. ఆ అద్భుత సౌందర్యరాశికీ అతడికీ మధ్య చేయి చాచితే అందేటంత దూరం. కానీ అతడికి ఆమెని చూడడమే ఓ గొప్ప అను భవంలా అనిపించిందప్పుడు.

శశాంక చేయి చాచి ఆమె భుజాన్ని తాకాడు.

"ఊ" అందామె విసుగ్గా.

ఈసారి శశాంక ఆమె భుజం తట్టాడు. ఉలిక్కిపడి లేచి కూర్చుందామె. శశాంక ఆమెనే చూస్తున్నాడు. శకుంతల కళ్లు నులు ముకుంది. వళ్లు విరుచుకుంది. అన్నీ నాట్య విన్యాసాలే.

ఆమె అతణ్ణి చూసింది. అతడి వళ్లు ఝల్లుమంది. "శకుంతలా!" అన్నాడతను.

ఆమె ఉలిక్కిపడి "ఎవర్నువ్వు?" అంది.

"నా పేరు శశాంక. నువ్వు నన్నెరుగవు. కానీ నువ్వు నాకు తెలుసు"

శకుంతల అతణ్ణి చూస్తూనే ఆలోచి స్తోంది. "నేనిక్కడికెలా వచ్చాను?"

శశాంక ఆమె ప్రశ్నని విన్నాడు. వికటా ట్టహాసం చేస్తూ తానెవరో చెప్పాలనుకు న్నాడు. తన పథకం వివరించి ఆమెని బెద రగొట్టాలనుకున్నాడు.

"నేనిక్కడికెలా వచ్చాను?" ఆమె కళ్లలో భయం, సంకోచం...

శశాంక నెమ్మదిగా "కంగారుపడనంటే ఏం జరిగిందో చెబుతాను" అన్నాడు.

అతడు మాట్లాడే పద్ధతి ఆమె భయాన్ని, సంకోచాన్ని కాస్త తగ్గించింది. "చెప్పు" అంది.

"నేనో అమ్మాయిని ప్రేమించాను. పెళ్ళిచే సుకోవాలనుకున్నాను. డబ్బులేక మా పెళ్ళి కుదరదనుకుంటే నా జాతకం మారి కోటీశ్వ రుణ్ణయ్యాను. పెద్దల ద్వారా పెళ్ళి మాటలు జరపాలనుకుంటూండగా ఆ అమ్మాయి కిడ్నాపయింది. ఆమెను వెయ్యి కళ్ళతో కని పెడుతున్న నేను కిడ్నాపర్ స్థావరం చేరు కుని వాణ్ణి తరిమికొట్టి నీ దగ్గరకు వచ్చాను. నువ్వే నేను ప్రేమించిన అమ్మాయివి" అన్నాడు శశంక.

శకుంతల నవ్వి, "నేను కిడ్నాపయ్యానని నాకే తెలియలేదు నువ్వు చేప్పేదాకా. అత డితో ఎంచక్కా కబుర్లు చెప్పాను. అతగాడు ముందు నన్నోచోటుకి తీసుకెళ్లాడు. అక్క ణ్ణించి ఇక్కడికి తీసుకొచ్చాడు. ఇక్కడ నాకు మంచి నిద్రపట్టింది. కిడ్నాపయ్యానన్న భయముంటే నాకు నిద్రపట్టేదికాదుకదా! నిజానికి నువ్వే కిడ్నాపరువి. నిద్రను నానుంచి కిడ్నాప్ చేశావు" అంది.

ఆమె ఇంకా భంగు ప్రభావంలో ఉన్నదని గ్రహించాడు శశాంక, "అసలు కిడ్నాపరువి నువ్వు. నా హృదయాన్ని ఎప్పుడో కిడ్నాప్ చేశావు" అన్నాడు.

ఆమె నవ్వి, "నీ హృదయాన్నా, నేనా?" అంది.

"ఎందుకంత ఆశ్చర్యం?"

"కిడ్నాప్ చెయ్యడానికి మనదేశంలో అబ్బాయిలకు హృదయాలుండాలికదా"

శశాంక నిట్టూర్చి "అవును, నిజమే. ప్రస్తుతం వ్యవస్థ అలాగే వుంది. మనప్రేమ ఫలించాక ఇద్దరం కలిసి ఈ వ్యవస్థను మార్చుదాం" అన్నాడు.

"ఏయ్, ఏమిటో మాటిమాటికీ మనం, ప్రేమ అంటున్నావు. అలాంటి మాటలు నాకిష్టముండవు" అంది శకుంతల హెచ్చరి స్తున్నట్లుగా.

"అంటే నువ్వు పెళ్ళిచేసుకోవా?"

"అది పెద్దాళ్లు చూసుకుంటారు. పెళ్ళ య్యేలోగా ఏ అబ్బాయితోనూ ప్రేమమా టలు మాట్లాడనని ఒట్టుపెట్టుకున్నాను"

"ఎందుకని?"

"మనది పవిత్రభారతదేశం. నేను దేశాన్ని ప్రేమిస్తున్నాను. ఈదేశం పవిత్రతను ఆడపి ల్లలు మాత్రమే కాపాడగలరని నా



నమ్మకం. పెళ్లికాని ఆడపిల్లల్లో ప్రేమ అన్నది ఆలోచనలో కూడా ఉండకూడదు. ఒక రాముడు. ఒక బాణం. ఒక అమ్మాయి. ఒక్కడే అబ్బాయి. ఇది నేను నమ్మిన సిద్ధాంతం"

"ఆ ఒక్కణ్ణీ నేనే కావాలనుకుంటే తప్పు కాదు కదా"

"నాకు తప్పే. ఇలా ఒకొక్కడే వచ్చి నేను నిన్ను ప్రేమిస్తున్నానంటే వాడి గురించి ఆలోచించాలి కదా. అలా ఆలోచించడం నాకిష్టముండదు. నా మనసెప్పుడూ నాకు నచ్చిన ఒక్కడి గురించే ఆలోచించాలి. ఎందుకంటే నేను ప్రియవ్రతను కావాలను కుంటున్నాను." అంది శకుంతల.

ప్రియవ్రత అంటే ఏమిటో శకుంతల చెప్పగా తెలుసుకున్నాక, శశాంక ఆశ్చర్యపో యాడు.

ఆమె అరమరికలు లేకుండా మాట్లాడు తోంది కానీ ఆమె కదలికలో, ఉచ్చరించే పదాల్లో పవిత్రత ఉట్టిపడుతోంది. ఆమె అనర్గళంగా మాట్లాడుతోంటే ఇప్పుడు తర చుగా ఆడియో కాసెట్లలో వినపడుతున్న గాయత్రి మంత్రంలా ఉంది.

ఆడ పిల్లల గురించి శశాంక ఆలోచనలు వేరు. ఈమె వాటికి భిన్నంగా ఉంది.

"ఒక్కమాట చెప్పు. ఇప్పటికే ఎవరినైనా ప్రేమించావా? " అన్నాడు శశాంక.

"నీకెందుకు చెప్పాలి? ఒకవేళ నిన్నే ప్రేమించినా ఇప్పుడా విషయం చెప్పను"

వళ్ళు ఝల్లుమంది శశాంకకు. తెరమీద ముప్పావు నగ్న విన్యాసాల తారలిచ్చే అను భూతికీ దీనికీ చాలాతేడా ఉంది. ఆమె ఇంకోసారి ఆమాటంటే బాగుండుననుకు న్నాడు కానీ సూటిగా అడగలేక, "నాలాంటి వాడికి నీ మనసులో మాట చెప్పటం మంచిది. నువ్వనుకున్నది సాధించడానికి నా సాయం కూడా ఉంటుంది. నేను సామాన్యుణ్ణి కానని ఇప్పటికే నీకు అర్థమై ఉంటుంది" అన్నాడు.

ఒకవేళ నిన్నే ప్రేమించినా- అంటేనే వళ్ళు ఝల్లుమంది. నిన్నే ప్రేమిస్తున్నా అంటే ఆ అనుభూతి ఎంత బాగుంటుందో!

ఆమె జవాబుకోసం ఆలోచనలో పడితే అతడు ఆశగా ఎదురుచూశాడు. ఆమె నీసాయం కావాలని అన్నా అతడి వళ్ళు ఝల్లుమనేలా వుంది.

"నీ ఆఫర్‌కి థాంక్స్! అయితే నువ్వు సామాన్యుణ్ణి కానంటున్నావు. ఆ విషయం నాకు తెలియదు. తెలియని వాళ్ళమీద ఆధారపడే తత్వంకాదు నాది"

"మరి ఎవరిమీద ఆధారపడతావు? "

"నా మీద నేనే ఆధారపడతాను. నేను చాలా పట్టుదలున్న మనిషిని. అనుకున్నది సాధించడంలో నేను సామాన్యురాలిని కాను. అదీకాక జీవితంలో ఏదైనా సాధిం చాలనుకున్నవాడు తనమీద తానే ఆధారప డాలని తాతయ్య అంటాడు. ఆమాట నాకు ఆదర్శం"

"నువ్వు చాలా గొప్ప వ్యక్తివి. నీ మాటలు విన్నాక నువ్వంటే ఆరాధన మరిం తగా పెరిగిపోయింది నాలో ఈ క్షణం నుంచీ నీ ప్రేమను పొందడానికైనా ప్రయ త్నాలు మొదలవుతాయి"

"ఆడదానిలో అమ్మ ఉంటుంది. చెల్లి ఉంటుంది. దేవత ఉంటుంది. ఎంత అందంగా వున్నాసరే పెళ్ళయ్యేదాకా ప్రియు రాలిని ఊహల్లో కూడా అమ్మ, చెల్లి, దేవత లంత పవిత్రంగా ఉంచాలి. అదే అసలు సిసలు ప్రేమ. నువ్వే ప్రయత్నాలు చేసినా ఈ విషయం మర్చిపోకు"

ఉలిక్కిపడ్డాడు శశాంక.

బలాత్కరించి అసహాయురాలినిచేసి ఆమెను పెళ్ళాడాలనుకున్నాడు తను. పెళ్ళ య్యేదాకా ఊహల్లో కూడా ప్రేయసీప్రియుల బంధం పవిత్రంగా ఉండాలంటోందామె.

రాజు నిజమే చెప్పాడు. నీలో ఏదో సమ్మోహనశక్తి వుంది. నీ ఔన్నత్యానికి నేను తలవంచుతున్నా. నా ఆలోచనలకు

సిగ్గుపడుతున్నా. నన్ను నేను మార్చుకుంటున్నా అనుకున్నాడతడు.

అప్పుడు టైము రాత్రి ఎనిమిదిన్నర యింది.

"పద, నిన్ను మీ ఇంటి దగ్గర దిగబెడతాను" అన్నాడు శశాంక.

★ ★ ★

దర్పణినుంచి ఫోను రాగానే శకుంతల ఇంట్లో కలవరం బయల్దేరింది. ఎవరో మాయ మాటలు చెప్పి శకుంతలను వేరే ఎక్కడికో తీసుకుపోయారని అర్థమయింది. వయసులో వున్న అందమైన ఆడపిల్లను అలా ఎందుకు తీసుకుని వెడతారో ఊహించడం వాళ్ళకు కష్టంకాదు. కానీ తమ ఇంటి పిల్ల కావడంతో మనసును చిక్కబట్టుకునేందుకు ప్రయత్నిస్తున్నారు.

నిజానికి దర్పణి ఇంకా ముందే ఫోను చేయాల్సింది. కానీ ఆమె భంగు ఆటలో ఉంది. అమ్మాయిలను వాగించి ఆ మాటలు రికార్డు చేస్తోంది. ఆ మాటల్లో పచ్చి శృంగారంనుంచి గుండెలు పిండే ఆవేదన వరకూ ఉన్నాయి. చెప్పాలంటే వేదనే ఎక్కువ.

పాలబుగ్గల పసివాడి ఆహ్లాదకరమైన ముఖారవిందం వెనుక భయంకరమైన పురిటినొప్పుల అనుభవం వున్నట్లు మన సమాజంలో ప్రతి ఆడపిల్ల వెనుకా ఏదోరకమైన అణచివేతల భయంకరానుభవముంది. కొన్నిచోట్ల తెలిసీ, కొన్నిచోట్ల తెలియకా కొన్నిచోట్ల తెలిసీ తెలియకా ఆడది అసమానతకూ, అసహనానికీ, అవమానానికీ, అణచివేతకూ సంబంధించిన అనుభూతులకు గురువుతూనే వుంది. ఆ అనుభూతులలోంచే సమాజానికి వారసులు పుడుతున్నారు. ఆ వారసుల ప్రతిభ అంతంత మాత్రంగా ఉండడానికీ కారణం అదే!

ఈ విషయం మన సమాజంలోని పురుష ప్రపంచానికి తెలియకపోలేదు. పాశ్చాత్యులను మించిన విజ్ఞానమూ, పాశ్చాత్యతకు మించిన గొప్ప సంప్రదాయమూ ఉన్నప్పటికీ మనదేశం పాశ్చాత్య దేశాల స్థాయికి చేరుకోవడంలేదంటే అందుక్కారణం- సంప్రదాయానికి పురుష ప్రపంచమిచ్చిన వక్రభాష్యమే. ఆడది తన్ను మించిపోగల ప్రమాదాన్ని పసిగట్టి ఆమెను అదుపులో ఉంచేలా సంప్రదాయాన్ని సవరిస్తూ తన అహాన్ని తృప్తిపర్చుకుంటున్న పురుషుడు సమాజానికి జరుగుతున్న అన్యాయాన్ని పట్టించుకోవడంలేదు.

ఆడది గౌరవించబడని సమాజానికి మోక్షంలేదని పెద్దల మాట ఉండనే వుంది. కానీ అది నీటిమూటగానే ఉండిపోతోంది.

తల్లిని గౌరవిస్తూ, చెల్లిని అభిమానిస్తూ, భార్యను ప్రేమిస్తూ సుఖజీవనం గడిపే మగాడు తనకు ఆడబిడ్డ పుడితే ఎయిడ్సు రోగం వచ్చినట్లు కృంగిపోతాడు. మగబిడ్డ పుట్టేదాకా తనకు మోక్షం లేనట్లే భావిస్తాడు. ఈ భావన మనసమాజంలోని ఆడపిల్ల స్థానానికి గీటురాయి.

దర్పణి స్నేహితురాళ్ళ మాటలను రికార్డు చేస్తూ ఆలోచనలోపడింది. తనూ వారి లాంటి జీవితమే జీవిస్తున్నాననీ, అంతవరకూ అది తనకు స్ఫురించలేదనీ ఆమెకు ఉన్నట్లుండి అర్థమైంది.

చిన్న దొంగతనం చేసి జైల్లో మగ్గుతాడు సామాన్యుడు. ఊళ్ళను ధ్వంసం చేసి మంత్రిపదవినలంకరిస్తాడు రాజకీయ గూండా. వెయ్యి రూపాయల వస్తువును కొంటే దాన్ని కొనడానికి డబ్బెలా వచ్చిందో చెప్పాల్సిఉంది ప్రభుత్వోద్యోగి. సామాన్య మధ్యతరగతి కుటుంబంలో పుట్టినా ఓ పెళ్ళికి వందలకోట్ల రూపాయలు ఖర్చుపెట్టగల స్తోమతెలా వచ్చిందో చెప్పాల్సిన బాధ్యత లేదు ప్రభుత్వాధి నేతకు.

ప్రజాప్రభుత్వంలో అందరూ ఎంత సమానులో తెలుస్తూనే ఉంది. న్యాయం, చట్టం ఆ సమానతనెలా పరిరక్షిస్తున్నదీ కనబడుతూనే ఉంది. భారతదేశంలో సామాన్యుడి

స్థితికీ, మన సమాజంలోని స్త్రీ స్థాయికీ తేడా ఏమీలేదు. "నేను తలచుకుంటే రాజ్యాలు కూలిపోతాయి. నేను కోరుకుంటే నల్లరాతిని నేతను చేయగలను" అని సామాన్యుడనుకుంటాడు. "నేను పురుషుణ్ణి శాసిస్తున్నాను. పురుషుడికి జన్మనిస్తున్నాను" అనుకుంటుంది ఆడది. ఆ తృప్తివారిద్దరినీ తమ స్థానంనుంచి ఎదగనివ్వదు. ఆ తృప్తినుంచి బైటపడడం వారికి సాధ్యం కాకుండా ఉంది.

దర్పణికి స్నేహితురాండ్ర మాటలు హృదయవిదారకంగా అనిపించాయి. చివరిగా ఒకామె, "నువ్వు ర్యాగింగు అనుకుంటున్నావు కానీ నిజానికిది నాకు మనసు విప్పి మాట్లాడ్డానికో మహత్తర అవకాశం. ఇన్హిబిషన్సు లేకుండా ఇలా మాట్లాడగల శక్తి రోజూ నాకుంటే ఎంత బాగుండునో ఇప్పుడు నాకెంతో సంతోషంగా ఉంది. మననింతటి సంతోషానికి దూరం చెయ్యాలనే పెద్దలు- అంటే మగాళ్లు మనకిలాంటివి నిషేధించారనిపిస్తోంది" అంది.

అప్పుడు దర్పణికి శకుంతల గుర్తుకొచ్చింది. భంగు ప్రభావంతో ఇంటికి వెళ్ళిందామె. అక్కడేం రభస జరుగుతోందో ఆమెకేదైనా చెడ్డ పేరు వస్తే తప్పు తనదని ఒప్పుకోవాలి. అందుకని ఫోను చేస్తే అవతలివాళ్ళ గొంతులామెకు మరోలా ధ్వనించాయి. అయితే రాజు అనుమానించతగ్గ వ్యక్తి అని వాళ్ళామెకు తెలియనివ్వలేదు. రాజు మగకుర్రాణ్ణి కిడ్నాప్ చేసివుంటే వాళ్ళ రియాక్షన్ ఇంకోలా ఉండేదేమో! అమ్మాయి అవడంతో అంతా హుష్- గప్‌చిప్!

ఇంట్లో ముందు గుసగుసలు, తర్వాత కలవరం, ఆ తర్వాత ఏడుపులు. విషయం పెడబొబ్బలదాకా వెళ్ళలేదు. ఎందుకంటే చుట్టుపక్కల వాళ్ళకు తెలియకూడదుకదా!

పోలీసు రిపోర్టు ఇవ్వాలన్న ఆలోచన కూడా తొందరగానే ముగిసిపోయింది. అందరికీ తెలుసు శకుంతల తిరిగొస్తుందని. ఎలా వస్తుందోనని వారి భయం. వచ్చాక పరిస్థితి ఎలా సంభాళించుకోవాలా అని వారి ఆలోచన.

ఆడదాని పవిత్రత విషయంలో ఆలోచించినంత ప్రాక్టికల్‌గా అన్నింట్లోనూ ఆలోచించగలిగితే మన సమాజం ఈపాటికి ఏ సంస్కృతికీ అందనంత పైమెట్టులో ఉండేదేమో!

చివరకు శకుంతల రానే వచ్చింది. వారూహించినట్లుకాక ఎంతో ఉత్సాహంతో వచ్చింది. మనిషి నలగలేదు. మాటలో జంకులేదు. జరిగింది తెలిశాక ఇంటిల్లిపాదీ శశాంకకు కృతజ్ఞతలు చెప్పుకుని పంపేశారు.

శకుంతలను భంగు ప్రభావం ఇంకా పూర్తిగా విడిచిపెట్టలేదు. అందుకని అందరితోనూ ధైర్యంగానూ హుషారుగానూ మాట్లాడుతోంది.

తాతయ్య ఆమెను చాటుగా తీసుకుని వెళ్ళి, "జాతకబలానికింతకంటే గొప్ప ఉదాహరణ ఉండదు. రాత్రి పదింటిలోగా ఎలాగో అలా రాబోయే వరుడి ఫొటో నీకు చూపించాలనుకున్నాను. అవకాశం పోయినట్లే పోయి మళ్ళీ వచ్చింది. మీ ఇద్దరికీ రాసిపెట్టి ఉన్నట్లుంది" అంటూ ఆ రోజు తను పడ్డ తపన అంతా వివరంగా ఆమెకు చెప్పాడు.

శకుంతల ఆశ్చర్యంగా, "కులం, మతం, జాతి వగైరాలేం కలవకపోయినా జాతకబలం వధూవరులను కలపగల్గుతుందా?" అంది అనుకోకుండా ఆమె గొంతులో ఆశ కూడా ధ్వనించింది.

తాతయ్య అది గుర్తించకుండా, "తప్పకుండా..." అన్నాడు నమ్మకంగా.

"జాతకబలం కలిసిన వాళ్ళను నువ్వు తప్పకుండా ఆశీర్వదిస్తావా?" అంది శకుంతల.

"నిస్సందేహంగా"

"అయితే ఆ ఫొటో ఇలా ఇవ్వు-" అంది శకుంతల. తాతయ్య ఫొటో అందివ్వగానే




దాన్నామె బోర్లా తిప్పి, "నేనిది చూడ్డంలేదు తాతయ్యా! నువ్వు పెట్టిన ముహూర్తంలోనే నేనో అబ్బాయిని చూశాను. అతన్ని చూడగానే నాలో ప్రేమ పుట్టింది. ప్రేమ అంటే ఏదో తాత్కాలికానుభూతి కాదు. నిన్ను, అమ్మమ్మను, బాబాయిని, పిన్నినీ, నాన్నను, అమ్మను ఎలా కావాలనుకుంటున్నానో అలాంటి దగ్గర అనుభూతి. నీకు తెలుసు కదా నేను ప్రియవ్రతనని... అతడి పేరు రాజు. నువ్వే మా పెళ్లి జరిపించాలి" అందామె.



శశాంక తన ప్రేమ ప్రయత్నాలు ప్రారంభించాడు. ఊళ్ళో తనకు పేరు రావాలంటే దాదాలను ఎదిరించడం ఓ గొప్పమార్గమని కాళిదాసు చెప్పగా- రాధాకృష్ణా కాఫీ క్లబ్బుని ఎన్నుకున్నాడు.

రాధాకృష్ణా కాఫీ క్లబ్బులో టిఫిన్లు బాగుంటాయి. ఎప్పుడూ రద్దీగా ఉంటుంది. హోటలు మరీ అంత పెద్దది కాదుకానీ పరిశుభ్రంగా ఉంటుంది. ప్రొప్రయిటర్ పద్మనాభం కుమార్తె గీత. ఆమె కాలేజిలో చదువుకుంటోంది. వయసామెను మెరుపుతీగెను చేసింది. ఒకరోజు కాలేజిలో ఓ కుర్రాడామె భుజంమీద చెయ్యి వేశాడు. అతడి చెంప పగులగొట్టిందామె. ఆ కుర్రాడు శంకర్ దాదా తమ్ముడు.

మర్నాడు శంకర్‌దాదా నలుగురు మనుషులతో రాధాకృష్ణా కాఫీ క్లబ్బుకి వెళ్ళాడు. బీరు, విస్కీ కావాలన్నాడు. వెజిటేరియన్ హోటల్లో చికెను, మటను వండి పెట్టాలన్నాడు. తమ బృందానికి సర్వింగు గీత చెయ్యాలన్నాడు. చెయ్యకపోతే ఆమెను నడిబజార్లో అవమానిస్తానన్నాడు.

పద్మనాభానికి మతిపోయింది. ఒకపక్క కుటుంబ గౌరవం, మరో పక్క వ్యాపారం. ఆయన శంకర్‌దాదాకూ, అతడి తమ్ముడికీ గీతచేత క్షమార్పణలు చెప్పిస్తానన్నాడు.

"అందుకొప్పుకుంటే ఇక్కణ్ణించి ప్రతి ఆడదీ నా తమ్ముణ్ణి చెంపదెబ్బ కొట్టి మర్నాడు క్షమార్పణ అడగడం మొదలెడుతుంది. నా తమ్ముడిమీద చెయ్యెత్తినందుకు అది తలదించుకోవలసిందే. వెంటనే ఏర్పాట్లు చేయి" అన్నాడు శంకర్‌దాదా.

పద్మనాభానికి పాలుపోలేదు- ఏం చేయాలో కాస్త గడువడిగాడు.

"రెండ్రోజులకంటే గడువివ్వను" అన్నాడు శంకర్‌దాదా.

"ప్లీజ్ వారంరోజులు కావాలి..." ప్రాధేయపడ్డాడు పద్మనాభం.

"ఏం చేసుకుంటావ్ వారంరోజులు? అసలు నేను నీకు గడువెందుకిస్తున్నానో తెలుసా? ఈ గడువులో నువ్వు నన్ను అణచాలని చాలా ప్రయత్నాలు చేస్తావు. ఆ ప్రయత్నాల్లో నీకు నేనెంతటివాణ్ణో తెలుస్తుంది. అది తెలుసుకుందుకే నీకు గడువు. నీకు ఎన్నిరోజులు గడువిస్తే అంత ఎక్కువగా నా గొప్పతనం తెలుసుకుంటావు. కానీ నా సంగతి తెలుసా? నేను దాదాని. దాదానెలాగయ్యాను? సహనంలేక! నాక్కోపం వస్తే ముందు వెనుకలాలోచించకుండా తోచింది చేస్తాను. ఆలోచించి వెధవపనులు చేసేవాళ్ళు దాదాలు కారు, రాజకీయవాదులు. మా ఇద్దరి కాంబినేషన్లో వర్ధిల్లుతున్న ప్రజాస్వామ్యంలో నువ్వున్నావు. నీ కూతుర్ని శిక్షించకుండా ఇంకో రెండ్రోజుల కంటే ఉండలేను. అర్థమైందా?" అన్నాడు శంకర్‌దాదా.

శంకర్‌దాదా తన శిక్షను అమలు పరిస్తే రాధాకృష్ణా కాఫీ క్లబ్ పరువుపోతుంది. పద్మనాభం రెండురోజులపాటు తనకు తెలిసిన పెద్ద తలకాయల్ని సంప్రదించాడు. వారిలో ఒక్కరూ పద్మనాభం వంటి చిన్నమనిషి కోసం శంకర్‌దాదా అనే కొరివితో తల గోక్కుందుకు సిద్ధంగా లేరు. అలాంటి సమయంలో విషయం శశాంకకు తెలిసింది. అతడి టీము సీను తయారుచేసింది.

శశాంక, కాళిదాసు, భారవి, దర్శకుడు పద్మనాభంను కలుసుకున్నారు. పరస్పరం మాట్లాడుకున్నాక పరిస్థితి అవగాహన చేసుకున్నారు.

"శంకర్‌దాదాను నేను చితగ్గొడతాను" అన్నాడు శశాంక.

"ఆ తర్వాత...? " అన్నాడు పద్మనాభం.

"ఏమీ కాదు. దాదాలు మొండివాళ్ళు వాళ్ళు మొండివాళ్ళకే భయపడతారు..."

"కానీ మీరు మొండివాళ్ళలా లేరు..." అన్నాడు పద్మనాభం.

"మొండివాణ్ణి మించిన మొండివాడు మొండివాడిలా కనబడకపోతే వాడు హీరో. నేను హీరోని" అన్నాడు శశాంక.

హీరో అన్న మాట వినగానే చాలామందికి సాధారణంగా ఒక్కమనిషి- వందమందిని చావగొట్టడం గుర్తుకొస్తుంది. పద్మనాభానికి మాత్రం బద్దలైన పాత్రసామగ్రి, విరిగిపోయిన ఫర్నిచర్, కూలిన గోడలు... ఇలాంటివన్నీ గుర్తుకొచ్చి "అమ్మో నాకు హీరో సాయం వద్దు. లాభం కంటే నష్టమెక్కువ" అన్నాడు.

కాళిదాసు ఆయన పరిస్థితి అర్థం చేసుకుని, "రేపు మీ హోటల్లో ఫర్నిచరుండదు. నేలమీద చాపలు పరవండి. టిఫిన్లు అరిటాకుల్లో సర్దండి. మంచినీళ్ళు స్టీలు గ్లాసుల్లో ఇవ్వండి. శంకర్ దాదాని మా హీరో బయటకు లాగి తంతాడు. మీకు లాభమే తప్ప నష్టముండదు" అన్నాడు.

కూతురి భవిష్యత్తుకీ శంకర్‌దాదాకీ ముడిపడి ఉండడంవల్ల పద్మనాభం అయిష్టంగానే అన్నింటికీ ఒప్పుకున్నాడు. విషయాన్ని రహస్యంగా ఉంచాడు.

మర్నాడు శశాంక టీము పద్మనాభం హోటలుముందు తిష్టవేసింది. అతడితో పాటు మెరికల్లాంటి నలుగురు వస్తాదులు కూడా వచ్చారు. వాళ్ళు రకరకాల ఫైటింగ్సులో సుశిక్షితులు.





శంకర్‌దాదా తన బృందంతో రాధాకృష్ణా కాఫీ క్లబ్బుకు వచ్చాడు. వస్తాదులతణ్ణీ అతడి బృందాన్ని ఆపి చావగొట్టారు. వాళ్ళు పూర్తిగా నీరసపడిపోయాక మేకప్‌మ్యాన్ వాళ్ళకు టచప్‌లిచ్చి మళ్ళీ ఫ్రెష్‌గా కనబడేలా చేశాడు. అప్పుడు శశాంక వాళ్ళ ముందుకు వచ్చి, "ఎటాక్ మీ!" అన్నాడు.

వాళ్ళెవరికీ అతడిమీద దాడిచేసే ఓపిక లేదు. కానీ అటుపక్కనుంచి వస్తాదులు హుంకరించడంతో తప్పనిసరై శశాంకమీదకు వెళ్ళారు.

దర్శకుడు, "యాక్షన్" అన్నాడు.

అప్పుడు శశాంక నిజంగా హీరోలాగే ఆ అయిదుగుర్నీ చావబాదాడు. వీడియో కెమేరా ఆ విశేషాలను రికార్డు చేసింది.

చివరకు శంకర్‌దాదా తన అనుచరులతో అతడి కాళ్ళమీద పడ్డాడు.

"ఈ రోజునుంచీ కష్టం చేసుకుని బతుకు. నువ్వు చెయ్యి సాచాలే తప్ప ఎత్తకూడదు. ఎత్తినట్లు తెలిసిందో ఆ తర్వాత ఎత్తడానికి చెయ్యుండదు" అన్నాడు శశాంక.

వినయంగా తలలూపి శంకర్‌దాదా, అనుచరులు వెళ్ళిపోయారు.

పద్మనాభం శశాంక మెడలో పూలదండ వేశాడు. అంతలోనే ఓ జర్నలిస్టు అక్కడకు వచ్చి శశాంక వివరాలడిగాడు.

"మన ముఖ్యమంత్రి జన్మభూమి కార్యక్రమాలు చేపట్టారు. మన రోడ్డు మనం వేసుకుని, మన చెరువులు మనం తవ్వుకుని, మన చెట్లు మనం పాతుకుని అదే జన్మభూమి అనుకుని సరిపెట్టేసుకోకూడదు. ఆయన ఇచ్చిన స్ఫూర్తితో నేనీ నిర్ణయం తీసుకున్నాను. మన రక్షణ మనమే చూసుకోవాలి. అదే హీరో మార్గం. ఎక్కడ దాదాగిరీ తలెత్తితే అక్కడి యువత దాన్ని అణచివేస్తూండాలి..." అన్నాడు శశాంక.

చుట్టూ చేరినవారు శశాంకకు జయజయధ్వానాలు పలికారు.

మర్నాడు అతడి ఫొటోతోసహా ఆ వార్త

అన్ని స్థానిక పత్రికల మొదటి పేజీలోనూ ప్రముఖంగా వచ్చింది.



"ఇతడే కదమ్మా- నిన్ను రక్షించింది" అన్నాడు తాతయ్య శశాంక ఫొటో చూపిస్తూ.

"రక్షించడం కాదు ఇంటికి తీసుకొచ్చాడంతే..." అంది శకుంతల.

"ఆడపిల్లకు రెండూ ఒకటేలే కానీ ఇతడు మనవాళ్ళేనా? " అన్నాడు తాతయ్య.

"ఉన్న కాసేపూ అతడితో కులం, మతం మాట్లాడేననుకున్నావా? " అంది శకుంతల.

"మరేం మాట్లాడావు? "

"ఏం మాట్లాడానో, ఏం జరిగిందో అంతా నాకు గుర్తుంది తాతయ్యా! కానీ అప్పుడంతలా ఎలా మాట్లాడానో నాకిప్పుడర్థం కాకుండా ఉంది. తలచుకుంటే సిగ్గేస్తోంది కూడా" అంది శకుంతల.

"ఏం సిగ్గో అప్పుడు రవంత సిగ్గు లేకుండా రాజును ప్రేమిస్తున్నానన్నావు. అది సమయం కాదని అప్పటికూరుకున్నాను. నీకు ఫస్ట్‌క్లాస్ సంబంధం తెస్తే ఫొటో చూడలేదు. పోనీలే ఈ రోజన్నా చూడు" అన్నాడు తాతయ్య.

"ఇప్పుడు సిగ్గేస్తోంది తాతయ్యా" అంటూ అక్కణ్ణించి తప్పుకుంది శకుంతల.

అలా తప్పుకుంది కానీ రాజు రూపం ఆమె మనసులోంచి చెదిరిపోవడంలేదు.

నిర్మొహమాటంగా రాజుకు తన మనసులోని మాటను చెప్పిందామె అప్పుడు. ఇప్పుడు తలచుకుంటే ఆశ్చర్యంగా ఉంది. కానీ రాజుకు తనమీదున్న అభిప్రాయమేమిటి?

మరోసారి రాజును కలుసుకోవాలనుకుందామె. కానీ ఎలా?

బాగా ఆలోచించి దర్పణికి ఫోను చేసింది శకుంతల.

★ ★ ★

దర్పణి వెంటనే బయల్దేరి శకుంతల ఇంటికి వచ్చింది. వెంటనే ఇద్దరూ ఓ గదిలో చేరారు. దర్పణికి కాస్త గిల్టీగా ఉంది. తానిచ్చిన భంగుప్రభావంతో శకుంతల జీవితగతి మారిపోతుందేమోనని. భంగు ప్రభావంలోనే ఆమె రాజును చూసింది. ఆ ప్రభావంలోనే అతడితో వెళ్ళింది. అతడితో నిర్భయంగా మసిలింది. లేకుంటే ఆమె తనతోపాటు తనింట్లోనే ఉండేది.

ఇప్పుడామె రాజును ప్రేమించానంటోంది.

"వాడో కిడ్నాపరు. వాణ్ణి మర్చిపో" అంది దర్పణి.

"ఆ కిడ్నాపరునుంచి నా గుండెను నాకు తిరిగిప్పిస్తేనే నువ్వు చెప్పింది సాధ్యం" అంది శకుంతల.

"నీ అంత మంచి అమ్మాయి ప్రేమలో పడిందంటే నేను నమ్మలేకుండా ఉన్నాను"

"నీకు తెలియదా? ప్రేమ మంచివాళ్ళ సొత్తు"

"సరే... నేనిప్పుడేం చేయాలి? "

"నేను రాజును భంగు మత్తులో లేనప్పుడోసారి కలుసుకోవాలనుకుంటున్నాను. అందుకు నువ్వు ఏర్పాటుచేయాలి" అంది

శకుంతల.

"ఆ రాజెవడో నాకేం తెలుసు? "

"శశాంకను కలుసుకుంటే తెలుస్తుంది"

"ఇలాంటివాళ్ళ అడ్రసులన్నీ మెయింటైన్ చేయడం తప్ప శశాంకకు వేరే పని ఉండదనుకుంటున్నావా? నేను శశాంకను కలుసుకోను" అంది దర్పణి.

"రాజు నన్ను కిడ్నాప్ చేశాడు. అది తప్పు. అందుకు రాజుచేత నాకు క్షమార్పణ చెప్పించాలని చెప్పు. శశాంక వెంటనే ఒప్పుకుంటాడు" అంది శకుంతల.

"ఎందుకొప్పుకుంటాడు? "

"అతగాడు నన్ను ప్రేమిస్తున్నాడు"

"ఎలా తెలుసు నీకు? " అంది దర్పణి తెల్లబోయి.

"అతడే చెప్పాడు" అని నవ్వి,

"శంకర్ దాదాను కొట్టడం నన్ను ఇంప్రెస్ చేయడానికేనని నీకు తెలుసా? ఇంకా చూడు. నాకోసం ఎన్ని గొప్పపనులు చేస్తాడో? "

"నువ్వు చెప్పేది నిజమైతే నువ్వు చాలా చాలా గొప్పదానివే. నిన్ను ప్రేమించడంలో కూడా లోకకళ్యాణముంది" అని నవ్వింది దర్పణి.

"అలా తేలిగ్గా తీసిపారేయకు. నా ఊహే నిజమైతే రాజు కూడా శశాంక మనిషే. నన్ను ఇంప్రెస్ చేయడానికి శశాంక నన్నతడిచేత కిడ్నాప్ చేయించాడు. తను విడిపించినట్లు నాటకమాడాడు. నా అనుమానం ఆధారం లేనిదికాదు. నాతో రాజు ప్రవర్తన కిడ్నాపర్లా కాక చాలా హుందాగా ఉంది"

"చూసీ చూడగానే అతణ్ణి ప్రేమించావు. అందుకే నీకతడి ప్రవర్తన హుందాగా అనిపించి ఉంటుంది. కాస్త వాస్తవంలోకి రా. రాజును మర్చిపో నిజంగా ప్రేమించాలని ఉంటే శశాంక మీదకు దృష్టి మళ్ళించు. అతడు నిన్ను ప్రేమించాడని కూడా అంటున్నావు"





"సారీ దర్పణీ... ఈ ప్రియవ్రత ఒకసారి రాజును ప్రేమించి మళ్ళీ వేరెవరినో ప్రేమించలేదు. ప్రేమకు సంబంధించినంత వరకూ నా హృదయద్వారాలు లాకైపోయాయి. ఇంకెవ్వరూ నా హృదయంలో అడుగుపెట్టలేరు. అదీకాక నా హృదయం నా దగ్గరలేదు" అంది శకుంతల.

"ఆర్యూ సీరియస్" అంది దర్పణి.

"ఎస్. మైడియర్ ఫ్రెండ్. అయాం డామ్ సీరియస్" అంది శకుంతల.

"ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకు. నా అజ్ఞానమే నాచేత ఈ ప్రశ్న వేయిస్తోంది. ప్రేమంటే ఏమిటి? నువ్వు దాన్ని ఎలా గుర్తించావు? " అంది దర్పణి.

"ప్రేమంటే ఒక్కొక్కరికి ఒక్కో అర్థం. నాకు సంబంధించి ప్రేమంటే రాజు. అతణ్ణి చూడాలి. అతడితో మాట్లాడాలి. అతణ్ణి సంతోషపెట్టాలి. అతడితో జీవితాన్ని గడపాలి. అతడు దక్కడనుకుంటే జీవితం వ్యర్థం. ఇవీ నా భావనలు. వీటిని నేను ప్రేమ అంటున్నాను"

ఈ మాటలు వింటూ దర్పణి స్నేహితురాలివైపే చూస్తోంది. ఆ చూపుల్లోంచి ఏదో అనుభూతి వర్షిస్తోంది. ఆ అనుభూతి ఎంతో ఆహ్లాదకరంగా వుంది. బహుశా ఆమె కనులు ప్రేమను వర్షిస్తున్నాయేమో.

"థాంక్స్ మైడియర్ ఫ్రెండ్... నాకు ప్రేమను చూసినట్లే అనిపిస్తోంది" అంది దర్పణి.

"దెన్ ప్లీజ్ హెల్ప్ మీ!"

"నేను శశాంకను కలుస్తాను" అంది దర్పణి.

★ ★ ★

"కళ్ళు మూస్తే శకుంతల. తెరిస్తే శకుంతల. ఆఖరికి అసహ్యంగా ఉండే ఈ కమెడియన్ మొహంలో కూడా నాకు శకుంతలే కనిపిస్తోంది. ఇప్పుడు నేనేం చేయాలి? " అన్నాడు శశాంక.

"వ్యభిచార గృహానికి వెళ్ళు" అన్నాడు కాళిదాసు.

"ఛీ... నా తాపం శరీరానిది కాదు. మన సుది" అన్నాడు శశాంక.

"నేనూ శరీరతాపం గురించి చెప్పలేదు. వ్యభిచార గృహంలో అసహాయులైన మహిళల కథలు తెలుసుకుని వారిని ఉద్ధరించు" అన్నాడు కాళిదాసు.

"అయిడియా అద్భుతం" అన్నాడు శశాంక.

"అద్భుతమే కానీ ఇది శంకర్ దాదాను కొట్టినంత తేలికకాదు. అక్కణ్ణించి పిల్లను బయటకు తేవడం కంటే బిన్‌లాడెన్‌ని తోరాబోరా గుహల్లో పట్టుకోవడం ఈజీ" అన్నాడు దర్శకుడు.

"ఎందుకని? "

"అవి నడిపేవారి కనెక్షన్సు అలాంటివి"

"అందుకూ ఓ అయిడియా ఉంది" అన్నాడు భారవి. "మనమే ఎక్కణ్ణించో ఓ అనామకురాలిని తీసుకొద్దాం. బతిమాలి ఓ వ్యభిచార గృహంలో ఉంచుదాం. ఉంచుకున్నందుకూ డబ్బులిచ్చి, విడిపించీ డబ్బులిద్దాం. ఆ వ్యభిచారగృహంలోని మిగతా మహిళలందరూ తమకిష్టమయ్యే ఈ వృత్తిలో ఉన్నారని ఓ సర్టిఫికెట్ ఇచ్చామంటే మన పథకానికి తిరుగే ఉండదు. మనం రక్షించామంటున్న పిల్లచుట్టూ ఓ విషాదగాథ అల్లి శశాంక హీరోయిజానికి ప్రచారాన్నిద్దాం"

"తర్వాత ఆ పిల్లేమవుతుంది? " కుతూహలంగా అడిగాడు కమెడియన్.

"ఆమె అనామకురాలుగానే మిగిలిపోతుంది" అన్నాడు భారవి.

"మన డిస్కషన్ ఆ పిల్లగురించి కాదు. హౌ టూ ఇంప్రెస్ శకుంతలా" అన్నాడు శశాంక.

భారవి నవ్వి, "నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. బలాత్కరించాలనుకున్న అమ్మాయిని ఇంప్రెస్ చేయాలనుకుంటున్నావు. వాటే చేంజ్" అన్నాడు.

"నాకాశ్చర్యంగా లేదు. శశాంకది నిజమైన ప్రేమ. అయాం ఇంప్రెస్డ్ నౌ. చూస్తూ ఉండు. మనం ఏ కథలూ అల్లనవసరంలేకుండా అవకాశాలు శశాంకను వెతుక్కుంటూ వస్తాయి" అన్నాడు కాళిదాసు.

సరిగ్గా అప్పుడే దర్పణి అక్కడకు వచ్చి తన్నుతాను పరిచయం చేసుకుంది. శశాంక అంటే శకుంతలలో ఆరాధన బయల్దేరిందనీ తన్ను కిడ్నాప్ చేసిన రాజుచేత తనకు క్షమాపణ చెప్పించగల సమర్థుడతడేననీ అందామె.

శశాంక పొంగిపోయాడు "డన్" అన్నాడు.

★ ★ ★

రాజు శకుంతలకు క్షమాపణ చెప్పడానికి సిద్ధంగానే ఉన్నాడు. అయితే కిడ్నాపరు ముద్రతో ప్రపంచంముందు నిలబడే సాహసం అతడు చేయదలచుకోలేదు. అతడికి భవిష్యత్తుమీద బోలెడాశ ఉంది. కాబట్టి తనచుట్టూ ఓ గౌరవప్రదమైన కథను అల్లుకున్నాడు.

కాళిదాసు చక్కని కథకు పూనుకున్నాడు. ఆ ప్రకారం శశాంక, రాజు మంచి మిత్రులు. శశాంక ఉన్నవాడుగా మారినా, రాజు లేనివాడిగానే మిగిలినా వాళ్ళ స్నేహం అలాగే నిలిచింది.

ఒకరోజున మిత్రులిద్దరూ సచ్ఛీలత గురించి చర్చిస్తూ సవాలుదాకా వెళ్ళారు. సమాజం పవిత్రత స్త్రీ శీలంమీదనే ఆధారపడి ఉన్నదని శశాంక అన్నాడు. శీలం స్త్రీపురుషులకు సమానమని రాజు అన్నాడు. పురుషుడు స్వతహాగా బలహీనమనస్కుడనీ అందుకే స్త్రీ తన జాగ్రత్తలో తానుండాలనీ శశాంక అన్నాడు.

"నేనో అందమైన యువతిని కిడ్నాప్‌చేసి ఆమెతో కొన్నిగంటలు ఏకాంతం పొందుతాను. ఆమెచేతనే మంచివాడిననిపించుకుంటాను. వైద్యపరీక్షలక్కూడా నిలబడగల పవిత్రతను పాటిస్తాను" అని రాజు సవాలు చేశాడు.

"మన సమాజంలో అపవాదులు గుట్టగా పడి ఉంటాయి. వాటి ధూళి ఆడపిల్లలపై వాలాలని ఎదురుచూస్తూంటుంది. నీ సవాలు ఏ అమాయకురాలినీ బాధించకూడదు" అన్నాడు శశాంక.

రాజు సరేనని అతడికి మాట ఇచ్చాడు.

ఆ సమయంలో దర్పణి తన స్నేహితురాళ్ళతో ర్యాగింగు ప్రోగ్రాం పెట్టింది. అందులో భంగు విభాగం పెట్టాలన్న మరో స్నేహితురాలి సూచనను అమలుచేయాలనుకుంది. ఆ స్నేహితురాలి ద్వారా ఈ వార్త రాజును చేరింది. భంగు పుచ్చుకున్న ఆడపిల్లకు మనోస్థైర్యం బాగుంటుందని అతడనుకున్నాడు. వెంటనే నిర్ణయం తీసుకున్నాడు.

కారు శశాంకది. పిల్ల ఎవరో శశాంకకు తెలియదు.

రాజు దర్పణి ఇంటికి వెళ్ళాడు. అబద్ధం చెప్పి శకుంతలను తనతో తీసుకుని వెళ్ళాడు. ఆమెతో కొన్నిగంటలు గడిపాక శశాంకను సెల్‌ఫోన్లో కాంటాక్టు చేశాడు.

అతడు చెప్పిన వివరాలు విని శశాంక కలవరపడ్డాడు. శకుంతలను తన మిత్రుడు కిడ్నాప్ చేసినట్లు గ్రహించాడు. ఫోన్లో మిత్రుణ్ణి తప్పుపట్టాడు.

"శకుంతలది సంప్రదాయ కుటుంబం. ఆ అమ్మాయెంతో మంచిపిల్ల. నువ్వు చేసిన పనికి రేపు ఆ కుటుంబం తలెత్తుకోలేని పరిస్థితి ఏర్పడవచ్చు" అంటూ మిత్రుణ్ణి మందలించి తానే అక్కడికి వెళ్ళాడు. మిత్రుణ్ణి బయటకు పంపేసి నిద్రపోతున్న శకుంతలకు మెలకువ తెప్పించి ఆమెను ఇంటివద్ద దిగబెట్టాడు.

తను సవాలులో నెగ్గాననే తప్ప ఇప్పటికీ రాజు తప్పు చేశాననుకోవడంలేదు. అయితే శకుంతల మనసు నొచ్చుకున్న పక్షంలో అతడామెకు క్షమాపణ చెప్పుకుందుకు సిద్ధంగా ఉన్నాడు.

★ ★ ★

"మీరు చేసిందేమీ బాగోలేదు" అన్నాడు తాతయ్య.

"తాతగారూ! ఇందులో మీరు అంటూ నన్నే కలపొద్దు. అయాం వెరీ సెన్సిటివ్. అందుకే వ్యక్తిత్వంకంటే కూడా వాస్తవానికి ప్రాధాన్యతనిస్తాను" అన్నాడు శశాంక.

"నువ్వు బుద్ధిమంతుడివి నాయనా! చాలా సంతోషం. ఎటొచ్చీ జరిగినదానికి ప్రచారం జరక్కుండా చూడు. ఇంకెప్పుడూ నీ మిత్రుడు ఇలాంటి సాహసానికి పూనుకోకుండా చూడు"

"తాతగారూ! నా మిత్రుడు సాహసం చేశాడుకానీ తప్పు చెయ్యలేదుకదా. ఈ కథకు ప్రచారం లభిస్తేమాత్రం మీకు నష్టమేమిటి? " అన్నాడు శశాంక.

"అక్కడేం జరిగిందో నువ్వు నమ్ముతావు. నేను నమ్ముతాను, కానీ లోకం నమ్మదు కదా"

"లోకం దెయ్యంలాంటిది. మనం భయపడితే భయపెడుతుంది. లేకుంటే దానికి ఉనికేలేదు" అన్నాడు శశాంక.

"సామెతలు, ఉపమానాలు చెప్పడం చాలా తేలిక. మీరు జరిగినదంతా రహస్యంగా ఉంచండి. లేకుంటే శకుంతలకు పెళ్ళికాదు"

శశాంక దిమ్మెరపోయినట్లుగా, "ఇంతకూ మీరు భయపడుతున్నది ఆ అమ్మాయి పెళ్ళిగురించా! మీ ఇంటిబయట ఆమెకెంత మంచిపేరుందో తెలుసా? ఆమె అంటే ఇష్టపడే ప్రతి అబ్బాయీ ముందు పెళ్ళి పేరెత్తి తర్వాతనే ప్రేమ అంటాడు. మీ ఇంటి సంప్రదాయం చూసి భయపడిపోతున్నారు కానీ ఆమెను పెళ్ళి చేసుకోవాలని ఎందరో అనుకుంటున్నారు. వాళ్ళలో నేనూ ఉన్నానంటే మీరు నమ్ముతారా? " అన్నాడు శశాంక చటుక్కున.

తాతయ్య నవ్వి, "నీ మిత్రుడి సచ్ఛీలత గురించి నమ్మించడానికి నువ్వు చాలా ఓవరాక్షన్ చేస్తున్నావు. ఎన్నో గొప్పపనులు చేస్తున్న నీవు ఆ గొప్ప మనసుతోనే మా శకుంతలనూ రక్షించావు. ఆ గొప్పమనసు





తోనే జరిగిందీ మనసులో పెట్టుకో లేకుంటే కుదిరిన పెళ్ళి ఆగిపోతుంది. అన్నట్లు నీకు చెప్పలేదుకదూ! మా శకుంత లకు ఫస్టుక్లాసు సంబంధం కుదిరింది. అబ్బాయి ఫోటోని చూసి ఓకే చేసేశాడు. ఇక ముహూర్తాలు పెట్టుకోవాలి అంతే" అన్నాడు.

ఈ మాట వినగానే శశాంక ముఖం అదోలా అయిపోయింది. చటుక్కున "అరే రాజూ! వచ్చిన పని మర్చిపోయాం. ఇప్పుడు నువ్వు క్షమాపణలు చెప్పుకోవాలి" అన్నాడు.

"అయిందేదో అయిపోయింది. ఇంక క్షమాపణలెందుకులే" అన్నాడు తాతయ్య.

"తాతగారూ మనిషికి చేసిన తప్పులకంటే చెప్పిన క్షమాపణలే ఎక్కువ గుర్తుంటాయి. ఇదేదో ఇంగ్లీషు వాళ్ళ సారీకాదు. అచ్చమైన భారతీయ సంప్రదాయం" అన్నాడు శశాంక.

రాజు వెంటనే తాతయ్యకు నమస్కరించి పాదాభివందనం చేశాడు. తనవల్ల తప్పు జరిగితే మన్నించమన్నాడు.

"ఇప్పుడు శకుంతలకు చెప్పాలి ఇదేవి ధంగా" అన్నాడు శశాంక.

రాజు తటపటాయించాడు. శశాంక నొక్కించాడు. తాతయ్య మొహమాటప డ్డాడు. చివరకు అక్కడే ఉన్న దర్పణి, "పక్కగదిలో రాజు శకుంతల పాదాలకు నమస్కరించి క్షమాపణ అడుగుతాడు. ఆ దృశ్యం నేను ఫొటో తీస్తాను. ఇంకెవరూ లోనికి రాకూడదు. సరా? " అంది.

శకుంతల వెంటనే పక్క గదిలోకి నడి చింది.

"అర్థమైందిగా ఆమె క్షమాపణ కోరు తోంది. వెళ్ళు" అన్నాడు శశాంక.

రాజు ముఖం అదోలా అయింది. అయినా అతడు గది గుమ్మానికి వేలాడు తున్న తెరను తొలగించి పక్క గదిలోకి వెళ్ళాడు. దర్పణి అతడిననుసరించింది.

చేయని తప్పుకు శిక్ష పడుతున్నందుకు రాజు మనసు బాగా గాయపడింది. అతడు ఉక్రోషంగా శకుంతలను సమీపించి పాదాభి వందనం చేయబోయి ఆగిపోయాడు.

ఆమె అతడికి రెండుచేతులూ జోడించి తన జీవిత విమానంలోకి ఆహ్వానిస్తున్న ఎయిర్‌హోస్టెస్‌లా ఉంది.

"శకుంతల నిన్ను ప్రేమిస్తోంది. ఆ విషయం చెప్పడానికి బిడియపడుతోంది. ఏం చేస్తావో, ఎలా చేస్తావో కానీ అటు నీ పెద్దలనూ, ఇటు ఆమె పెద్దలనూ ఒప్పించి మీ ఇద్దరికీ పెళ్ళి జరిగేలా చేయి. ఈ పెళ్ళి సమాజంకోసం మాత్రమే. లేకపోతే మీ ఇద్ద రికీ గాంధర్వ వివాహం జరిగిపోయిందని ఆమె భావిస్తోంది. నీకీ విషయాలన్నీ ఇలా చెప్పడమే ఈ క్షమాపణల రాయబారం వెనుక వున్న ఉద్దేశం" అంది దర్పణి.

దిగ్భ్రమ చెందిన రాజు నెమ్మదిగా తమా యించుకుని, "అయాం సారీ! నాకు వేరే పెళ్ళి ఎప్పుడో నిశ్చయమయింది. ముహూ ర్తాలు పెట్టుకోవడమే తరువాయి" అనేసి గదిలోంచి బైటకు వెళ్ళిపోయాడు.

★ ★ ★

శకుంతలకు పెళ్ళి కుదిరిపోయిందన్న వార్త అశనిపాతమే అయింది శశాంకకు. ఆమెను వివాహం చేసుకోకపోతే తన జీవి తమే వ్యర్థమన్నాడతడు. మొత్తం అతడి టీమంతా ఈ విషయమై సీరియస్‌గా చర్చలు జరిపింది. ఎలాంటి పరిస్థితుల్లో నైనా శకుంతలనూ, శశాంకనూ ఒకటి చేయగల ప్రజ్ఞ కాళిదాసుకు మాత్రమే ఉన్న దని భారవికి తెలుసు. అయితే శకుంతల మనసులో శశాంక పట్ల ప్రేమ ఉన్నదన్న నమ్మకం కుదిరితేనే అతడు శశాంకకు సాయపడతాడు. శకుంతల మనసు తెలు సుకుందుకు దర్పణి సాధనమని అందరూ అనుకున్నారు.

భారవి దర్పణిని కలుసుకుని పరిస్థితి వివరించి ఎలాగైనాసరే శశాంక ప్రేమ

ఫలించేలా చేయమని కోరాడు. దర్పణి మానసికంగా ఇరుకున పడింది. ఎందుకంటే ఏదోవిధంగా తన వివాహం రాజుతో జరిగేలా చేయమనీ లేకుంటే తన బతుకు వ్యర్థమనీ శకుంతల ఆమెకు చెప్పుకుంది. భంగుమత్తులో ఉండి ఉండకపోతే శకుంతల రాజు వంక ముఖమెత్తి చూసేదేకాదు, చూసినా ఆమెలో ప్రేమభావాలు అంకురించి ఉండేవీకావు. అందువల్ల శకుంతల ప్రేమపట్ల తన బాధ్యత ఉన్నదని దర్పణి భావించింది. అయితే మాత్రం తానేం చెయ్యగలదు? తనూ శకుంతల ఈడుదే అందులోనూ ఆఫ్టరాల్ ఆడపిల్ల...

శకుంతల రాజును ప్రేమించిందన్న విషయం దర్పణి భారవికి చెప్పలేదు. అయితే శకుంతల, శశాంక- ఇద్దరి సమస్యలకూ తక్షణంగా పరిష్కరించవలసిన సమస్య ఒకటుంది. ఆ సమస్యకు మానవ రూపమిస్తే అతడు రమేష్ అవుతాడు. రమేష్ పెద్దలు శకుంతలకు నిర్ణయించిన వరుడు.

"ముందు రమేష్‌ని రంగంనుంచి తప్పించాలి" అంది దర్పణి.

ఒక ఆడపిల్ల నోటివెంట అంత కటువైన మాటవొస్తుందని ఊహించలేకపోయిన భారవి "అమ్మో, మర్డరే! శశాంక ఒప్పుకోడు" అన్నాడు.

తన మాటలోంచి అంతటి విపరీతార్థాన్ని వెలికి తీయవచ్చునని ఊహించని దర్పణి, "మనం యుద్ధంచేసినా అది ప్రేమకోసమే కదా- ఇందులో మర్డర్లుండవు. ఎలాగో అలా రమేష్ సంబంధం తప్పించాలి. అందుకు మనకున్న వ్యవధి కూడా చాలా తక్కువ. ఏరోజునైనా వాళ్ళు ముహూర్తాలు పెట్టుకోవచ్చు" అంది.

"ఇకమీదట మా బృందం ఆ పనిమీదే ఉంటుంది. ఇక రమేష్ పని అయిపోయినట్లే" అన్నాడు భారవి ఉత్సాహంగా. వెళ్ళే ముందు అతడు, "నా మిత్రుడు కాళిదాసు ఎలాంటి సన్నివేశానికైనా కథను అందిస్తాడు. కానీ ప్రిన్సిపుల్స్‌కు కాంప్రమైజ్ కాడు. శకుంతల శశాంకను ప్రేమిస్తోందని నువ్వు చెప్పినట్లు నేనతడికి చెబుతాను. నువ్వు కాదనకూడదు" అన్నాడు.

"ఎవ్విరిథింగీజ్ ఫెయిర్ ఇన్ లవ్ అండ్ వార్" అంది దర్పణి.

"అయితే మీకు నేను ఉత్తినే సాయపడతాననుకోవద్దు" అంది దర్పణి.

"ఏం కావాలి? "

"రాజు... నేను అడిగినప్పుడల్లా రాజు మా ఇంటికి రావాలి. జస్ట్... ఏ కాల్ అంతే అయిదు నిముషాల్లో అతడు మా ఇంట్లో ఉండాలి"

"ఎందుకు? " అన్నాడు భారవి ఆశ్చర్యంగా.

"అది నువ్వు అడక్కూడదు"

"అది కాదు. ఓ ఆడపిల్ల ఇంటికి ఓ యువకుడు తరచుగా రావడం"

"ఇప్పుడు నువ్వు రాలేదూ? "

"నేను తరచుగా రాను"

"కానీ రాజు తరచుగానే రావాలి. అయినా నా తల్లిదండ్రులు నాకు స్వేచ్ఛనిచ్చారు. స్వేచ్ఛతోపాటు నమ్మకాన్నీ నామీద ఉంచారు. నమ్మకం స్వేచ్ఛకు బాధ్యతనిస్తుంది. అపనమ్మకం బానిసత్వాన్ని కూడా తప్పుదారులు పట్టిస్తుంది. అయినా ఇవన్నీ ఎందుకు... ఎవ్విరిథింగీజ్ ఫెయిర్ ఇన్ లవ్ అండ్ వార్ అని ఇప్పుడేగా మనమనుకున్నాం. అయ్ ఎస్యూర్ యు దట్ అయామ్ నాట్‌గోయింగ్ టు బి అన్‌ఫెయిర్"

భారవి మనసులో నవ్వుకుని, "ఈ అమ్మాయి రాజును ప్రేమిస్తున్నట్లుంది" అనుకున్నాడు.

★ ★ ★

రాజు దర్పణి ఇంటికి వచ్చాడు. వచ్చాక కాసేపు మాటలకు బిడియపడ్డాడు.

దర్పణి చురుకైన, చొరవైన మంచి




అమ్మాయి. ఆమెతో మాట్లాడుతుంటే తొంద రగానే అతడిలో బిడియం పోయింది. అత డామెకు తన ఇంటి పరిస్థితి చెప్పుకున్నాడు. శశాంకతో డీల్ చెప్పలేదు.

"అంటే నిజంగానే నీకు పెళ్ళి కుదిరిపో యింది" అంది దర్పణి.

"అవును"

"కానీ అది ఇష్టంలేని పెళ్ళి"

"అయినా తప్పదుగా"

"తప్పడానికి ప్రయత్నం కావాలి"

"నేనేం చేయగలను? "

"ముందు ఏదో చెయ్యగలనని నిన్ను నువ్వు నమ్మించుకోగలగాలి"

"వేదాంతం వినడానికి బాగుంటుంది. ఆచరణకు అసాధ్యం"

ఇద్దరూ కాసేపు పరిస్థితులు చర్చించారు.

"నీకు నీ మరదలితో పెళ్ళి తప్పించడం శశాంకవల్ల అవుతుంది. కాదంటావా? "

"కాదని ఎలాగంటాను? అలాగని వాగ్దానం చేసి అతడు నన్ను తన బృందంలో చేర్చుకున్నాడు"

"మరి నీకు పెళ్ళి కుదిరిపోయిందని అబద్ధం చెప్పావేం? "

"ఇంకా శశాంక మామయ్య బాకీ తీర్చ లేదు. అది తీరేదాకా నేను చెప్పింది అబ ద్ధంకాదు"

"నీకు నేను వాగ్దానం చేస్తున్నాను. నీ బాకీ తీరడం ఖాయం. మరి నువ్వు శకుం తలను ప్రేమిస్తావా? " అంది దర్పణి.

"ఆ అమ్మాయిని నేను ప్రేమించడమే మిటి. శశాంక ప్రేమిస్తుంటే"

"ఆమె శశాంకను ప్రేమించడంలేదు"

"శశాంక జీవితధ్యేయమే ఆమెను పెళ్ళాడ్డం. అతడు నన్ను చేరదీసిందీ అందుకే. ఆమె అతణ్ణి ప్రేమించకపోతే నా బాకీ తీరదు"

"పోనీ నీ బాకీ నేను తీరుస్తాను. నువ్వు శకుంతలను ప్రేమిస్తావా? "

"ఇది బాగుంది. ప్రేమ నాలో పుట్టాలి కానీ ప్రేమించమని బలవంత పెడితే ఎలా? " విసుగ్గా అన్నాడు రాజు.

"బలవంతపెట్టను. నువ్వెంతో ఇష్టపడే మీ అమ్మమీద ఒట్టేసి చెప్పు. నువ్వు శకుం తలని ప్రేమించడంలేదూ? " సూటిగా అడి గింది దర్పణి.

రాజు తడబడ్డాడు. తల్లిమీద ఒట్టు ప్రసక్తి లేకపోతే అతడు ఏమాత్రమూ ఆలోచించ కుండా తల అడ్డంగా ఊపి వుండేవాడు. ఒట్టనగానే ఆలోచనలో పడ్డాడు.

శకుంతల చాలా చాలా అందమైన అమ్మాయి. ఆమె ప్రవర్తన హుందాగా వుంటుంది. మాటలు తీయగా వుంటాయి. చూడగానే ఏ దేవతో భూమ్మీద విహారాని కొచ్చిందనిపిస్తుంది. చూడగానే బాగుందని పిస్తుంది. ఆమె ప్రేమించానంటే అంత అదృష్టమా అనిపిస్తుంది. ఆ అదృష్టం తనని వరించింది. ఆమెపట్ల ప్రేమలేదని ఎలా అనగలడు?

"అదంతా నన్ను అడగొద్దు. ప్రస్తుతానికి నా ధ్యేయం ప్రేమ కాదు"

"ఇప్పుడు చేసుకో" అంది దర్పణి.

"లక్ష్యాలేర్పరచుకునేముందు వాస్తవం గ్రహించాలి. ఎంత పట్టుదల వున్నా కుంటి వాడు నూరు మీటర్ల పరుగుపందెంలో ఒలింపిక్ పతకాన్ని సాధించలేడు. నాకు శకుంతల ఒలింపిక్ గోల్డ్‌మెడల్ నాది కుంటి బ్రతుకు" అన్నాడు రాజు.

"అంటే నువ్వు శకుంతలని ప్రేమిస్తు న్నావు. ఆ ప్రేమని ఆదిలోనే తుంచేయకు. కొనసాగించు. ఆ ప్రేమ నీకు నీలోని కొత్త వ్యక్తిత్వాన్ని పరిచయం చేస్తుంది"

"కానీ కుంటివాడు ఒలింపిక్ గోల్డ్..."

"నువ్వు కుంటివాడివి కాదు. కుంటివాడి నని అనుకుంటున్నావు"

రాజు దర్పణివంక ఆశ్చర్యంగా చూసి "నాకంటే చిన్నదానివి. నీకు ప్రేమ గురించి ఇన్ని విషయాలెలా తెలిశాయి? " అన్నాడు.

"నేను ఎక్కువగా టీవీ చూడను. పుస్త



కాలు చదువుతాను. ముఖ్యంగా గొప్పవారి అనుభవాల విశేషాలు వెతికి వెతికి చదువుతాను. వాటిలో జీవనసారముంటుంది. వాటిద్వారా జీవనధ్యేయం ఏర్పడుతుంది. నేను చెబుతున్నాను. నువ్వు శకుంతల ప్రేమని కాదనకు. ఆమె ప్రేమకి నీ ప్రేమ జతపడితే ఆ ప్రేమబలం మీ ప్రేమ ఫలించడానికి దోహదం చేస్తుంది"

"కానీ శశాంక ఆమెని ప్రేమిస్తున్నాడు. ఆమె కూడా అతణ్ణి ప్రేమిస్తే ఆ ప్రేమబలం వారి ప్రేమని ఫలింపజేస్తుంది కదా"

"నువ్వు మళ్లీ మొదటికొచ్చావు. శకుంతల శశాంకని ప్రేమించడంలేదు"

"నాకు చెప్పినట్లే ఆమెకీ చెప్పొచ్చుగా, శశాంకని ప్రేమించమని"

"చెప్పేదాన్నే. కానీ ఆమె ప్రియవ్రత"

"ప్రియవ్రతా? అదేమిటి?"

"మన కథలన్నీ ప్రేమించిన అమ్మాయి వేరొకర్ని పెళ్లి చేసుకోవడం గురించి వుంటాయి. అవన్నీ పతివ్రతల కథలు. శకుంతల ప్రియవ్రత. ఆమెకి ఒక్కడే ప్రియుడు. అతణ్ణే ఆమె పెళ్లి చేసుకుంటుంది. వేరే పెళ్లి చేసుకోవాల్సివస్తే జీవితాన్నే అంతం చేసుకుంటుంది"

రాజు తెల్లబోయాడు.

"శకుంతల మనసు తెలుసుకో. ఆమె ప్రేమని గౌరవించు. ఆమెని అర్థం చేసుకుందుకు రోజూ నువ్వు మా ఇంటికి రావచ్చు ఆమె కూడా ఇక్కడికి వస్తుంది. ఆ తర్వాత అన్నింటికీ దేవుడిమీద భారం వేద్దాం. నిజమైన ప్రేమకి పరాజయం వుండదనే నా నమ్మకం" అంది దర్పణి.

దర్పణి ఇచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకోవాలా వద్దా అని ఆలోచిస్తూంటే రాజు ఓ విషయం గ్రహించాడు. తనలో అంతర్గతంగా శకుంతలపట్ల ప్రేమ పుట్టి వుంది. ఆ ప్రేమ ఇప్పుడు తుఫానుగా మారి గుండెని కుదిపేస్తోంది.

"శకుంతలా! ఐ లవ్ యూ!" అన్న మాటలు ఆ తుఫాను హోరులోంచి పుట్టి ప్రతిధ్వనిస్తున్నాయి. అవి అతడి పెదాలని దాటి కూడా బైటకి వచ్చాయేమో. దర్పణి కళ్లలో తృప్తి మెరిసింది.

★ ★ ★

శకుంతల కుటుంబసభ్యులని దర్పణి బాగా ఇంప్రెస్ చేసింది. ఆమె తల్లిదండ్రులు పేరున్న డాక్టర్లు. రోజంతా నర్సింగ్ హోంలోనే గడుపుతారు. శకుంతలకి అయిన వాళ్లెవరైనా ముందు అపాయింట్‌మెంట్ లేకుండా నర్సింగ్‌హోంకి వెళ్లవచ్చునని దర్పణి చెప్పింది. మాటిమాటికీ ఆ కుటుంబ సంప్రదాయాన్ని పొగుడుతూ రమేష్ రూపురేఖల్ని పొగుడుతూండేది. శకుంతల అదృష్టం ఆమె పెద్దలేనని తన భవిష్యత్తుకు కూడా వారే పెద్దలనీ అంటూండేదామె. ఆమెతో శకుంతలని పంపడానికి వారికే అభ్యంతరమూ వుండేది కాదు.

రాజు దర్పణి ఇంటికి వచ్చి శకుంతలని కలుసుకుంటున్నాడు. ఇద్దరూ ఎన్నో విషయాలు మాట్లాడుకునేవారు. ప్రపంచ రాజకీయాలు, చలనచిత్రాలు, ఆటపాటలు, సాహిత్యం ఇలా ఎన్నో విశేషాలు వారి మధ్య దొర్లుతూ వుండేవి. ఏం మాట్లాడినా పరస్పరం ఆకర్షణ, ఆరాధనాభావం తొంగి చూసేవి. ఆ కారణంగానేమో వాళ్లకి మళ్లీ మళ్లీ కలుసుకుని మాట్లాడాలనిపించేది.

అలా నాలుగురోజులు గడిచేక శకుంతల అతడితో "మనం ఒకరికోసం ఒకరం ఏమైనా చేయాలి" అంది.

"అదే నేనూ అనుకుంటున్నాను. రేపు నేను నీమీద పాట రాసి తెస్తాను" అన్నాడు రాజు.

"రేపటికి నేను నీ బొమ్మ వేస్తాను" అంది శకుంతల.

రాజుకి సాహిత్యంలోనూ, శకుంతలకి చిత్రలేఖనంలోనూ అంతో ఇంతో ప్రవేశముంది. ప్రేమబలంతో తమ లలితకళలకి





సానబెట్టాలని ఇద్దరూ అనుకున్నారు.

ఒక రాత్రంతా కష్టపడి రాజు పాట రాశాడు. పాట రాస్తూంటే అప్రయత్నంగా ట్యూను కూడా అతడినోట పలికింది. అతడు తన భావాలని కాగితంమీద పెట్టాడు.

★ ★ ★

ప్రస్తుతం రాజు భారవి, కాళిదాసులతో కలిసి వుంటున్నాడు. వాళ్లు మంచి స్నేహితులయ్యారు. ముగ్గురూ కలిసి భావి జీవితం గురించి ఎన్నో పథకాలు వేసుకుంటున్నారు. అయితే ముగ్గురివీ విభిన్న దృక్పథాలు.

భారవి వాస్తవాన్ని నమ్ముకున్నాడు. వచ్చిన ప్రతి అవకాశాన్ని ఉపయోగించుకోవాలనీ మనం చెడు చేయకుండా ఇతరులకి చెడులో సహకరించినా తప్పులేదనీ అనుకుంటాడు.

కాళిదాసు భావుకుడు. మంచిని నమ్మాలనీ మంచికి మాత్రమే సహకరించాలనీ అంటాడు. రాజు అటు వాస్తవానికీ, ఇటు భావుకతకీ మధ్య వేలాడుతుంటాడు.

ఆ రాత్రి రాజు ఏదో ట్యూన్ హమ్‌చేస్తూ రాసుకోవడం మిగతా ఇద్దరూ గమనించారు. మర్నాడు నిద్రలేస్తూనే ఇద్దరూ రాజుని చుట్టుముట్టారు. శకుంతల సంగతి చెప్పకుండా రాజు వారికి తన పాటని వినిపించాడు.

రాజు పాట పూర్తి కాగానే అప్రయత్నంగా శ్రోతలిద్దరూ చప్పట్లు కొట్టారు.

"రాజూ! ఇది కవిత్వంకాదు. ప్రేమ ప్రవాహం. సామాన్యులకిది సాధ్యం కాదు. నిస్సందేహంగా నీలో గొప్ప ప్రేమికుడున్నాడు" అన్నాడు కాళిదాసు.

"ఈ పాట ఓ గొప్ప ప్రేమికుడి నుంచి రావాల్సిన మాట నిజం. శశాంకకు సూచిస్తాను. శకుంతల ముందు పాడతాడేమో" అన్నాడు భారవి.

"అదెలా సాధ్యం? " అన్నాడు కాళిదాసు.

"ఏమో- నేనెలా చెప్పను? సన్నివేశం కల్పించాల్సింది నువ్వు!" అన్నాడు భారవి.

★ ★ ★

శశాంకకు భారవి అయిడియా నచ్చింది. శకుంతలతో పాట సన్నివేశం నిర్ణయించబడింది. అందుకని కాళిదాసు మెదడుకు పదును పెట్టాడు.

"నీ పుట్టిన రోజెప్పుడు? " కాసేపాలోచించేక అడిగాడు కాళిదాసు శశాంకను.

"ఇంకా నాలుగు నెలలుంది"

"అన్నాళ్లాగడం మంచిది కాదు. రేపే నీ పుట్టినరోజు"

"ఎందుకు? "

"నీ పుట్టినరోజు వేడుకకు ప్రత్యేకంగా కొందరినే ఆహ్వానిస్తావు. వారిలో శకుంతల కుటుంబం ఉంటుంది. ఆ సందర్భంగా నువ్వు పాట వినిపిస్తావు నీ ప్రేయసిని ఉద్దేశించి!"

"ప్రేయసి అంటే శకుంతల..." అన్నాడు శశాంక.

"అది నీ మనసుకు తెలుసు. కానీ ఆహ్వానితులకు తెలియదు. వారిలో శకుంతలతో పాటు దర్పణి, ఆమె స్నేహితురాండ్రు ఉంటారు. నువ్వు ఎవరినుద్దేశించి పాడిందో ఎవరికీ తెలియదు. అంతా ఒకరి వంక ఒకరు అనుమానంగా చూసుకుంటారు..."

"అంతా బాగానే వుంది. కానీ రేపు నా పుట్టినరోజు కాదు. అదే పుట్టినరోజందామన్నా దాన్నెందుకు సెలబ్రేట్ చేసుకోవాల్సొచ్చిందో చెప్పుకోవాలికదా" అనుమానంగా అన్నాడు శశాంక.

"చెప్పుకుంటావు" అన్నాడు కాళిదాసు నమ్మకంగా.

★ ★ ★

అది హోటల్ లవ్ ఎన్ లవ్‌లో ఓ చిన్న హాలు. హాల్లో చిన్న వేదిక. వేదిక మీద వాద్యబృందం. హాల్లో సుమారు ఇరవైమంది ప్రేక్షకులు. వారికి ముందుగా వేది



కకి కాస్త పక్కగా నిలబడి వున్నారు శశాంక బృందం. ఆరోజు ఆ బృందంలో వీడియో కెమేరాలు పట్టినవారు ముగ్గురున్నారు.

"యాక్షన్" అన్నాడు దర్శకుడు.

శశాంక వేదికమీదికెళ్లి మైక్రోఫోన్ అందుకున్నాడు.

ఒక్కసారిగా వాద్యసంగీతం హెచ్చుస్థాయిలో ప్రారంభమై క్రమంగా సన్నబడింది.

"ఆప్తులందరికీ నమస్కారం. ఈరోజు నేను ఎప్పటి శశాంకలాకాక పసిపాపాయిలా మీముందు నిలబడ్డాను. అవును, మీరు నమ్మినా, నమ్మకున్నా నేను పసిపాపాయినే. సరిగ్గా ఏడాదిక్రితం నాలో ప్రేమ పుట్టి నన్ను పసిపాపాయిని చేసింది. ఆ పసిపాపాయి వయసు ఈరోజుకి సరిగ్గా ఏడాది"

మళ్లీ వాద్యసంగీతం హెచ్చుస్థాయిలో మోగి క్రమంగా సన్నబడింది.

"నా ప్రేమ నా చేత మంచిపనులు చేయిస్తోంది. కనుకనే నేను నా ప్రేమని ప్రేమిస్తున్నాను. ప్రతిఒక్కరూ నాలా ప్రేమించాలని కోరుకుంటున్నాను. అయితే అన్నింటికీ మించిన మరో బాధ్యత నాపైన వుంది. నా ప్రియురాలికి నేనందించే అభినందనగీతం అందరూ వినాలి. ఆమె గొప్పతనాన్ని అందరూ తెలుసుకోవాలి. ఎందుకంటే నాకంటూ ఘనత వుంటే అది నా ప్రియురాలిది. లెటజ్ సే త్రీ చీర్స్ టు హర్"

మళ్లీ వాద్యసంగీతం హెచ్చుస్థాయిలో ఆరంభమై క్రమంగా సన్నబడింది.

"నేను సామాన్యుణ్ణి. కానీ నా ప్రియురాలు నన్ను హీరోని చేసింది. అందుకే ఇప్పుడు నేను మీకు వినిపించబోయే పాట నేను రాసిందికాదు. నా కోసం ఓ కవి రాసి పెట్టాడు. పాడేదీ నేను కాదు. నేపథ్యంలో నా వెనుక ఓ గాయకుడు పాడతాడు. నా పెదవుల కదలికలో నా ప్రేమానుభూతుల్ని వినండి. నా కనుచూపుల్లో నా ప్రేమభావాల్ని చదవండి. నా ప్రేమ ఫలించాలని మనస్ఫూర్తిగా దీవించండి. మీలో పెద్దలున్నారు. నాకంటే పిన్నలున్నారు. నా ప్రేమ ఏడాది పసిపాపాయే కాబట్టి దాన్ని దీవించడానికి మీ వయసు అడ్డురాదు. ఇక నేను నా ప్రియురాలి అభినందన ఆరంభిస్తాను"

అతడు గొంతు సవరించుకున్నాడు.

వాద్యసంగీతం సన్నగా ప్రారంభమై హెచ్చుస్థాయిని చేరి ఒక్కసారి ఆగింది.

"నా హృదయ మందిరమందు వెలసిన సుందరీ ఓ సుందరీ"

వేదికపై తెరవెనుక గాయకుడు పాట ప్రారంభించాడు. శశాంక పెదవులు కదులుతున్నాయి. ప్రేక్షకులు మంత్రముగ్ధులై వింటున్నారు. వారిలో శకుంతల మంత్రముగ్ధురాలై వేదికపక్కనే వున్న రాజుని చూస్తోంది. రాజు కూడా ఆమెని చూస్తున్నాడు.

శకుంతలకి ఆ పాట కొత్తకాదు. ముందురోజు సాయంత్రం ఆమె ఆ పాటని రాజు నోట విన్నది. అప్పుడు వాద్యసంగీతం లేదు. లయజ్ఞానం తెలిసిన గొంతులేదు. అయినా మంత్రముగ్ధురాలై అతడి పాటని విన్నదామె. పాట విని తను వేసిన చిత్రాన్ని అతడికి చూపింది. ఆ బొమ్మలో రంగుల్లేవు. రాజు రూపానికి రేఖాచిత్రమది.

"నేనింత బాగుంటానని నాకు తెలీదు" అన్నాడు రాజు.

"అద్దంలో చూసుకో. నా బొమ్మకంటే చాలా బాగుంటావు" అంది శకుంతల.

"చూసుకున్నాను. అందుకే చెబుతున్నాను. దేవుడు చేసిన ఈ బొమ్మకంటే...' ' అని తనని తాను చూపించుకుని "దేవత వేసిన ఈ బొమ్మ ఎక్కువ బాగుంది" అంటూ ఆమె బొమ్మని చూపాడు రాజు.

ఆ మాటలప్పుడు శకుంతలని నిలువెల్లా పరవశింపజేశాయి. "అందుకో వందనం" శశాంక పెదాలు కదుపుతున్నాడు. అతడి ఆలోచనలన్నీ శకుంతలచుట్టూ తిరుగుతు

న్నాయి. ఈ పాట తన కోసమేనని ఆమెకి తెలియాలనుందతడికి. అయితే ఆ పాట నిజంగా శకుంతలకోసమే రాయబడిందని అతడికి తెలీదు.

ఓ కెమేరా ప్రత్యేకంగా శశాంకమీద, మరొకటి శకుంతలమీద కేంద్రీకృతమ య్యాయి. మూడో కెమేరా మొత్తం హాలుని వివిధకోణాల్లో దర్శిస్తోంది.

పాట ఐపోయింది. హాలు చప్పట్లతో దద్దరిల్లిపోయింది.

"వచ్చే ఏడాదికి నా పాటలోని ప్రియు రాలు నా పక్కన వుంటుంది. అదీ నా లక్ష్యం... ఇప్పుడు మీ అందరికీ ఓ చిన్న మనవి. నా పాట తమలో కలిగించిన స్పందనలను మీలో ఎవరైనా ముందుకు వచ్చి చెప్పాలి" అన్నాడు శశాంక.

శకుంతల వస్తే బాగుండునని శశాంక ఆశించాడు కానీ దర్పణి ముందుకొచ్చి "నిజ జీవితంలోనూ ప్రేమ పాటలుంటాయని ఈరోజే తెలిసింది. ఈ అనుభూతి మనంద రికీ గొప్పది. అందుకున్న ప్రియురాలికి ఇంకా గొప్పది. ఆ అదృష్టవంతురాలెవరో కానీ ఆమెకిదే నా వందనం" అంది.

అందరూ చప్పట్లు కొట్టారు.

తర్వాత భారవి ముందుకొచ్చి "ప్రేమపే రిట యుద్ధాలు చేసిన వారున్నారు. హత్య లకి వెనుకాడనివారున్నారు. కానీ శశాంక ఎన్నుకున్న పద్ధతి కొత్తది. తన ప్రేయసి కోసం అతడెన్నో మంచిపనులు చేస్తు న్నాడు. ప్రేమ పరమార్థమే ఇది. మంచిని చేయాలి, చేయించాలి. యువతీయువకులీ విషయంలో శశాంకని ఆదర్శంగా తీసుకో వాలి" అన్నాడు.

'థాంక్స్ భారవీ!' అనుకున్నాడు శశాంక మనసులో. ప్రేయసిముందు తన ఔన్న త్యాన్ని ప్రస్తావించినందుకు భారవికేమైనా కానుక ఇవ్వాలని కూడా అతడికనిపించింది.

అంతలో శకుంతల తాతయ్య వేదికమీది కొచ్చి "ఈరోజు శశాంకలో ప్రేమ పుట్టినరో జని మనమిక్కడ చేరామని మీరంతా అను కుంటున్నారు. కానీ నా మనవరాలు శకుం తలకి జీవితం పండే రోజుని జరుపుకుంటు న్నామని నాకు అన్పిస్తోంది. మా శకుంతల పెళ్లికి ముహూర్తం నిర్ణయించబడిన ఈరోజే ఈ వేడుకలు జరగడం నాకెంతో సంతోషంగా వుంది" అన్నాడు.



"తాతయ్య బాంబు పేల్చాడు" అన్నాడు భారవి.

"ఇది ఇరవయ్యో ఒకటో శతాబ్దం. టెర్ర రిస్టులని ఏరిపారేయాల్సిన యుగం. మనం మన ఆయుధాలన్నింటినీ కూడగట్టుకుని తాతయ్యమీద దాడిచేయాలి" అన్నాడు శశాంక.

"అందుకు ముందుగా మన ఆయుధాలే మిటో తెలుసుకోవాలికదా. అవడానికి ఉగ్ర వాదమే అయినా మనం చేస్తున్నది ప్రేమ యుద్ధం" అన్నాడు కాళిదాసు ఆయుధాలని నిర్వచిస్తూ.

అప్పుడు ఆయుధాల గురించిన చర్చ ప్రారంభమైంది. అందరూ తాతయ్య గురించి మాట్లాడుతుంటే కాసేపు మౌనంగా విని "మనం అట్నుంచి నరుక్కురావాలని

మీకెవరికీ తోచినట్లులేదు. అట్నించంటే రమేష్‌వైపునించి" అన్నాడు భారవి.

"అదెలా? " అన్నాడు శశాంక.

"శకుంతల శీలంమీద బురద చల్లుతూ ఓ ఉత్తరం..." అన్నాడు భారవి.

"నిప్పు లేందే పొగరాదన్న సామెత ఆడదాని దగ్గరికి వచ్చేసరికి ఎక్కడలేని విలువనూ పెంచుకుంటుంది. అపవాదు తనే పుట్టించానని మర్చిపోయి శశాంక కూడా ఆమె శీలాన్ని శంకించవచ్చు. మన ఉద్దేశం మంచిదైనాసరే శకుంతలకి మచ్చని ఆపాదించడం నాకు నచ్చలేదు" అన్నాడు కాళిదాసు.

"నాకూ నచ్చలేదు. నీ మెదడుకి పదును పెట్టాలంటే ఇలాంటి చచ్చు ఐడియాల నాపరాళ్లు కావాలి. తొందరగా ఏదైనా చెప్పు. మనకెంతో టైములేదు" అన్నాడు భారవి.

"ఇది ఇరవయ్యొకటో శతాబ్దమని శశాంక అన్నాడు. పెంటియం త్రీ సెన్సేషన్ అనుకునేలోగా పెంటియం ఫోర్ మార్కెట్లో దుమారం రేపుతున్న ప్రగతి మనది. ఈ ప్రగతిని కొందరు తీవ్రవాదులు ప్రళయానికి ఉపయోగిస్తున్నారు. కొందరు ఛాందసులు ప్రణయంలో ప్రళయానికి ఉపయోగిస్తున్నారు. అందుకే కంప్యూటరు సాధిస్తున్న అభివృద్ధి జాతకచక్రాలకి వృథా అవుతోంది. అయితే అవనీ కానీ ప్రస్తుతం అదే మన ఆయుధం. శకుంతలకీ, రమేష్‌కీ పొసగదని జాతకరీత్యా మనం రుజువులు సంపాదించాలి. అందుకు పునాదిగా కొన్ని సంఘటనలు సృష్టించాలి. అంటే ఇలా ముహూర్త నిర్ణయం జరగ్గానే రమేష్‌కి అలా కీడుమీద కీడు జరగాలి. రమేష్ పెద్దలు అందుకు కారణమేమిటీ అని మథనపడి తమ దృష్టిని జాతకంమీదకి మళ్లించాలి. అంతే సంబంధం ఫట్" అన్నాడు కాళిదాసు.

"ఐడియా చాలా బాగుంది. అంటే మనమిప్పుడు రమేష్‌కి కీడు చేయాలి" అన్నాడు దర్శకుడు.

"కీడు చేయం. కీడు జరిగిన భ్రమని కలిగిస్తాం. అయితే మనలో ఎవరైనా ముందుగావెళ్లి రమేష్ పెద్దలతో మాట్లాడి వాళ్ల మనోభావాలనీ, బలహీనతలనీ తెలుసుకోవాలి. దాన్నిబట్టి మన పథకం వుంటుంది" అన్నాడు కాళిదాసు.

భారవి, దర్శకుడు రమేష్ ఊరు వెళ్లడానికి ఎన్నికయ్యారు.

★ ★ ★

"ఇల్లు చాలా బాగుందే" అన్నాడు దర్శకుడు. భారవి కూడా అందుకు తలూపుతూ సాలోచనగా "ఇంత సొఫిస్టికేషన్ వుంటే మరీ ఆధునికులై వుండాలి. కాకుంటే మహా ఛాందసులు కావాలి" అన్నాడు.

ఇంట్లో ఓ ముసలావిడ వుంది. ఆవిడ రమేష్‌కి దూరపు బంధువట. రమేష్ కోసం వచ్చారని తెలిసి "వాడికేమౌతారు బాబూ మీరు? " అందావిడ.

"స్నేహితులం. మాదీ ఊరుకాదు. మా ఊరి శకుంతలతో వాడికి పెళ్లి సంబంధం కుదిరిందని తెలిసింది. ఆ అమ్మాయి జాతకం మంచిది కాదు. ఇంతవరకూ ముహూర్తాలదాకా వచ్చి మూడు పెళ్లిళ్లు ఆగాయి. ఓ కుర్రాడికి తల్లి పోయింది. ఓ కుర్రాడికి కాలు విరిగింది. ఓ కుర్రాడికి ఉద్యోగం పోయింది. ఇక ముహూర్తాలదాకా రాని కేసులూ వున్నాయి. పెళ్లిచూపులకి వచ్చివెడితే చాలు, పెళ్లికొడుక్కు ఫ్లూయో, మలేరియానో వచ్చేది. మా ఊరి డాక్టర్లు ఆ అమ్మాయి పెళ్లిచూపులెప్పుడా అని ఎదురు చూస్తుంటారు"

భారవి పూర్తిచేయగానే "అదే మా ఇంట్లోనూ అనుకుంటున్నారు బాబూ! ఇలా ముహూర్తాలు పెట్టించారు. అలా మావాడు యాక్సిడెంటుకు గురై చావుదెబ్బలతో ఆస్పత్రిపాలయ్యాడు. ఇప్పుడు ఇంటిల్లపాదీ ఆస్పత్రిలోనే వున్నారు" అందావిడ.

భారవి, దర్శకుడు ఆశ్చర్యంతో నోరు తెరి





చారు.

"అప్పుడే ఎలా జరిగిందిది? ఇంకాస్త టైము పట్టాలే" అన్నాడు దర్శకుడు.

"ముందు కేసుల్లో టైం పట్టిందేమో జాత కచక్రంలో చెడు వుందంటే అది రోజురో జుకీ విజృంభిస్తుంది" అంది ముసలావిడ.

"అయ్యో, మేమింకాస్త ముందొస్తే బాగుం డేది. కనీసం ముహూర్తాలు పెట్టకుండా ఆపేవాళ్లం" అన్నాడు దర్శకుడు.

"అయితే మనమిప్పుడు నరేష్‌ని అర్జం టుగా కలవాలి" అన్నాడు భారవి.

"మావాడి పేరు రమేష్ బాబూ" అంది ముసలావిడ.

"ఇంకా మీవాణ్ణి కలిసి ఏంలాభం? మేం కలవాల్సింది నరేష్‌నే. ముహూర్తాలు పెట్టిం చగానే రమేష్‌కేదో కీడు జరుగుతుందని శకుంతల పెద్దలకి తెలుసు. అందుకని వాళ్లు నరేష్‌ని రిజర్వులో వుంచుకున్నారు. నరేష్‌తో ముహూర్తం కుదరగానే సురేష్‌ని రిజర్వులో పెడతారు. అమ్మో, వాళ్లదగ్గర చాలా పెద్ద జాబితాయే వుంది" అన్నాడు భారవి.

"పద, అర్జంటుగా వెళ్లి నరేష్‌ని కలుద్దాం. లేకుంటే రమేష్‌కి జరిగిన ప్రమాదమే వాడికీ జరుగుతుంది" అంటూ లేచాడు దర్శకుడు.

"పాపం, మీరిలా ఇంకా ఎన్నాళ్లు తిర గాలో" జాలిపడింది ముసలావిడ.

"లేదులెండి. నరేష్‌తోనే మా తిరుగుడు ఆఖరు" అన్నాడు భారవి.

"ఏం బాబూ, మరి సురేష్‌ని హెచ్చరిం చరా? "

"అబ్బే, సురేష్ మా ఫ్రెండు కాదు" అంటూ వెనక్కి తిరిగాడు భారవి.

"బాబూ, మావాడు ఆస్పత్రిలో ఒక్కడూ గిలగిల్లాడి పోతున్నాడు స్నేహితుల్లేక. ఒక్కసారి వెళ్ళి పలకరించండి" అంది ముస లావిడ.

భారవి, దర్శకుడు ఆవిడ దగ్గర ఆస్పత్రి వివరాలు తెలుసుకున్నారు.

★ ★ ★

"వెళ్లాలా ఆస్పత్రికి? " అన్నాడు దర్శకుడు.

"వెళ్లాలి. ఇంతదూరం వచ్చి స్వయంగా రమేష్‌ని చూడకుండా ఎలా వెడతాం? నిజంగానే అతడు ఆస్పత్రిపాలయ్యాడని మనం రూఢీ చేసుకోవాల్సివుంది. అతడికి ప్రమాదమెలా జరిగిందో తెలుసుకుంటే మనకూ మున్ముందు కొత్తకొత్త ఐడియాలకి పనికిరావచ్చు" అన్నాడు భారవి.

"శశాంకకి దైవం సానుకూలమవుతు న్నాడు. అతడి ప్రేమ తప్పక జయిస్తుంది. మన ప్రయత్నం లేకుండా రమేష్‌కి యాక్సి డెంటవడం నాకిప్పటికీ ఆశ్చర్యంగావుంది" అన్నాడు దర్శకుడు.

వాళ్లిద్దరూ ఆస్పత్రిలో రమేష్ వుంటోన్న రూం చేరుకునేసరికి ఓ మంచంమీద రూపు రేఖలు తెలియనంతగా కట్లతో వున్న ఓ వ్యక్తి కనిపించాడు. అతడి చుట్టూ చాలా మందే వున్నారు. అయితే వాళ్లెవరూ పేషెంటును పట్టించుకోకుండా అక్కడున్న ఓ ముగ్గుర్ని విపరీతంగా పొగిడేస్తున్నారు.

యాక్సిడెంటైన వెంటనే ఎవరూ పట్టించు కోకుండా రమేష్‌ని వదిలేసిపోతే ఈ ముగ్గురూ పోలీసుకేసుకు భయపడకుండా మానవత్వంతో అతడిని నర్సింగ్‌హోంలో చేర్చారు. సమయానికి వాళ్లు తీసుకురాక పోతే రమేష్ ప్రాణాలు దక్కివుండేవి కాదని అతణ్ణి ట్రీట్‌చేసిన డాక్టరన్నాడు.

"ప్రాణదాతలు... ప్రాణదాతలు..." అని రమేష్‌కి అయినవాళ్లు అంతా వాళ్లని పొగి డేస్తున్నారు

"దాహం, దాహం" అంటున్నాడు రమేష్.

భారవి అది గమనించి "మీరు ప్రాణదా తల్ని కాసేపు మర్చిపోయి పేషెంటును పట్టించుకోండి. దాహంతో చచ్చేలా వున్నాడు" అన్నాడు.

వెంటనే ఓ ముసలాయన "రమేష్‌కి ఓ గంటక్రితం ప్రాణగండం వుంది. ఆ క్షణం దాటితే మళ్లీ రెండేళ్లదాకా ఢోకాలేదు" అన్నాడు.

"దాహం, దాహం" అన్నాడు రమేష్.

రమేష్ తల్లి కాబోలు పక్కనున్న కూజాలోంచి గ్లాసులోకి నీళ్లు వంపింది. రమేష్ చెల్లి కాబోలు అతడి నోట్లో గరాటా వుంచింది. తల్లి నీళ్లు పోస్తూంటే రమేష్ గుటకలు మింగాడు.

"పొద్దున్నే స్వంత చేతుల్తో టిఫిను తిన్నాడు. ఉప్మా వేడిగా వున్నా స్పూను వద్దని చేత్తోనే చట్నీలో నంచుకుని తిన్నాడు. ఇప్పుడు మంచినీళ్లు ఇలా తాగాల్సివస్తోంది" కళ్లొత్తుకుంది తల్లి.

"అదీ మనం చూసుకోలేదు, వీళ్లు చెప్పారు కాబట్టి..." అంటూ సిగ్గుపడింది రమేష్ చెల్లి భారవిని సూచిస్తూ. అక్కడున్న అందరిలో కాస్త ఆకర్షణీయంగా వున్న యువకుడు భారవి మాత్రమే.

"అప్పుడు అందరి దృష్టీ భారవి, దర్శకుల మీద పడింది. భారవి కాస్త ఇబ్బందిపడుతూ "అంతా ఎలా జరిగింది? " అన్నాడు.

"ఓ ముదనష్టపు పిల్లతో పెళ్లి ముహూర్తం పెట్టారు. ఏంకావాలో అదే జరిగింది" అన్నాడు ముసలాయన.



బహుశా ఆయన రమేష్ తాతగారై వుంటాడు.

"ఇంతకీ మీరెవరు బాబూ? " అంది రమేష్ తల్లి.

"మేము రమేష్‌కి ప్రాణమిత్రులం" అన్నాడు భారవి.

ఆ మాట వింటూనే రమేష్ ప్రాణదాతలు "ప్రాణమిత్రులు వచ్చారుగా. మరి మేము సెలవు తీసుకుంటాం" అంటూ అక్కణ్ణించి తప్పుకున్నారు.

రమేష్ కూడా ఒకసారి తన ప్రాణమిత్రులతో ఏకాంతంగా మాట్లాడాలని మిగతావాళ్లకి చెప్పాడు. భారవి, దర్శకుడు ఇబ్బంది పడి తప్పించుకోవాలని చూశారు కానీ వీలు పడలేదు. అందరూ వెళ్లిపోయాక రమేష్ వాళ్లతో "మిమ్మల్నెప్పుడూ ఎక్కడా చూసిన గుర్తులేదు. అయినా మిమ్మల్ని ప్రాణస్నేహితులని నమ్ముతాను. నన్నీ నరకంనుంచి తొందరగా తప్పించండి" అన్నాడు.

"ఆస్పత్రి ఎవరికైనా నరకమే. కానీ చికిత్స జరక్కపోతే అది నీకింకా నరకం కదా" అన్నాడు దర్శకుడు ఓదార్చడానికి ప్రయత్నిస్తూ.

"నేను నిక్షేపంగా వున్నాను. నాకు చికిత్స ఎందుకూ? " అన్నాడు రమేష్.

ఈ మాటవిని భారవి, దర్శకుడు ఆశ్చర్యపోయారు. అయితే రమేష్ చెప్పిన విశేషం ఇంకా వింతగా అనిపించింది.

రమేష్ స్కూటరుమీద ఆఫీసుకి బయల్దేరాడు. ఒక సందులో ప్రాణదాతలు ముగ్గురూ అతణ్ణి ఆపి ఓ ఇంట్లోకి తీసుకెళ్లారు.

"నీకు యాక్సిడెంటయింది. ఆస్పత్రిలో చేరాలి" అన్నారు వాళ్లు.

"నిక్షేపంలా వున్నాను. నాకు యాక్సిడెంటేమిటి? " అన్నాడు రమేష్.

"పోనీ చేయమందామా? " అన్నారు వాళ్లు.

వాళ్ల మాటల్లో ధ్వనించిన కఠినత్వానికి రమేష్ బెదిరాడు.

వాళ్లతడి బట్టలు చింపారు. చేతులకీ, కాళ్లకీ, ముఖానికీ ఎర్రరంగు పూశారు. తలని చిందరవందర చేశారు. ఆస్పత్రికి తీసుకుని వెళ్లారు. డాక్టరు అతడికి ఎక్స్‌రేలు తీశాడు. వంట్లో అన్ని మూలలా ఎముకలు విరిగేయన్నాడు. చేతికి నొప్పిలేదంటే చేతికి, కాలికి నొప్పిలేదంటే కాలికి - అలా వళ్లంతా కట్లతో నింపాడు. అతడికూడా వచ్చినవారిని ప్రాణదాతలని పొగిడాడు.

"పేషెంటులా ఆస్పత్రిలో పడివుండు. లేదా నిజంగానే పేషెంటువైపోతావు" అని వాళ్లతణ్ణి బెదిరించారు. తర్వాత ఇంటికి కబురు వెళ్లింది. అంతా వచ్చి ప్రాణదాతలని పొగిడేస్తున్నారు.

రమేష్ కథ వినగానే భారవి, దర్శకుడు ముఖముఖాలు చూసుకున్నారు. శశాంక, కాళిదాసులే తాము వచ్చేలోగా ఇలాంటి పథకం అమలుచేసి వుంటారని వాళ్లకి అనిపించింది.

"నాకు సెలవులు చాలా తక్కువగా వున్నాయి. పెళ్లికోసం దాచుకున్నాను. ఏ రోగం లేకుండా ఇలా ఆస్పత్రిలో పడుకుని సెలవులు పాడుచేసుకోవడం నాకిష్టంలేదు" అన్నాడు రమేష్ దిగులుగా.

భారవికి అతడిమీద జాలేసింది. "ఒకవిధంగా నిన్ను కాపాడాలని వచ్చాం. ఇంకోవిధంగా నిన్ను కాపాడాల్సివస్తోంది" అన్నాడతను.

"నేనెవరో తెలియకుండా నన్ను కాపాడాలని ఎలా వచ్చారు? " అన్నాడు రమేష్ ఆశ్చర్యంగా.

"మా మిత్రుడు శకుంతల అనే అమ్మాయిని ప్రేమించాడు. కానీ ఆ శకుంతల జాతకం మంచిదికాదని తెలిసింది. ఆమెతో పెళ్లి ముహూర్తం కుదిరిన మొదటి అయిదుగురికీ ప్రాణగండాలేర్పడతాయని ఓ ప్రముఖ జ్యోతిష్కుడు చెప్పాడు. మా





మిత్రుడు జాతకాలు నమ్మడు కానీ ఇంతలోనే శకుంతల ఇంట్లో పెళ్లి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. మొదటి సంబంధం ముహూర్తాలదాకా రాగానే ఆ వరుడికి తల్లి పోయింది. విచారించగా చిన్నప్పుడే తండ్రి పోతే తల్లే ప్రాణమై ఆ కుర్రాణ్ణి పెంచిందని తెలిసింది. రెండో సంబంధం ముహూర్తాలదాకా రాగానే ఆ వరుడికి కాలు విరిగింది. ఆ కుర్రాడు మంచి స్పోర్ట్స్‌మన్. కాలే అతడి ప్రాణం. ఇక మూడో సంబంధంలో వరుడికి ఉద్యోగం పోయింది. వేరే ఏ ఆధారంలేక ఉద్యోగమే ప్రాణంగా బతుకుతున్నాడా కుర్రాడు. నీది నాలుగో కేసు. నిక్షేపంలా వుండికూడా ఆస్పత్రిపాలయ్యావు. మేమిద్దరం ముహూర్తం కుదిరేక ప్రతి కేసూ విచారించి వస్తూంటాం. కేసుకేసుకీ మాకు పెరిగిపోతోంది జాతకాల నమ్మకం. ఇంకొక్క కేసు పూర్తయితే మావాడు శకుంతలని పెళ్లిచేసుకోవచ్చు" అన్నాడు భారవి.

"ఆ శకుంతల చాలా అందంగా వుంది. నిజానికి నాకు ఏ ప్రాణగండమూ జరగలేదు. ఎవరో కుట్రపన్ని ఇలా చేశారు. నాకింకా ఆమెని పెళ్లి చేసుకోవాలనే వుంది" అన్నాడు రమేష్.

భారవి అతణ్ణి మెచ్చుకుని "మూఢనమ్మకాలు నిజంకాదని నిరూపించడానికి నీలాంటి యువకులే ప్రాణాలకి తెగించాలి. ప్రాణాలు పోయినా ఆ అమ్మాయినే చేసుకుంటానని పంతంపట్టు. ప్రాణాలుంటే ఆమెనే చేసుకో. నీ కథ ఏమయిందో ఇంకో రెండ్రోజులాగి వచ్చి మళ్లీ చూస్తాం" అన్నాడు.

"నాకిలా సలహా ఇచ్చావేమిటి? నేను పెళ్లి చేసుకుంటే నీ మిత్రుడు భగ్నప్రేమికుడు కాడా?" అన్నాడు రమేష్ ఆశ్చర్యంగా.

"నా మిత్రుడు భగ్నప్రేమికుడైతే ఎలాగో అలా ప్రయత్నించి వాణ్ణి మంచిదారిలో పెడతాం. కానీ చూస్తూ చూస్తూ ఈ అమ్మాయితో పెళ్లి జరుగనిచ్చి ప్రాణాలకే ముప్పు తేలేంకదా. ఇలాంటి అమ్మాయిలకి నీలాంటి వాళ్లని ప్రోత్సహించడంలోనే మా మిత్రుడి క్షేమంవుంది. ఇక డాక్టరుతో మాట్లాడతాను. ఒకటి రెండురోజుల్లో నువ్విక్కణ్ణించి బయటపడేలా చూడమంటాను" అన్నాడు భారవి.

"అదెలా సాధ్యం?" అన్నాడు దర్శకుడు.

"మిరకిల్ డ్రగ్స్‌తో ప్రయోగం చేశాననీ, ఎవరికైనా లీక్‌చేస్తే మెడికల్ ఎతిక్స్ కాదంటూ గొడవ చేస్తారనీ డాక్టర్ని చెప్పమందాం. కుర్రాడు తొందరగా నార్మల్ అయినందుకు పెద్దలు డాక్టర్ని దేవుడంటారు. ఆయనకి పేరు, రమేష్‌కి విముక్తి" అన్నాడు భారవి.

"ఇంతకంటే ఆ ప్రాణదాతల గుట్టు బయటపెడితే నయంకదా" అన్నాడు దర్శకుడు.

"అమ్మో, ఆ డాక్టరు ప్రాణదాతల మనిషే. వాళ్ల గుట్టునలాగే వుంచాలి" అన్నాడు రమేష్.

"అందుకే నేనలా చెప్పాను. విష్యూ హాపీ మారీడ్ లైఫ్" అంటూ భారవి అక్కణ్ణించి కదలబోతూంటే రమేష్ కంగారుగా "నేనొప్పుకున్నా శకుంతలతో పెళ్లికి మావాళ్లు ఒప్పుకోరు. మీకు వీలుంటే అయిదో వరుణ్ణి కాస్త ముందుగా హెచ్చరించుకోండి" అన్నాడు వాళ్లిద్దర్నీ ఉద్దేశించి.

"అయ్యో తొందరపడకు. నీ నిర్ణయం మీద ఓ ఆడపిల్ల భవిష్యత్తే కాదు. మా మిత్రుడి జీవితమూ ఆధారపడివుంది" అన్నాడు భారవి.

"తొందరపడకుంటే ఎలా? ఇప్పటికే ఆలస్యం చేశాను. ఆ శకుంతలని ప్రేమిస్తున్న పవర్‌ఫుల్ మనిషి ఎవడో వున్నాడు. వాడే ఈ ముహూర్తాలకథ సృష్టించి అమలుజరుపుతున్నాడు. నా విషయంలో వాడు కొంచెం ఉదారంగానే వ్యవహరించాడనొచ్చు. ఇంకా నేను రంగంనుంచి తప్పుకోకుంటే ఈసారి నిజంగానే యాక్సిడెంటు

కావచ్చు. మీరిద్దరూ మీ మిత్రుణ్ణి కూడా హెచ్చరించడం మంచిది" అన్నాడు రమేష్.

"నువ్వు చాలా తెలివైనవాడివి. నువ్వు చెప్పేదాకా మాకీ విషయం స్ఫురించనేలేదు' అన్నాడు భారవి మెచ్చుకోలుగా. అయితే వారక్కడ ఇంకెంతోసేపు వుండలేదు.

వాళ్లిలా బయటకి రాగానే రమేష్ తల్లి "అబ్బాయి మీతో ఏం మాట్లాడాడు నాయనా? " అంది ఆమె గొంతునిండా ఆత్రం వుంది.

"అచ్చం మీ అబ్బాయి కేసులాంటి దాని కోసం డాక్టరుగారో కొత్త మందు కనిపెట్టా డట. ఆ మందుని ఇంతవరకూ ఓ కుక్క, ఓ పిల్లి, ఓ పంది, ఓ కోతి - ల మీద ప్రయోగించి అద్భుత విజయం సాధించే డట. ఓ మనిషి కూడా దొరికితే బాగుండు నని ఎదురుచూస్తుంటే ఆయన అదృష్టం పండి మీవాడికి చావుదెబ్బలు తగిలాయి. ఆ మందు వేస్తే ఒక్కరోజులో మీవాడు మళ్లీ వేడివేడి ఉప్మాని స్పూన్ వాడకుండా చేత్తో తీసి చట్నీలో ముంచుకుని తింటాడట. మీవాడికా మందు వేసుకోవాలనుంది. డాక్ట రేమో పెద్దలొప్పుకుంటే కానీ వీలు కాదంటు న్నాడు. మిమ్మల్ని ఒప్పించమని మీవాడు మాకు చెప్పాడు. ప్రాణమిత్రులం చెబు తున్నాం. మీవాడికి మిరకిల్ వైద్యం చేయిం చండి. కుక్క, పిల్లి, పంది, కోతిలని కాపాడి నట్లే ఆ దేవుడు మీవాణ్ణీ కాపాడతాడు. ఇది మా మాట. ఆపైన మీ అబ్బాయి, మీ ఇష్టం. వస్తాం" అన్నాడు భారవి.

★ ★ ★

శకుంతలకి పెళ్లి సంబంధం చెడిపో యింది. అందుకామె ఎంతో సంతోషించి అంతా ప్రియవ్రత మహిమ అనుకుంది.

శశాంక, కాళిదాసు జరిగినదంతా భారవి నోట విని ఆశ్చర్యపోయారు. శకుంతల పెళ్లి చెడగొట్టడంలో ఇంకొకరు పాత్ర నిర్వ హించడం వాళ్లకి ఆశ్చర్యం కలిగించింది.

"నా అనుమానం ఇది కాకతాళీయమని. రమేష్ కాస్త ముక్కుసూటి టైపులా వున్నాడు. ఆఫీసులో ఏదో కీలకమైన సీట్లో వుండి వుంటాడు. ఒక్కరోజుకి అతణ్ణి సీటు తప్పించాల్సివచ్చి వుంటుంది. అందుకు ఎవరో ఆ మార్గాన్నెన్నుకుంటే అది మనకి కలిసొచ్చింది" అన్నాడు భారవి.

"ఏది ఏమైతేనేం? రక్తపాతం లేకుండా ప్రేమయుద్ధం ముందుకు వెడుతోంది. ఇక మనం రెండో అడుగు వేయాలి" అన్నాడు కాళిదాసు.

"అడుగంటే అల్లాటప్పాగా వుండకూడదు. వామనుడి అడుగులా అది మన సమస్యని ఆక్రమించుకుని అణగదొక్కాలి" అన్నాడు భారవి.

"అవునంతే. ఇప్పుడు శకుంతల కుటుం బంలో ఒకరకమైన నిరాశాభావం చోటుచే సుకుని వుంటుంది. ఆమె తాతయ్య ఇప్పుడు బలిచక్రవర్తిలా ఎంతటి ఔదార్యాని కైనా సిద్ధపడగలడు, ఆమె పెళ్లి విష యంలో. శశాంక అంటే ఆయనకి సదభి ప్రాయం వుంది. ఇక మనం చేయాల్సిం దల్లా ఒక్కటే. శశాంక ఆయన కులంవాడే నని ఆయన్ని నమ్మించాలి" అన్నాడు కాళి దాసు.

"జాతకం మూఢనమ్మకం. అది ఉపయో గించుకుని శకుంతల పెళ్లి చెడగొట్టాం. అది తప్పు కాదు, మన ఉద్దేశం మంచిది కాబట్టి. కులం మూఢనమ్మకం. అది ఉపయోగించు కుని శకుంతల పెళ్లి జరిపిద్దాం. అదీ తప్పు కాదు, మన ఉద్దేశం మంచిది కాబట్టి" అన్నాడు కాళిదాసు.

"సరే, మరి రెండో అడుగు ఎలా వేస్తాం? "

"ఈ ఊళ్లో పరమానందం అని ఓ మధ్య తరగతి కుటుంబీకుడున్నాడు. దుకాణాల్లో పద్దులు రాస్తూ, ఇరుగుపొరుగులకి సాయం చేస్తూ బతుకు వెళ్లబుచ్చే ఆయన అపుత్రస్య గతిర్నాస్తి అని పొరపాటుపడి ముగ్గురు




కూతుళ్లని కన్నాడు. వాళ్లకి పెళ్లిళ్లు చేయలేక నానా అవస్థలూ పడితే ఆ పిల్లలే తమ దారి తాము చూసుకున్నారు. కానీ ఆయన తెలివిగా ఆ పెళ్లిళ్లు తనే జరిపించినట్లు లోకాన్ని నమ్మించాడు. కూతుళ్ల పని ఇప్పుడు బాగానే వుంది. వాళ్లు తండ్రికి అంతోఇంతో ధనసాయంకూడా చేస్తున్నారు. ఆయన పనీ ఇప్పుడు బాగానేవుంది. లేని వాడు కాబట్టి ఆయన అల్లుళ్ల కులం, గుణం ఎవరికీ పెద్దగా చర్చనీయాంశం కాలేదు. ఇప్పుడు నాలుగువేళ్లూ నోట్లోకి పోతూండడంతో పరమానందానికి సమాజంలో గుర్తింపు పొందాలన్న తాపత్రయం బయల్దేరింది. అదీ మనకి అవకాశం" అన్నాడు కాళిదాసు.

"ఈ పరమానందానికి మన ప్రేమకథతో ఏంపని? " అన్నాడు దర్శకుడు.

"పరమానందానికీ శశాంకకీ బంధుత్వం కలుపుదాం. పరమానందానికీ శకుంతల కుటుంబానికీ బంధుత్వముంది. ఆవిధంగా శకుంతల తాతయ్యకి శశాంకపట్ల ఆసక్తి పుడుతుంది"

"పరమానందం అబద్ధం చెప్పడానికి ఒప్పుకుంటాడా? "

"రామాయణానికి వ్యాఖ్యానం చెప్పాలని ఆయనకి మహా మనసు. చిన్నప్పుడు వాల్మీకి రామాయణం ఒక్కటేగాక తెలుగులో వచ్చిన రామాయణాలన్నీ బాగా చదివేడట. తన జ్ఞానాన్ని పంచిపెట్టాలని ఆయన కోరిక శశాంక వేదికనిస్తే ఆయన పురాణ కాలక్షేపం చేస్తాడు. ఆ సభకి మంత్రులని ఆహ్వానిస్తే పురాణం వినడానికి జర్నలిస్టులూ వస్తారు. పరమానందం ఏం చెప్పాడో పత్రికల్లో వస్తే చాలు ఆయన గ్లామర్ పెరుగుతుంది. కనెక్షన్లుంటే పత్రికలాయన వ్యాఖ్యానాన్ని సీరియలైజ్ చేయొచ్చు టీవీలు ఆయనతో ముఖాముఖీ ఏర్పాటు చేయొచ్చు దేశం అవార్డులు కూడా ఇవ్వచ్చు ఆయనకెంత పేరొస్తే శశాంకకి అంత లాభం. తన ప్రేమ ఫలించడంతోపాటు ఓ అనామకుడికి గుర్తింపు తెచ్చినట్లూ అవుతుంది. ఇదీ మన రెండో అడుగు. ఈ అడుగువేయగానే సంబంధం మనని వెతుక్కుంటూ వస్తుంది" అన్నాడు కాళిదాసు.

బృందమంతా చప్పట్లు కొట్టారు. శశాంక మాత్రం సాలోచనగా "ఐడియా బాగుంది. నా పెళ్లి శకుంతలతో జరుగుతుంది. నేనామె ముందు నిజాన్ని దాచలేను. అప్పుడేమవుతుంది? " అన్నాడు.

"ఆమె పరిస్థితులకి అడ్జస్టవుతుంది, పెద్దలననుసరిస్తూ. గాంధీ, నెహ్రూ, రాజాజీల వంటి ప్రముఖులు తమ బిడ్డలకి ఆదర్శ వివాహాలు చేశారు. వారిని మనం తప్పు పట్టం. దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌ని ఆదర్శ మహిళగా అంగీకరిస్తాం. సరోజినీ నాయుణ్ణి కీర్తిస్తాం. వారు అనుసరించిన మార్గాలని అనుసరించడానికి భయపడతాం. గొప్పవాళ్లలాంటి పనులెందుకు చేస్తారో తెలుసా? సామాన్యులు తమకులా ఉద్యమాలు నడపలేకపోయినా కనీసం ఆదర్శ వివాహాలు చేసుకోగలరని. పెళ్లయ్యేదాకానే ఈ కులమతాల వేడి. అది ఎన్నోసార్లు రుజువయింది కూడా" అని కాళిదాసు నవ్వాడు.

★ ★ ★

పరమానందం ఇల్లు సమీపిస్తుండగా కాళిదాసు "గుర్తుందిగా శశాంకా! శకుంతలకి పరమానందం దూరపు వరుసలో పెద్దమామయ్య ఔతాడు. కాబట్టి నీకతడు పెదనాన్న" అన్నాడు.

"అంతా గుర్తుంది. ఇప్పుడు నాకు డైలాగు ఒక్కసారి వింటే చాలు గుర్తుండిపోతోంది. నువ్వే చూస్తావుగా నా ప్రతాపం" అన్నాడు శశాంక.

కారు పరమానందం ఇంటిముందాగింది. కానీ అప్పటికే ఆ ఇంటిముందో కారాగి వుంది. శశాంక బృందం కారు దిగుతుం

డగా ఇంటి లోపల్నుంచి పరమానందం, ఓ యువకుడు బయటకి వచ్చారు.

ఆ యువకుడు ఆరడుగుల పొడవున్నాడు. పచ్చని ఛాయతో మిసమిసలాడిపోతున్నాడు. అతడు ధరించిన స్పాట్‌లెస్ వైట్ డ్రెస్ బంగారానికి వెండి తొడుగులా వుంది. అతడి ముఖానికి చిరునవ్వు సహజ అలంకారంలా వుంది. ఆ చిరునవ్వులోంచి పుట్టిన ప్రశ్నార్థకం ఆగంతకులని నిలదీసింది.

"నమస్కారం పరమానందంగారూ! వీరెవరు?" అన్నాడు కాళిదాసు.

"ఇతడి పేరు కృష్ణమురళి. దూరపు వరుసలో నేను ఇతడి పెదనాన్నను. మా మురళికి నేనన్నా, నా రామాయణ వ్యాఖ్యానమన్నా వెర్రి అభిమానం. నా జ్ఞానాన్ని నలుగురికీ పంచిపెట్టించాలన్న తాపత్రయంతో వచ్చాడు. కాదనలేకపోయాను. నీతో వీళ్లెవరు?" అనడిగాడు పరమానందం.

"ఇతడు శశాంక" అన్నాడు కాళిదాసు.

"హలో! అయాం మురళి... కృష్ణమురళి" అంటూ ఆ యువకుడు చేయిజాపాడు. తెల్లబోతూనే చేయి ముందుకు సాచిన శశాంక 'నాకంటే ముందు నా ప్లాను వీడెలా అమలుచేస్తున్నాడు?' అనుకున్నాడు.

★ ★ ★

కృష్ణమురళి రాక శశాంక బృందంలో కలవరాన్ని రేపింది. అతడెవరో, అతడి ఉద్దేశమేమిటో అంతుచిక్కక వాళ్లు కొట్టుమిట్టాడారు. శశాంకకైతే అతడు తన ప్రత్యర్థి అన్న అనుమానం బయల్దేరింది. అతడి వివరాలకోసం కాళిదాసును నొక్కించాడు.

కాళిదాసుకి కృష్ణమురళి తెలీదు. శకుంతల కుటుంబాన్ని ఆవహించిన ఛాందసవాదాన్ని గ్రహించి వుండడంవల్ల అతగాడు శశాంక కులం విషయంలో అబద్ధం చెప్పాలనుకున్నాడు. అందుకోసం ఆ కుటుంబంతో బంధుత్వమున్నవారి ఆరాలు తీశాడు. అందులోంచి పరమానందం సేఫెస్టు కాండిడేట్‌గా వెలికివచ్చాడు. తీరా పథకం సిద్ధం చేసుకుని వెళ్లేసరికి కృష్ణమురళి పరమానందాన్ని ఎగరేసుకునిపోయాడు.

"ఎవరా కృష్ణమురళి?" అంటాడు శశాంక.

"మనం కృష్ణమురళినో కంట కనిపెడుతూండాలి. అతడి ఎత్తుగడేమిటో తెలుసుకోవాలి. రమేష్ విషయంలోలాగే ఇదీ కాకతాళీయమేమో" అన్నాడు దర్శకుడు.

"రమేష్, పరమానందం... కాకతాళీయాలు రెండుసార్లు జరగడం అరుదు. ఒకవేళ రెండింట్లోనూ కూడా కృష్ణమురళి హస్తమున్నదేమో" అన్నాడు భారవి.

"అదే నిజమనిపిస్తోంది" అన్నాడు శశాంక. అదే నిజమైతే అతడు అన్నింటా తనకి ముందున్నట్లే లెక్క.

"మన ఆలోచనలు మరీ ఎక్కువదూరం వెడుతున్నాయి. ముందుగా శకుంతల విషయంలో కృష్ణమురళి ఆలోచనలేమిటో తెలుసుకోవడం అవసరం. అతడికి శకుంతల పట్ల ఆసక్తి లేకుంటే మనమతడి గురించి ఆలోచించడం అనవసరం" అన్నాడు కాళిదాసు.

"నీ మాట నిజమైతే బాగుండును" అన్నాడు శశాంక.

★ ★ ★

రోజూలాగే ఆరోజు కూడా శకుంతల దర్పణి ఇంటికొచ్చింది. కానీ రోజూలా రాజు అన్న టైముకి రాలేదు. శకుంతల గిలగిలలాడిపోయింది.

"నీ ప్రేమ ముదిరిపోయింది" అంది దర్పణి.

"అతణ్ణి చూడకుండా ఉండలేను" అంది శకుంతల.

"నీ వరసిలా ఉంది. అవతల శశాంక విజృంభిస్తున్నాడు. అతడికి మందీ మార్బలముంది. రాజు అతడి ధాటికి తట్టుకోలేడు"

అంది దర్పణి.

"నువ్వు తలచుకుంటే శశాంకను దార్నించి తప్పించగలవు" అంది శకుంతల.

"నా గురించి నువ్వేమనుకుంటున్నావ్? వెనకాల నాలుగు డబ్బులుంటే, అమ్మ, నాన్న కాస్త స్వేచ్ఛనిస్తే ఆడపిల్ల ఎంత పనైనా చేయగలదనా నీ నమ్మకం? " అంది దర్పణి

"నేను రాజును ప్రేమించాను. అది నా ఛాయిస్. మా ప్రేమ ఫలించడానికి నిన్ను ఆలంబన చేసుకుంటున్నాను. అదీ నా ఛాయిస్. నా ఛాయిస్ తప్పుకావడానికి వీల్లేదు. అర్థమయింధా? "

దర్పణి శకుంతలవంక ఆశ్చర్యంగా చూసింది. ఆమె ముఖంలో బెదురులేదు. భయంలేదు. సంకోచంలేదు. రాజుపట్ల ధృఢనిశ్చయం వుంది. పూర్తి నమ్మకం వుంది. అది తన పట్లు!

దర్పణికి వళ్లు పులకరించింది.

"పూర్వజన్మలో నేను శకుంతల ప్రియుడినై ఉండాలి. అందుకే ఆ వాసనలు నన్నిప్పటికీ వదలడంలేదు" అనుకుందామె.

"మరి శశాంకను రంగంనుంచి తప్పిస్తావు కదూ? " అంది శకుంతల.

"నీకోసం ఏమైనా చేస్తాను. అయితే నా పద్ధతి కాస్త వేరు. మనకు మామిడిపళ్లు కావాలంటే మామిడిటెంకను పాతాలి. అది మొక్కై, చెట్టై తన జాతి విస్తరణకోసం బోలెడు ఫలాలను సృష్టిస్తే ఆ పళ్లను మనం ఆహారంగా చేసుకుని జీవితాన్ని మధురం చేసుకుంటాం. మనకు శశాంక మామిడి చెట్టులాంటివాడు" అంది దర్పణి.

"నాకు అర్థంకాలేదు" అంది శకుంతల.

"మట్టి, నీళ్లు ఉన్నంత మాత్రాన వాటిలోంచి మామిడి పండును తయారుచేయగల శక్తి మనిషికి లేదు. అది మామిడిచెట్టుకే ఉంది. శశాంక నీ గురించి ఏమేం పథకాలు వేస్తాడో అవి తెలుసుకుని మనం అమలుచేద్దాం" అంది దర్పణి.

"ఇంకా నాకు అర్థంకాలేదు" అంది శకుంతల.

"సరే సూటిగా చెబుతాను. పరమానందం శశాంకకు పెదనాన్న అవుతున్నాడు కదా! దాన్నతడు ఎస్టాబ్లిష్ చేసుకుంటే చాలు. రాజు శశాంకకు కజిన్‌బ్రదర్ అని మనం ఎస్టాబ్లిష్ చేస్తాం"

"ఇది నాకు తట్టనేలేదు" అని "కానీ తర్వాత? " అంది శకుంతల సంకోచంగా.

"తర్వాత నువ్వు కాస్త ధైర్యం చెయ్యాలి"

★ ★ ★

"అయాం మురళి కృష్ణమురళి" అన్నాడు కృష్ణ మురళి.

తాతయ్య అతడివంక ఆశ్చర్యంగా చూసి, 'పేరు తెలిసింది కానీ నువ్వెవరో తెలియడం లేదు బాబూ!' అన్నాడు.

తాతయ్య వెనుకనే ఉన్న అమ్మమ్మ మాత్రం "కుర్రాడు చాలా బాగున్నాడు, మంచి పెళ్ళికొడుకు" అని వెంటనే అనుకుంది.

"నన్ను లోపలకు రానిస్తే అన్నీ చెబుతాను" అన్నాడు కృష్ణమురళి.

తాతయ్య అతణ్ణి డ్రాయింగ్ రూంలోకి తీసుకుని వెళ్లాడు.

'ఇంట్లో ముసలాళ్ళిద్దరమే ఉన్నాం. నాకేమో కాఫీ కలిపే అలవాటు కూడా పోయింది. ఇప్పుడేం చేయాలీ' అనుకుంటూనే తనూ డ్రాయింగ్‌రూంలోకి వెళ్ళిందావిడ.

ముగ్గురూ కూర్చున్నారు.

"మంచినీళ్లు కావాలా బాబూ" అంది అమ్మమ్మ.

"వద్దండీ లక్ష్మివారం ఉపవాసం. మంచినీళ్లు కూడా తాగను" అన్నాడతడు.

అమ్మమ్మ చాలా ఇంప్రెసైపోయింది. అతడంటే ఆవిడ కుతూహలం పెరిగింది.

ముందు కృష్ణమురళి తాతయ్య కుటుంబాన్ని పొగిడాడు. మన బంధువర్గంలో

అలాంటి కుటుంబం లేదనగానే "మన అంటున్నావు. మాకు బంధువులా ఏమిటి? " అంది అమ్మమ్మ.

అతడు ముందు అమ్మమ్మ గొంతునీ ఆ తర్వాత ఆవిడ ఆకారాన్నీ పొగిడి ఆ తర్వాతనే ప్రశ్నకు బదులిచ్చాడు. పరమానందంతో ప్రారంభించి నాలుగూళ్ళలోని వారి బంధువులను ప్రస్తావించాడు.

"నేనీ ఊళ్లో వ్యాపారం గురించి సర్వే చేయడానికొచ్చాను. అయిదారు నెలలుంటాను. ఎవర్ని కలుసుకున్నా లేకున్నా మిమ్మల్ని మాత్రం కలుసుకోవలసిందిగా అమ్మ మరీ మరీ చెప్పింది" అన్నాడతడు.

"నాన్న ఏం చేస్తుంటాడు? "

"వ్యాపారం. గ్లోబలైజేషన్ వచ్చాక ఆయన ఇండియాలో ఉండడం తగ్గిపోయింది. రెండు నెలలుగా సింగపూర్లో ఉంటున్నారు. అక్కణ్ణించి దుబాయ్ వెళ్లి నెల్లాళ్లుండి శాన్‌ఫ్రాన్సిస్కో వెడతారు. తర్వాత ఏం చేసేదీ ఇంకా తెలియదు"

"నీకు అక్కలూ, చెల్లెళ్లూ, అన్నలూ, తమ్ముళ్ళూ ఎందరు బాబూ!" అంది అమ్మమ్మ.

"అమ్మా నాన్నలకు నేనొక్కణ్ణే. వాళ్ళకు నేను. నాకు వాళ్లు. అంతే!"

అమ్మమ్మ కళ్లు మెరిశాయి, "నీకు పెళ్ళయిందా? "

"లేదండి"

"ఏమైనా సంబంధాలు నలుగుతున్నాయా? "

కృష్ణమురళి వెంటనే, "ఇలా అంటున్నానని ఏమీ అనుకోవద్దు. నాకు సూటిగా మాట్లాడ్డం ఇష్టం. ఉదాహరణకు నా గురించి చెప్పు కోవాలంటే ఇన్నాళ్లూ వాయిదా వేసినా ఇక నేను పెళ్ళి చేసుకుందామనే అనుకుంటున్నాను. మంచి అమ్మాయికోసం మేం ముగ్గురం వెతుకుతున్నాం. నా ఇష్టాన్ని అమ్మా నాన్నా కాదనరు. అలాగే వాళ్ల యిష్టాన్ని నేనూ కాదనను. అంటే అమ్మాయి మా ముగ్గురికీ నచ్చాలి. ఇవీ నా వివరాలు. ఇక మీరడిగేది కూడా సూటిగా అడిగితే సంతోషిస్తాను" అన్నాడు.

ఈ మాటలకు తాతయ్య తికమకపడిపోయాడు కానీ అమ్మమ్మ చలించలేదు. "నాకూ ఈ పద్ధతే ఇష్టం బాబూ, నువ్వేమనుకుంటావోనని తటపటాయించానంతే! మా మనవరాలు శకుంతలుంది. దాని పక్కన నీ అంతటి అందగాడు కూడా దిష్టి బొమ్మలా ఉంటాడు. సూటిగా చెప్పమన్నావని చెప్పాను. ఏమీ అనుకోకు. నీకు అభ్యంతరం లేకపోతే మనం పెద్దవాళ్లను కదపొచ్చు" అంది.

అబ్బాయేమనుకుంటాడోనని తాతయ్య కలవరపడ్డాడు కానీ ఇలాంటి వ్యవహారాలు ఆడవాళ్ళ చొరవతోనే ముందుకు వెడతాయి. కృష్ణమురళి వెంటనే, "అమ్మాయిది అమ్మమ్మ పోలికని ఒక్క మాట చెప్పండి. నాకూ, మా పెద్దలకూ కూడా ఏ అభ్యంతరమూ ఉండదు" అన్నాడు.

ఊహించని ఈ పొగడ్తకు అమ్మమ్మ ఉబ్బితబ్బిబ్బైపోయింది. ఆమె చటుక్కున లేచి "నువ్వు కూర్చుని కబుర్లాడుతూ ఉండు. ఫలహారం తెస్తాను" అంది.

"చెప్పాను కదండీ ఈరోజు ఉపవాసం. మంచినీళ్లే తాగను" అన్నాడు కృష్ణమురళి.

"మరి ఇంటికొచ్చి ఏమీ తాగకుండా, తినకుండా వెళ్ళిపోతావా? " అమ్మమ్మ బాధగా అంది.

"కతికితే అతకదంటారు కదా ఒకవిధంగా ఇదీ మంచిదే..." అన్నాడు కృష్ణమురళి.

ఆ మాటలు అమ్మమ్మను నిలువెల్లా పులకరింపజేసాయి. అప్పుడే సంబంధం కుదిరిపోయినట్లే భావించి మురిసిపోయిందామె.

అప్పుడు తాతయ్య "ఒక చిన్న ఇబ్బందుంది బాబూ! అమ్మాయికి పెళ్ళిచూపులంటే ఇష్టముండదు. అందుకని పిల్లను చూడాలంటే నువ్వు పరోక్షంగా ఏర్పాటుచేసుకోవాలి. నీకు మేమూ సహకరిస్తాంలే"





అని ఇంకా ఏదో అనబోతుండగా.

"ఆత్మాభిమానమున్న ఏ ఆడపిల్లా పెళ్ళి చూపుల తంతుకు ఒప్పుకోకూడదు. పెళ్ళి చూపులంటే పరిచయం కోసం. ఎన్నికకోసం కాదు. అమ్మమ్మగారిని చూశాను. ఇంక అమ్మాయిని చూడక్కర్లేదు. మావాళ్లతో మాట్లాడాక మీకు ఏ విషయమూ చెబు తాను" అంటూ లేచాడు కృష్ణమురళి.

"లేదు బాబూ! నిర్ణయానికి ముందే మీరిద్దరూ ఒకరినొకరు చూసుకోవాలి, మాట్లాడుకోవాలి. అది గౌరవప్రదంగా జర గాలి. అంతే" అన్నాడు తాతయ్య.

"పరిచయానికి వచ్చి పెళ్ళి మాటల్లో తేలాం. అందుకే అంటారు రాసిపెట్టింది రాసిపెట్టిన వాడికే తెలియాలని. ఇక్కడ జరిగినదంతా చెబితే మా అమ్మా, నాన్నా ఎంతో సంతోషిస్తారు" అని వాళ్ళ దగ్గర సెలవుతీసుకున్నాడు కృష్ణమురళి.

అతడు వెళ్లగానే "ఆ రమేష్ సంబంధం చెడిపోవడం చాలా అదృష్టమని నాకిప్పుడని పిస్తోంది, మీరేమంటారు? " అంది అమ్మమ్మ.

"ఎప్పుడైనా సరే- సంబంధం కుదరడం లోనే అదృష్టముండాలి. చెడిపోవడంలో ఉండకూడదు. ఇది గుర్తుంచుకో. నాకైతే ఈ అబ్బాయి విషయం కాస్త అనుమా నంగా ఉంది. ఇతగాడిగురించి మన బంధు వర్గంలో ఎప్పుడూ వినలేదు. ఇతగాడి పెద్ద లకు మన గురించి ఎలా తెలుసోనని ఆశ్చ ర్యంగా ఉంది. వెతుక్కుంటూ మనింటికొ చ్చాడు. తెలివిగా మనచేత పెళ్ళి మాటలు మాట్లాడించాడు. అమ్మాయిని చూడక్కర్లేద న్నాడు. మన శకుంతలను చూశాకనే ఇక్క డికి వచ్చాడని నాకు అనుమానంగా ఉంది. ఇతగాడి గురించి కాస్త ఆరా తియ్యాలి" అన్నాడు తాతయ్య.

"అనుమానం ముందు పుట్టి తర్వాత మీరు పుట్టారు. అదృష్టం సంబంధం కుద రడంలోనే తప్ప చెడిపోవడంలో ఉండకూడ దనుకుంటే అనుమానాల్ని పక్కనపెట్టాలి. కాస్త గుర్తుంచుకోండి" అంటూ బాణాన్ని తిప్పికొట్టింది అమ్మమ్మ.

★ ★ ★

"కృష్ణమురళి ఎవరో తెలిసిపోయింది" అన్నాడు భారవి.

"చెప్పు" అన్నాడు శశాంక.

"విలన్"

శశాంక ఉలిక్కిపడ్డాడు. "విలనా, విలనే మిటి? "

"హీరో కావాలనుకుంటే విలన్‌నెదుర్కొం దుకు సిద్ధపడక తప్పదు. ఈ విలన్ నువ్వు సృష్టించుకున్నవాడు కాదు. నీ ఇతివృత్తానికి అనుకూలంగా నడవడు. ఇప్పుడు కదా మన కథ రక్తికట్టింది" అన్నాడు కాళిదాసు నవ్వుతూ.

"కథ రక్తికట్టింది. మరి నా ప్రేమగతి ఏమిటి? " అన్నాడు శశాంక.

"ప్రేమగతి ఇంతేనని పాటపాడుకో. కృష్ణ మురళి అప్పుడే కోటలో పాగావేశాడు. నీకంటే ముందే శకుంతల ఇంటికి వెళ్ళి బంధువునని చెప్పుకుని తెలివిగా పెళ్ళి ప్రస్తావన చేయించాడు. ఇంక శకుంతల నీకు దక్కదు" అన్నాడు కమేడియన్.

"షూటింగ్ లేనప్పుడు కూడా అపశకు నాలు మాట్లాడకు. నాకు చిరాకేస్తుంది. చేతనైతే ఓ మంచి సలహా చెప్పు. లేకుంటే ఓ మూల కూర్చో" అన్నాడు శశాంక విసుగ్గా.

"అయితే విను. ఓ గొప్ప సలహా చెబు తాను. కృష్ణమురళి తప్పకుండా ఏదో పార్టీ చేసి శకుంతలను అక్కడికి రప్పిస్తాడు. ఆ పార్టీలో వాళ్ళు పరస్పరం చూసుకుంటారు. ఒకసారి ఆ పార్టీ జరిగిపోయిందంటే వాళ్ళి ద్దరి పెళ్ళీ తథ్యం"

"దీన్ని జోస్యమంటారు, సలహా అనరు" అన్నాడు శశాంక కోపంగా.

"ఆ జోస్యాన్ని విఫలం చేయడానికే నా

సలహా. ఆ పార్టీలో ఊహించనివిధంగా ఓ అమ్మాయి ముందుకువచ్చి కృష్ణమురళికి ప్రియురాలినని చెప్పాలి. అందులోని నిజానిజాల విషయం తర్వాత. ముందు పార్టీ అభాసవుతుంది. ఆ షాకునించి కృష్ణమురళి తేరుకునేలోగా మనం శకుంతల కుటుంబాన్ని మంచి చేసుకోవాలి" అన్నాడు కమేడియన్.

"అద్భుతం... నీ బుర్రలో ఇంత గొప్ప అయిడియాలుంటాయని నేను కలలో కూడా ఊహించలేదు. చాలా థాంక్స్" అన్నాడు శశాంక మెచ్చుకోలుగా.

షూటింగ్ లేనప్పుడు నన్ను చిన్నబుచ్చడం నీకు తగునా?" అన్నాడు కమెడియన్.

"ముందు మనం ఓ అమ్మాయిని వెతికి పట్టుకోవాలి" అన్నాడు దర్శకుడు మాట మార్చుతూ.

"అంతేకాదు. కృష్ణమురళి పార్టీ చెయ్యక పోతే పార్టీ అయిడియాని కూడా అతడి బుర్రలోకెక్కించాలి" అన్నాడు భారవి.

"ఏక్షన్" అన్నాడు దర్శకుడు నవ్వుతూ. కానీ అప్పుడు కెమేరామన్ రెడీ కాలేదు. బృందమంతా అలర్ట్ అయ్యారు.

★ ★ ★

తాతయ్యా శకుంతలకు కృష్ణమురళి గురించి చెప్పాడు.

"డబ్బు మనిషికి సుఖాన్నిస్తుందంటావా తాతయ్యా" అంది శకుంతల.

"డబ్బెప్పుడూ మనకు ప్రధానం కాదు. సంప్రదాయం ముఖ్యం. మనవాళ్ళ కుర్రాడు. బుద్ధిమంతుడు. అందుకని ఇష్టపడుతున్నాం"

"నువ్వు నిజమే చెబుతున్నావా తాతయ్యా"

శకుంతల గొంతులోని ఆత్రాన్ని గ్రహించి నవ్వుకున్నాడు తాతయ్య. నిజమే చెబితే ఆమెకిష్టమే అవుతుందని అర్థంకాగా, "ముమ్మాటికీ నిజం" అన్నాడు.

"అయితే నేను ఇష్టపడ్డ కుర్రాడు మనవాడయితే, బుద్ధిమంతుడైతే డబ్బు లేకున్నా ఫరవాలేదు కదా" అంది శకుంతల.

శకుంతల ఏం చెప్పబోతోందో తాతయ్యకు అర్థమై, "నువ్వింకా ఆ రాజును మర్చిపోలేదా?" అన్నాడు.

"ఎలా మర్చిపోను తాతయ్యా?" అంది శకుంతల అసహాయురాలిలా.

"కృష్ణమురళిని తలచుకో. ఆ తలపులే రాజును మరిపిస్తాయి" అన్నాడు తాతయ్య.

"కానీ రాజును నేనెందుకు మర్చిపోవాలి?" అంది శకుంతల.

"అతడితో నీ పెళ్ళి ఇంట్లో ఎవరికీ ఇష్టం లేదు" అన్నాడు తాతయ్య.

"నా ఇష్టంతో ఎవ్వరికీ నిమిత్తముండదా?" అంది శకుంతల.

"పిల్లల ఇష్టాలను పిల్లలకే వదిలిపెడితే వాళ్ళు అన్నం తినరు, స్నానం చేయరు, చదువుకోరు. అవన్నీ చెప్పే తల్లిదండ్రులను ద్వేషిస్తారు కూడా. కానీ తర్వాత తల్లిదండ్రులు తమకు చేసిన మేలును గుర్తిస్తారు. తమ పిల్లలను పెంచడంలో తల్లిదండ్రులు చూపిన బాటనే అనుసరిస్తారు. పెళ్ళీడు ఆడపిల్లలూ అంతే. వయసులో కలిగిన ఓ భావానికి ప్రేమ అని పేరు పెడతారు. తల్లిదండ్రులు చెప్పిన కుర్రాణ్ణి పెళ్ళి చేసుకున్నాకే ప్రేమ అంటే ఏమిటో వాళ్ళకు అర్థమవుతుంది. నీ ఇష్టంతో ఎవ్వరికీ ఎందుకు నిమిత్తముండదూ. నీ ఇష్టం నిన్ను సంతోషాన్నించి దూరం చెయ్యకూడదనే ఇంటిల్లిపాదీ తాపత్రయపడతారు. అంతే!" అన్నాడు తాతయ్య.

"అయితే స్వేచ్ఛ తప్పంటావా తాతయ్యా!" అంది శకుంతల.

"మొక్కలు స్వేచ్ఛగా ఇష్టం వచ్చినట్లు పెరిగితే అది అడవి అవుతుంది. అందులో క్రూరమృగాలు చేరి సాధుజంతువుల్ని హింసిస్తాయి. మొక్కల్ని క్రమశిక్షణలో




పెంచితే అది తోట అవుతుంది. అందులో క్రూరజంతువులనుంచినా అది సాధుజంతువుల వినోదానికీ, మానసిక వికాసానికీ అవుతుంది. ఇది నీకు తెలిసిందే కదా!"

"బాగా చెప్పావు తాతయ్యా. నువ్వు చెప్పిన విషయం ఆలోచించాల్సిందే" అంది శకుంతల.

"ఆలోచించాలని తెలిసినా ఆలోచించాల్సిన వయసు కాదు నీది. ఆ విషయం ఎప్పుడూ గుర్తుంచుకో"

"సరే తాతయ్యా. నా గురించే కాక నా ఇష్టం గురించి కూడా నువ్వు ఆలోచించు తాతయ్యా. నీ మాట నేనెప్పుడూ కాదనను" అంది శకుంతల.



"ఒసామా బిన్ లాడెన్ భారత్‌కు శత్రువు. అతడు అమెరికాలో ఉగ్రవాదాన్ని చూపితే ఫలితం రకరకాల మలుపులు తిరిగి చివరకు అడ్డూ అదుపూ లేకుండా పోయిన భారత్ వ్యతిరేక తీవ్రవాదానికి పాకిస్తాన్ తెర దించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆ విధంగా బిన్ లాడెన్ భారత్‌కి మిత్రుడనీ అనవచ్చు. అలాగే రామాయణంలో కైకేయి. ఆమె రాముడికి వ్యతిరేకంగా పనిచేసినా అటు రాముడి కీర్తి పదింతలు పెరిగింది. ఇటు ప్రపంచానికి లోక కంటకుడైన రావణుడి పీడ వదిలింది. అందువల్ల ఆమెకు శాంతిదూతగా నోబెల్ బహుమానాన్ని కూడా ఇవ్వచ్చు. ఇంతకీ ఆమె జన్మస్థానం కేకయ రాజ్యం ఇప్పటి ఆఫ్ఘనిస్థాన్‌లోనే ఉండేదని కొందరంటారు. రామాయణంలో కైకేయి పాత్ర గురించి ఉపన్యాసమివ్వాలని నాకెన్నాళ్లనుంచో కోరిక. అది నీద్వారా తీరుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది" అన్నాడు కృష్ణమురళితో పరమానందం.

"మీ ఉపన్యాసం నలభై అయిదు నిముషాలకు పరిమితం చేసుకోవాలి. ఎందుకంటే పార్టీ మీ గురించి పెట్టినా, సన్మానం మీకే అయినా ఇందులో నా ప్రయోజనమూ ఉంది. ఆహ్వానితులు పరిమితులు. సభ కూడా పరిమితం" అన్నాడు కృష్ణమురళి.

అతడు ఉపన్యాస సమావేశాన్ని హోటల్లోనే ఏర్పాటు చేశాడు. సభకు దర్పణి మిత్రబృందాన్నీ ఆమె సూచనపై శశాంక మిత్రబృందాన్నీ, కూడా ఆహ్వానించాడు. శకుంతల కుటుంబం సరేసరి. వీరు కాక కొందరు జర్నలిస్టులనూ అతడాహ్వానించాడు.

"జాతిని ప్రభావితం చేసిన రామాయణంలో ప్రతి పాత్రా సజీవం. మంచి చెడుల మేలు కలయికతోనే ప్రపంచం ముందుకు వెడుతుంది. విజ్ఞానం మనకు ఊహకందని సదుపాయాలనిస్తూనే మారణాయుధాలను సృష్టించింది. అయినా విజ్ఞానం చెడ్డది అనలేము. చెడు మంచికి పదును పెడుతుంది. చెడుకెప్పుడూ విజయం లభించినా అది తాత్కాలికం. అంతిమ విజయం మంచికే. శాశ్వత విజయమూ మంచికే. రామాయణంలోని ప్రతి పాత్రా ఈ విషయాన్ని తెలియజేస్తుంది. ఈరోజు సమావేశంలో పరమానందంగారు కైకేయి పాత్ర విశిష్టతను చెబుతారు. వారి వివరణ ప్రతి ఒక్కరికీ

బతుకు అర్థాన్ని ఇంతచక్కగా అర్థమయ్యేలా చేసి జీవితంపట్ల కొత్త ఆకర్షణ పుట్టిస్తుం దని నా ఆశ. ఈ చిన్ని సమావేశం సన్నని ధారగా ప్రారంభమైనా చివరకు జాతిని ప్రభావితం చేయగల మహానదీ ప్రవాహం కాగలదని నా నమ్మకం" అంటూ కృష్ణమురళి ప్రారంభోపన్యాసం చేశాడు.

అతడి మాటల్లో ఏదో సమ్మోహనశక్తి ఉంది. సభికులందరూ ఉత్సాహంగా చప్పట్లు కొట్టారు, అతడు పూర్తిచేయగానే. అతడి మాటల ప్రభావంతో అందరిలోనూ పరమానందం పట్ల కుతూహలం రేగింది.

పరమానందం ఉపన్యాసం ప్రారంభమైంది. ఆయన మాట్లాడుతూంటే కృష్ణమురళి సభికులను పరీక్షగా చూస్తున్నాడు. అందరూ శ్రద్ధగా ఉపన్యాసం వింటున్నా మధ్యమధ్య కొందరమ్మాయిలు అతడినే ఓరచూపులు చూస్తున్నారు. శశాంక బృందం అతణ్ణి కోరచూపులు చూస్తోంది.

సరిగ్గా నలభైఅయిదు నిముషాల్లో పరమానందం ఉపన్యాసం ముగిసింది.

సమావేశం చప్పట్లతో దద్దరిల్లిపోయింది.

అప్పుడు కృష్ణమురళి తాతయ్యను వేదిక మీదకు ఆహ్వానించాడు. ఆయన గురించి ఎంతో గొప్పగా చెప్పి, ఉపన్యాసానికి ఆయన ఏవిధంగా స్పందించినదీ చెప్పమని కోరాడు.

కృష్ణమురళివంటి యువకులు రామాయణానికి యువతలో ప్రాచుర్యం తీసుకురావాలనుకోవడం గొప్ప విశేషమనీ అందుకు పరమానందాన్నెన్నుకోవడంలో అతడి లక్ష్యశుద్ధి ప్రతిఫలిస్తున్నదనీ అన్నాడు తాతయ్య. తన గురించి ప్రశంసావాక్యాలు వినబడతాయనుకున్న పరమానందం కాస్త అసంతృప్తి చెందాడు. తాతయ్య వెళ్ళిపోతూ అతడితో నెమ్మదిగా "అమ్మాయిని చూశావా బాబూ!" అన్నాడు.

"చూశాను. అమ్మాయి నా గురించి ఏమందో చెప్పండి" అన్నాడు కృష్ణమురళి.

తాతయ్య జవాబు చెప్పలేదు. వెళ్ళి శకుంతల పక్కన కూర్చుని "ఎలా ఉన్నాడమ్మా మన కృష్ణమురళి? " అన్నాడు.

"ఊ" అంది శకుంతల అంతవరకూ రాజునే చూస్తున్న తన కళ్లను ప్రశ్నార్థంగా తాతయ్య వైపు తిప్పి.

ఆమె అటు తిరగ్గానే శశాంక నిరుత్సాహపడ్డాడు. అంతవరకూ శకుంతల తననే చూస్తోందన్న భ్రమలో ఉన్నాడతడు. తన పక్కనే ఉన్న రాజును శకుంతల ప్రేమించి ఉండవచ్చునేమోనన్న అనుమానం కూడా శశాంకలో ఏమాత్రమూ లేదు.

ఈలోగా కృష్ణమురళి ఏర్పాటు చేసిన కొందరు వ్యక్తులు ముందుకు వచ్చి వేదికపై పరమానందాన్ని పూలమాలాలంకృతుణ్ణి చేశారు. పరమానందం ఉబ్బి తబ్బిబ్బయ్యాడు.

ఉన్నట్లుండి సభలోంచి ఓ అమ్మాయి లేచి నిలబడింది. ఆమె చేతిలోనూ పూలమాల ఉంది.

ఆమె ధరించిన బిగుతైన దుస్తులు శరీరపు వంపుసొంపుల్ని స్పష్టీకరిస్తున్నాయి.

ఆమె కనుబొమలు విల్లులా దిద్దబడి ఇద్దరు మన్మథుల ఉత్తేజానికి ఒకేసారి గురి కమ్మని యువతను సవాలు చేస్తున్నాయి.

లిప్‌స్టిక్ రాసిన ఆమె పెదాలు మందార మొగ్గల్లా ఉంటే, మధ్యమధ్య తళుక్కున మెరిసే ఆమె పలువరస అమెరికన్ డైమండ్స్‌ని గుర్తుచేస్తోంది.

ఆమె పూలమాలతో వేదికపైకి రాగానే ఒక్కసారిగా పరమానందానికి పోయిన యౌవనం తిరిగివచ్చినట్లయింది. ఆమెను రామాయణంలో ఏ పాత్రతో పోల్చాలా అన్న మీమాంసలో పడ్డాడాయన.

ఆమె గొంతు విప్పింది.

"అయాం లావణ్య. నాకు పెద్దలిచ్చిన ఆస్తి ఉంది. దేవుడిచ్చిన అందముంది.





మనిషిగా కృషి చేసి సంపాదించిన డిగ్రీలున్నాయి. ఆత్మవిశ్వాసముంది. వ్యక్తిత్వముంది. మోడలింగు చేశాను. అడ్వెంచర్సు చేశాను. కానీ నాకెప్పుడూ ఇంత సంతోషం కలగలేదు. కృష్ణమురళి ఆశయానికి నేను ఫ్లాట్. యువతలో ఎలాంటి అభిరుచులుండాలో యువత ఎటు నడవాలో శాసించగల ఈ మహోన్నతవ్యక్తి మన సమాజానికే బ్రైట్ స్పాట్. కృష్ణమురళికింకా పెళ్ళి కాలేదని నాకు తెలుసు. అందుకే ఈ పూలమాలను వరమాలగా తెచ్చాను. ఇది నా స్వయంవరం అంటూ చటుక్కున పూలమాలను కృష్ణమురళి మెడలో వేసింది.

ఒక్కసారిగా హాలంతా నిశ్శబ్దమైపోయింది. ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ, "వాటీజ్ దిస్ మిస్ లావణ్యా" అన్నాడు కృష్ణమురళి తన మెడలోని పూలమాలను తీసి పక్కన పెడుతూ.

"ఐ లవ్ యూ" అంది లావణ్య.

"బట్ ఐ డోంట్ లవ్ యూ" నొక్కించాడు కృష్ణమురళి.

"వై... వై... ఐ సే" అంది లావణ్య.

"ప్రశ్నలకందని అనుభూతి ప్రేమది" అన్నాడు కృష్ణమురళి.

లావణ్య సభికులవైపు తిరిగి, "సమాజంలో మంచి, చెడు కలిసి ఉంటాయి. చెడు మంచిని సవాలుచేస్తుంది. మంచి పురోగతితో బదులిస్తుంది. ఇదీ నేడు మనం తెలుసుకున్న విశేషం. చెడును నిరసించకుండా, మంచిని లొంగనివ్వకుండా ప్రపంచాన్ని ముందుకు నడిపిస్తున్న గొప్ప జీవిత సత్యమిది. ఈ సత్యాన్నింత గొప్పగా అరటిపండు వలిచినట్లుగా మనముందుంచే ప్రయత్నం చేసిన కృష్ణమురళిని నేను ఈ క్షణంలోనే ప్రేమించాను. అందచందాల్లో, ఐశ్వర్యంలో, ప్రతిభలో, ఆశయంలో అతడికి నేనేవిధంగానూ తీసిపోను. మేమిద్దరం జంటగా నడిస్తే అది సమాజానికెంతో మేలుచేస్తుంది. వేదికమీద పరమానందం గారూ, వేదికముందు శ్రేయోభిలాషులు మా జంటను ఆశీర్వదించాలని వేడుకుంటున్నాను" అంది.

సభలో చప్పట్లు మోగాయి శశాంక బృందం వైపునుంచి. క్రమంగా అవి అందరివైపూ పాకుతుంటే "ఇదేమి రభస?" అనుకున్నాడు తాతయ్య గుర్రుగా లావణ్యను చూస్తూ.

"స్టాపిట్... స్టాపిట్ ప్లీజ్" అంటూ అరిచాడు కృష్ణమురళి.

"ఐశ్వర్యం నాకు ప్రధానం కాదు. నా ఆశయాలకూ, అభిరుచులకూ తగిన అమ్మాయిని నేనెప్పుడో ఎన్నుకున్నాను. ఇంకా చెప్పాలంటే ఆ అమ్మాయి మీమధ్యనే ఉంది. ఆమెను చూసిన కళ్ళతో నేను వేరొకర్ని ప్రేమించలేను"

లావణ్య ముఖం ఎర్రబడింది. "నిండు సభలో నిలదీసి అడుగుతున్నాను. ఆ అమ్మాయెవరో చెప్పు. ఈ క్షణంలోనే నేనామెతో పోటీపడి ఆమె అల్పురాలని రుజువు చేస్తాను" అంది.

"నా అభీష్టం తెలుసుకోకుండా నువ్వైతే నా మెడలో వరమాల వేశావు కానీ ఆమె అభీష్టం తెలియకుండా నేనామె పేరైనా చెప్పను. ఇక పోటీపడడానికొస్తే నా దృష్టిలో నువ్వెప్పుడో ఓడిపోయావు. ఎలాగో చెప్పనా?" అన్నాడు కృష్ణమురళి.

"చెప్పు" అంది లావణ్య.

"ఆడదాని ముఖాన్ని చంద్రబింబంతో పోలుస్తారు. కారణం ఆమె ముఖంనుండి వెలువడే కాంతుల్లో అమృతాన్ని నింపుతాయామె పెదవులు. ఆ పెదవులు చిందించడంవల్లనే ఆడదాని చిరునవ్వుకు ప్రశాంతతతో కూడిన అద్భుత సమ్మోహనశక్తి ఏర్పడింది. ఆకాశానికి నీలాన్ని, ఆకులకు పచ్చదనాన్ని ఇచ్చినట్లు ఆడపిల్ల పెదవులకూ అపురూపమైన గులాబివర్ణాన్నిచ్చాడు భగవంతుడు. అంతటి అద్భుత సహజవర్ణానికి కృత్రిమమైన రంగులు పులిమితే పసిపిల్ల



వాడి మూతికి మీసాలు మొలిచినంత అసహ్యంగా ఉంటుంది నాకు. నాకేకాదు రసహృదయమున్న ఏ మనిషికైనా రంగులు పులిమిన పెదవులు జుగుప్సని కలిగిస్తాయని నా నమ్మకం. ఇంతకుమించి నీ గురించి నీకు ఏమీ చెప్పక్కర్లేదు"

అంత సూటిగా అతడు మాట్లాడగానే లావణ్యకు ఏం మాట్లాడాలో తెలియలేదు కాబోలు ఆమె విసవిసా నడుచుకుంటూ హాల్లోంచి వెళ్ళిపోయింది.

హాల్లో చాలామంది కళ్ళు అక్కడున్న ఆడపిల్లల పెదవులమీదకు మళ్ళాయి. అయితే చాలామంది ఆడపిల్లలు తమ పెదవులను ఒణీతోనో, పైట కొంగుతోనో, చున్నీతోనో కప్పుకున్నారు. పెదాలకు రంగులేసుకున్నవారిలో కొందరు ఇబ్బందిపడ్డారు. కొందరు మనసులో కృష్ణమురళిని తిట్టుకున్నారు. పెదాలకు రంగులేసుకోని అమ్మాయిలు మాత్రం గర్వంగా ఫీలయ్యారు. వాళ్ళలో శకుంతల కూడా ఉంది.

"అబ్బాయి బాగా సంప్రదాయం మనిషిలా ఉన్నాడు. శకుంతలకు చక్కగా నప్పుతాడు" అంది అమ్మమ్మ తాతయ్యతో.

"సంప్రదాయం బాగానే ఉందికానీ మరీ అంత మోటుగా చెప్పాల్సిందికాదు. ఎవరి అభిరుచులు వాళ్ళవి. చిన్నబుచ్చడం తప్పు" అన్నాడు తాతయ్య.

"మీరు సమర్థించకేం. ఎదురింటి విశాలాక్షిని ఇప్పటికీ మిర్రిమిర్రి చూస్తారు. ఆవిడేమో వయసు నలభైదాటినా ఇంకా పెదాలకు రంగులేస్తుంది. ఆ రంగులు మీకిష్టం కాబోలు" ఈసడించిందావిడ.

"అబ్బ ఇతరులను నొప్పించకూడదని నేనంటే నువ్విలా పెడర్థాలు తియ్యకు" అన్నాడు తాతయ్య.

"ఆ అమ్మాయి అడక్కుండా అతడి మెడలో వరమాల వెయ్యగాలేంది అతడంటే తప్పొచ్చిందా అయినా ఆ అబ్బాయి తన అభిప్రాయం చెప్పాడుకానీ అదే సరైందనలేదుకదా! నేనైతే అదే సరైన అభిప్రాయమని కూడా చెప్పి ఉండేదాన్ని" అంది అమ్మమ్మ.

ఈలోగా సభ ముగిసిపోయింది.

★ ★ ★

"లావణ్య ఎక్కడ? " అన్నాడు శశాంక కోపంగా.

"మనకంటే ఆ కృష్ణమురళి డబ్బెక్కువిచ్చినట్లున్నాడు. ఉన్నట్లుండి ప్లేటు మార్చేసింది" అన్నాడు భారవి సాలోచనగా.

"అసలు తను చెప్పాల్సిందేమిటి చెప్పిందేమిటి? ఇమేజ్ దింపడానికొచ్చి పెంచేసి వెళ్లిపోయింది. ఇదంతా ఎలా జరిగిందో నాకు తెలియడంలేదు" అన్నాడు దర్శకుడు.

"విత్తనంగోచరం. ఫలం అగోచరం" అన్నాడు కాళిదాసు.

"నిజమే... ఈ కృష్ణమురళి మనకు ఏకు మేకవుతున్నాడు. నా ప్రయత్నాలన్నీ అతడికే ఉపయోగపడుతున్నాయి. ఎలాగోలా అతణ్ణి రంగంనుంచి తప్పించాలి. లేకపోతే" అని ఏమనాలో తెలియక ఆగిపోయాడు శశాంక.

"ఇక ముసుగులో గుద్దులాట లాభం లేదు. నేరుగా అతణ్ని కలుసుకుని తాడో పేడో తేల్చుకోవడం మంచిది" అన్నాడు కాళిదాసు.

"అందువల్ల లాభముంటుందా? "

"ఉండొచ్చు ఎందుకంటే కాకతాళీయాలు బోలెడుండవు. నువ్వు శకుంతలను ప్రేమించి ఆమెకోసం పథకాలు వేస్తుంటే అదేవిధంగా కృష్ణమురళి కూడా చేయడం కాకతాళీయమని నేను నమ్మలేకపోతున్నాను. అతడి వ్యవహారానికి వేరే కారణముందని నాకు తోస్తోంది"

"అదేమై ఉండొచ్చు"

"అది ముఖాముఖీ అడిగి తెలుసుకోవడమే మంచిది" అన్నాడు కాళిదాసు.

★ ★ ★

"కృష్ణమురళిని వదుల్చుకుందుకు నాకో ఉపాయం తట్టింది. ఇకనుంచీ నేను లివ్





స్టిక్ వెయ్యడం మొదలెడతాను" అంది శకుంతల.

"వద్దు శకూ..." అంది దర్పణి.

"ఏం...?"

"ప్రకృతిలోంచి పుట్టిన మనిషి ప్రతిదానికీ ప్రకృతి పైనే ఆధారపడాలని నేననుకానీ కృష్ణమురళి మాటలు నాకు అక్షరసత్యాలని పించాయి. నిన్న నేను నా పెదాలను శుభ్రంచేసుకుని చాలాసేపు అద్దంముందు నిలబడ్డాను. నా అందం వెయ్యిరెట్లయిందనిపించింది. ఇంతకాలం కృత్రిమత్వంతో నా అందాన్ని పాడుచేసుకున్నాననిపించింది. ఇకమీదట నేను లిప్‌స్టిక్ వాడకూడదని నిర్ణయం తీసుకున్నాను" అంది దర్పణి.

శకుంతల ఆశ్చర్యంగా దర్పణివంక చూసింది.

"శకూ! నీ సౌందర్యానికి నేను ముగ్ధురాలినైపోతుంటాను. అందుక్కారణం నాకిప్పుడు తెలిసింది. అందం సహజమైంది. దానికి మెరుగులు దిద్దాలనుకుంటే తగ్గుతుందే తప్ప పెరగదు" అంది దర్పణి మళ్ళీ.

"నిన్నతడి మాటలు చాలా ప్రభావితం చేసినట్లున్నాయి" అంది శకుంతల.

"అవును. నేనిప్పుడతడికి ఆరాధకురాలినయ్యాను. తెలుసా?"

"కొంపదీసి అతణ్ణి ప్రేమించడంలేదు కదా..."

"ఛ... ప్రతి ఇష్టం ప్రేమగా మారిపోదు. అతడంటే నాకు గౌరవం. అంతే...! అయితే ఓ మాట చెప్పాలనిపిస్తోంది నాకు. నువ్వు రాజునుకాక కృష్ణమురళిని ప్రేమించడం మంచిది. నీ సహజసౌందర్యానికి అతడి సహజ ప్రతిభ జంటగా మారితే పర్యవసానం చాలా గొప్పగా ఉండొచ్చు. నా మాటల్ని తేలికగా కొట్టిపారెయ్యకు. బాగా ఆలోచించి ఓ నిర్ణయం తీసుకో" అంది దర్పణి.

"రామాయణమంతా విని రాముడికి సీతేమవుతుందన్నట్లుంది నీ సలహా. నేను నిన్నడిగిందేమిటి? రాజుతో నా ప్రేమ ఫలించేలా చేయమని. నువ్వేమో ఈరోజు కృష్ణమురళి అంటున్నావు. రేపు మరో జగన్మోహన్ అంటావు. అసలు ప్రియవ్రత అన్న పదానికి అర్థం తెలుసా నీకు?" అంది శకుంతల.

"నేను చెప్పేది కాస్త శ్రద్ధగా విను" అంది దర్పణి.

"చిన్నప్పుడు అమ్మానాన్నలతో పుస్తకాల షాపుకి వెళ్ళాను. అక్కడ ఓ బొమ్మల పుస్తకం నన్నాకర్షించింది. ఖరీదు కాస్త ఎక్కువని వాళ్ళు కొననన్నారు. నాకు పుస్తకాలు ప్రాణమనీ, అది కొంటే జీవితంలో ఇంకేమీ కొనమని అడగననీ మాటిచ్చాను. అప్పటికి జేబులో డబ్బుల్లేవనీ మర్నాటికి కొనిపెడతామని వాళ్ళు మాటిచ్చినా ఆగలేక మారాంచేశాను. ఎలాగో నన్నూరుకోబెట్టి ఓ బొమ్మల దుకాణానికి తీసుకుని వెళ్ళారు వాళ్ళు. అక్కడ నిలువెత్తు తెల్ల ఎలుగుబొమ్మ కనబడితే అది కావాలని మారాం చేశాను. పుస్తకం అక్కర్లేదని తేల్చి చెప్పేశాను. అప్పుడూ నన్ను వాళ్లెలాగో సముదాయించారు. తర్వాత ఓ బట్టలషాపుకి వెళ్ళాం. ఓ గౌను నాకు విపరీతంగా నచ్చేసింది. అది కొంటే ఇంకేమీ అడగనని మాటిచ్చాను. వాళ్ళు నాకది కొనిచ్చి నీకేం కావాలో నీకే తెలియదు. కానీ మాకు తెలుసు. అందుకే గౌను కొనేదాకా మిగతావి కొనలేదు అని చెప్పారు"

"అర్థమయిందిలే. కృష్ణమురళిని చూశాక రాజును మర్చిపోవాలని నువ్వంటావు. అయితే నీ కథలో ఓ విషయం చెప్పలేదు. నువ్వు గౌను కొనుక్కున్నాక ఒకటిరెండు సార్లు వేసి చూసుకుని మోజు తీరిపోయాక మళ్ళీ బొమ్మల పుస్తకాన్నీ, ఎలుగుబంటి బొమ్మనూ కోరుకున్నావాలేదా?" అంది శకుంతల.

"అంటే...?"

"నువ్వు బాల్యం గురించి మాట్లాడుతున్నావు. బాల్యం మనిషికి విచిత్రమైన దశ. అన్నీ కావాలనిపిస్తుంది. ఏదీ తృప్తినివ్వదు. మనసు చంచలంగా ఉంటుంది. ఇవన్నీ కలిసినా నిత్యం సంతోషమే. అందుకే ఏ మనిషీ బాల్యంనుంచి బయటపడాలనుకోడు. అయినా తప్పదు. బయటపడాలి. మనమూ బయటపడ్డాం"

"ఏం బయటపడడమో... నీ ప్రేమ బాల్యావస్థలో ఉందని నాకు అనిపిస్తోంది" అంది దర్పణి.

"ప్రేమకు అవస్థలుండవు. అవస్థలను బట్టే ప్రేమకు లక్ష్యాలు ఏర్పడతాయి. బాల్యావస్థలోని ప్రేమకు వివాహం లక్ష్యం కాకూడదని పెద్దలు బాల్యవివాహాలను నిరసించారు. బాల్యంలోంచి బయటపడినా ప్రేమ చంచలత్వానికి గురైతే ఆ మనిషి మానసికంగా బాల్యావస్థలోనే ఉన్నాడని అర్థం. బాల్యావస్థలను దాటినవారు ప్రియవ్రతలు కాక తప్పదు" అంది శకుంతల.

ఆమె గొంతులోని దృఢత్వానికి ఆశ్చర్యపడిన దర్పణి పరీక్షగా ఆమెను చూస్తే దృఢ నిశ్చయం ఆమె చూపుల్లోనూ కనపడింది. "ఇంత మృదుకోమల శరీరంలో ఈ దృఢత్వం ఎలా ఇమిడిందో?" అనుకుందామె.

కాసేపు వారు కృష్ణమురళి, రాజుల గురించి చర్చించారు. దర్పణి మాటల్లో కృష్ణమురళి ఏనుగు, రాజు ఎలుక.

"గత జన్మలో నేను ఎలుకనై ఉంటాను. నన్నింకా పూర్వజన్మ వాసనలు వీడలేదు" అంది శకుంతల.

"తొందరగా ఆ వాసనలనుంచి బయటపడటం మంచిది. మనిషి జన్మకు ఎలుక వాసన పడదు. అంతగా నువ్వు రాజును కోరుకుంటే ఆ ప్రేమను వచ్చే జన్మకు వాయిదా వేసుకుని ఈ జన్మకు కృష్ణమురళితో సరిపెట్టుకో ఏ జన్మకు తగ్గట్లు ఆ జన్మలో ఉండాలి" అంది దర్పణి

"ఈ జన్మకు రాజెందుకు తగడు?"

"ఎందుకంటే ఈ జన్మలో కృష్ణమురళి రాజుకంటే అన్నివిధాలా సుపీరియర్. ఆ విషయం నీ పెద్దలిప్పుడే గ్రహించారు. పెళ్ళయ్యాక నువ్వూ గ్రహిస్తావు"

"అప్పుడే నా పెళ్ళి కృష్ణమురళితో జరిపించేస్తున్నావు. నా పెళ్ళి నీ ఇష్టప్రకారం కాదు నా ఇష్టప్రకారం జరుగుతుంది" కటువుగా అంది శకుంతల.

"నీ పెళ్ళి నీ ఇష్టమూకాదు, నా ఇష్టమూ కాదు పెద్దల ఇష్టం. ఒప్పుకుంటావా, లేదా?"

"అంటే?"

"రాజుకోసం నువ్వు మీ వాళ్ళందర్నీ వదులుకుని వెళ్ళిపోడానికి సిద్ధంగా వున్నావా?"

"ఆడపిల్లకు పెళ్ళి అంటేనే అయినవాళ్ళను వదిలి వెళ్ళిపోవడంకదా...

"అవుననుకో... అది అయినవాళ్ళ ఇష్టంతో జరుగుతుంది. నీ విషయంలో అయినవాళ్ళ ఇష్టంవేరు"

"అది ఈరోజు మాట. రేపటికెలా మారుతుందో ఏం చెప్పగలం?"

శకుంతల పెద్దలను ఎదిరించదు. వారి మనసు నొప్పించదు. అయినా వారి అభీష్టానికి వ్యతిరేకంగా పెళ్ళి చేసుకోవాలనుకుంటోంది. అదెలా సాధ్యం?

దర్పణి సందేహానికి బదులుగా అన్నట్లు "పుట్టిన ప్రతిమనిషీ గిట్టేలోగా తను కోరిన శుభాన్నీ, సంతోషాన్నీ, సుఖాన్నీ అందుకుని తీరతాడట అందుకు నూరేళ్ళు పట్టినా'. ఈ సూక్తిని వంటబట్టించుకుంటే మనిషికి నిరుత్సాహమన్నదే ఉండదు" అంది శకుంతల.

"అయాం సారీ శకూ. ఇంతవరకూ నిన్ను తెగ నిరుత్సాహపరిచినట్లున్నాను" అంది దర్పణి.

"లేదు. నీ మాటలు నాకు ఉత్సాహాన్నే ఇచ్చాయి" అంది శకుంతల.

"అదెలా?"

"నాకు కృష్ణమురళి పట్ల ఆసక్తి లేదని





నొక్కించినకొద్దీ నీలో ఉత్సాహం పెరుగుతోంది. బహుశా నువ్వతణ్ణి ప్రేమించావనుకుంటాను. నీ ఉత్సాహం నా ఉత్సాహాన్ని పెంచుతోంది"

దర్పణి నవ్వి, "నీ ఆలోచనలు చాలా దూరం వెళ్ళాయికానీ అంత తొందరగా ఏ నిర్ణయానికీ రాకు. ప్రస్తుతం నేను నీ ప్రేమను గురించి ఆలోచిస్తున్నాను. నా ప్రేమకింకా నా మనసులో స్థానం ఏర్పడ లేదు" అంది.

"ఓ అయిదు నిమిషాలు టైము తీసుకున్నా ఫరవాలేదు కానీ నువ్వు కృష్ణమురళిని ప్రేమిస్తున్నావో లేదో చెప్పు" సూటిగా అడిగింది శకుంతల.

"నాకు టైమేం అక్కర్లేదు. అతడినో వేళ ప్రేమిస్తున్నా అంతగా పట్టించుకోవాల్సిన అవసరంలేదు. ఎందుకంటే నేను నీకులా ప్రియవ్రతను కానులే" అంది దర్పణి.

"ప్రచారం లేకగానీ మనదేశంలో ప్రతి ఆడదీ ఒక అనసూయ, అరుంధతి, సీత. అవకాశం రాకగానీ ప్రతి ఆడదీ ప్రియవ్రత కావాలనే అనుకుంటుంది. నా సంకల్పంలో బలం కాస్త ఎక్కువైందనుకో అది వేరే సంగతి. ఇక ఈ విషయం కట్టిపెడదాం. కృష్ణమురళిని రంగంలోంచి ఎలా తప్పించాలో చూడాలిప్పుడు మనం. అందుకు ఏం చేయాలో చెప్పు" అంది శకుంతల.

"నేనేం చెబుతాను? రాజునే అడుగుదాం" అంది దర్పణి.

★ ★ ★

రాజు, శకుంతల దర్పణి ఇంట్లో సమావేశమయ్యారు.

"నీకోసం ఏమైనా చెయ్యాలని ఉంది. కానీ ఏం చెయ్యగలను? " అన్నాడు రాజు శకుంతలతో.

"నీ సమస్య డబ్బే అయితే అది మా నాన్నగారిద్వారా నేనేర్పాటు చేస్తాను" అంది దర్పణి.

"నిజంగా" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"నేను అబద్ధం చెప్పేదానిలా కనిపిస్తున్నానా? " అంది దర్పణి.

"ఏమాత్రం లేదు. కానీ ఇలాంటి నిజం నాకు నిజమనిపించడం కష్టం. అయినవాడైన మామయ్యే నా భవిష్యత్తుని తన స్వార్ధానికి ముడిపెట్టాడు. నువ్వు నాకుగానీ, శకుంతలకుగానీ చుట్టానివికావు. మా కోసం ఇంత డబ్బు నిస్తానంటే ఆశ్చర్యంగా ఉంది. నువ్విద్దామనుకున్నా మీ అమ్మానాన్నా ఇవ్వనిస్తారా అని నా అనుమానం" అన్నాడు రాజు.

"అమ్మానాన్నా నాకు వరాలిచ్చే దేవుళ్ళు. వాళ్ళకూ నాకూ దేవుడికీ మనిషికీ ఉన్నంత దూరముంది. అందుకని వాళ్ళదగ్గర వరాలు తీసుకుని ఇతరులకు సాయపడగలను. అదీ నా జీవితం"

దర్పణి మాటలకు శకుంతల, రాజు కూడా చలించారు. రాజు అప్రయత్నంగా, "అయాం సారీ. నేను నీ మనసు నొప్పించినట్లున్నాను" అన్నాడు.

"నువ్వు నొప్పించావనను కానీ నా మనసు నొచ్చుకున్నమాట మాత్రం నిజం. నేను నీకుగానీ, శకుంతలకుగానీ చుట్టాన్ని కాదన్నావు అందుకు" అంది దర్పణి.

రాజు మాట్లాడలేదు.

"చుట్టమంటే ఎవరు? రక్తసంబంధీకుడా. రక్తసంబంధీకుల సంబంధీకుడా? రక్తసంబంధమంటే ఏమిటి? ఈ సృష్టికి ఆది దంపతులున్నారనుకుంటే మనుషులందరూ ఒకరికొకరు రక్తసంబంధీకులే కదా. నాకు అమ్మానాన్నా ఉన్నారు. వాళ్ళకు డబ్బు ముఖ్యం. సమాజంలో హోదా ముఖ్యం. ఆ డబ్బుకూ, హోదాకూ వారసులు ముఖ్యం. ఆ వారసుల సుఖసంతోషాలు ముఖ్యం. అయితే వారసుల సమక్షం ముఖ్యంకాదు. అందుకని అమ్మానాన్నా నాకు జన్మనిచ్చినా వాళ్ళు నాకు చుట్టాలు కాలేకపోయారు. శకుంతలతో పరిచయం కాగానే నాకో చుట్టం దొరికిందనిపించింది. ఆ శకుంతల

ద్వారా నువ్వు నా చుట్టానివనిపించింది"

"నువ్వు స్నేహాన్నీ, చుట్టరికాన్నీ కన్ఫ్యూజ్ చేస్తున్నావు" అంది శకుంతల.

"లేదు. స్నేహం వేరు, చుట్టరికం వేరు. స్నేహమంటే పరిచయం. పరస్పరం ఇష్టపడడం. స్నేహం అనుబంధంగా మారితే అది చుట్టరికం. నాకు స్నేహితులు, స్నేహితురాళ్ళు చాలామందే ఉన్నారు. కానీ చుట్టాలు మాత్రం మీరిద్దరే"

"నిన్ను మళ్ళీ నొప్పిస్తున్నాననుకోకపోతే ఓమాట చెప్పాలి" అన్నాడు రాజు.

"చెప్పు" అంది దర్పణి.

"అందడంవల్ల నీకు ద్రాక్షలు పుల్లనయ్యాయని నా అనుమానం. తల్లిదండ్రులు నీకు జన్మనిచ్చారు. డబ్బిచ్చారు. సదుపాయాలిచ్చారు. సమాజంలో హోదా ఇచ్చారు. స్వేచ్ఛనిచ్చారు. రక్షణనిచ్చారు. మనదేశంలో నాలాంటి ఎందరో తల్లిదండ్రుల నుంచి కోరుకునేదింతే. నీ అసంతృప్తికి అర్థంలేదని నాకనిపిస్తుంది. చుట్టాలలాంటి స్నేహితులు, స్నేహితులలాంటి చుట్టాలు గొప్ప అనుభూతినిస్తారని నాకు తోచదు. ఎందుకంటే నా విషయంలో ఆ ద్రాక్షలు అందడంవల్ల పుల్లనయ్యాయి" అన్నాడు రాజు.

"ఒకరికి ద్రాక్షలు అంది పుల్లన, వేరొకరికి ద్రాక్షలు అందక పుల్లన కావచ్చునని సామెత ఉందికదా. అందువల్ల ఎవరి అనుభూతులు వారివన్న గొప్ప నిజాన్ని నువ్వు గుర్తించాలి" అంది శకుంతల.

"ఏది ఏమైనా మనిషి కనీసావసరాల కోసమే శ్రమించాలి. ఉన్నవాడు లేనివాటి కోసం ఆక్రోశించడం నేను హర్షించను" అన్నాడు రాజు.

"పోనీ నేను నీ చుట్టాన్నంటే హర్షిస్తావు కదా" అంది దర్పణి.

"అయ్యో... ఎంతమాట? " అన్నాడు రాజు అప్రయత్నంగా.





"అయితే నీ డబ్బు సమస్య నేను పరిష్కరిస్తాను. మీ పెళ్ళి సమస్య నువ్వే పరిష్కరించుకోవాలి మరి" అంది దర్పణి.

"ఎలా? " అన్నాడు రాజు.

ముగ్గురూ చర్చల్లోపడ్డారు. ఆ చర్చ ఆఫ్ఘన్ యుద్ధంముందు అమెరికా సంప్రదింపులంత తీవ్రంగా ఉంది.

"ఒకపక్క కృష్ణమురళి, మరోపక్క శశాంక. ఇద్దరిలో కృష్ణమురళి అఖండుడిలాగున్నాడు. అతడితో వ్యవహారం కాస్త కష్టమే. నా ఆశలన్నీ శశాంకమీదే. అతగాణ్ని కృష్ణమురళి మీదకు ఉసిగొల్పితే పని జరగొచ్చుననిపిస్తోంది" అన్నాడు రాజు.

"ఒకరు ఉసిగొలిపేదేమిటి... ఇప్పటికే శశాంక రంగంలో ఉన్నాడు" అంది దర్పణి సాలోచనగా. ఆమె కనులు ఎవర్నీ చూడ్డం లేదు. ఆలోచన వాటిని కమ్ముకుంది.

"కురుక్షేత్ర యుద్ధంలో పాండవులంతటి వారిని విజయలక్ష్మి వరించిందంటే ఒక్కటే కారణం. శత్రుపక్షంలోనే భీష్మ, ద్రోణుల వంటి పాండవ పక్షపాతులుండడం. ఇప్పుడు శశాంక కృష్ణమురళిని ఢీకొంటే శకుంతల సాయం లభిస్తేచాలు. కృష్ణమురళి పని సరి" అన్నాడు రాజు.

"కానీ నేను కోరుకుంటున్నది శశాంక విజయంకాదు" అంది శకుంతల కాస్త నీరసంగా.

"మనం బ్రిటిష్ డిప్లొమసీని ఫాలో అవుతున్నాం. శశాంక, కృష్ణమురళిలో కాస్త బలహీనుడైన శశాంకను సమర్థించి కృష్ణమురళిని దెబ్బతీస్తాం. ఆ తర్వాత శశాంకను పడగొట్టడం మనకేం పెద్ద కష్టంకాదు"

"వెల్ సెడ్" అంది దర్పణి.

"అయితే ప్రొసీడ్" అంది శకుంతల రాజువంక చూస్తూ.

"ప్రొసీడవ్వాల్సింది నేనుకాదు. నువ్వు" అన్నాడు రాజు.

"నేనా? " అంది శకుంతల ఆశ్చర్యంగా.

"కురుక్షేత్ర సంగ్రామం మొదలైంది. ఇక సంజయ రాయబారాలకూ, కృష్ణ రాయబా

రాలకూ తావులేదు. అంతా ముఖాముఖీ. నువ్వు శశాంకను కలిశావంటే అతగాడు అయిపోతాడు. నువ్వేం చెబితే అది చేస్తాడు" అన్నాడు రాజు.

"అంతా బాగుంది. కానీ అతగాణ్ణి నేను కలిసేదెలా? కలిసినా మాట్లాడేదెలా? "

"నువ్వు నొచ్చుకోనంటే నేనో ఉపాయం చెబుతాను" అన్నాడు రాజు.

"ఊ" అంది శకుంతల కుతూహలంగా. కుతూహలం దర్పణిలోనూ రేగింది.

"భంగు పుచ్చుకో"

శకుంతల బుగ్గలు ఎరుపెక్కాయి. తల నేలకు రాలింది.

దర్పణి చటుక్కున, "ఈ సలహా నాకు చెంపపెట్టులా అనిపించింది" అంది.

"అయాం సారీ!" అన్నాడు రాజు.

"చుట్టాలమధ్య సారీలుండవు" అంది దర్పణి.

ముగ్గురూ మళ్ళీ ఆలోచనలో పడ్డారు. చివరికి రాజు "శశాంకకు భారవి, కాళిదాసు అని ఇద్దరు మిత్రులున్నారు. చాలా తెలివైనవాళ్ళు. మంచివాళ్లు. మిమ్మల్నిద్దర్నీ ఎక్కడ కలపాలో వాళ్ళే అయిడియా ఇస్తారు. అందులోనూ అది శశాంకకు అనుకూలంగానూ కృష్ణమురళికి ప్రతికూలంగానూ అంటే చెప్పనే అక్కర్లేదు. వాళ్లు ఎగిరి గంతేస్తారు" అన్నాడు.

"ఇది కురుక్షేత్రం. రాయబారాల దశ దాటిపోయాం. నేనిప్పుడే నేరుగా శశాంకకు ఫోను చేసి ఇక్కడకు రప్పిస్తాను" అంది దర్పణి. ఆమె మాటలు చేతలుగా మారడానికి ఎంతోసేపు పట్టలేదు. క్షణాలమీద ఫోన్ చేసి "అప్పుడే శశాంక బయల్దేరిపోయాడు" అంది.

దర్పణి దూకుడుకు శకుంతల తెల్లబోయింది. శశాంక వస్తే ఏం మాట్లాడాలా అని ఆలోచిస్తూండగా ఓ వ్యక్తి వచ్చాడు. అతణ్ణి చూసి అక్కడున్న ముగ్గురూ తెల్లబోగా అతడు సన్నగా నవ్వి "నన్ను గుర్తుపట్టే ఉంటారు. అయాం మురళి. కృష్ణమురళి!" అంటూ ఆడపిల్లలిద్దరికీ చేతులు జోడించి తర్వాత కరచాలనానికి రాజువైపుకు చేతిని సాచాడు. పట్టరాని ఆశ్చర్యంతోనే తడబడుతూ చేయిముందుకు సాచిన రాజుతో, "ఇక్కడకు శశాంక వస్తున్నట్లు తెలిసింది. అతడినిక్కడ కలిసే మహదవకాశాన్ని వినియోగించుకోవాలని వచ్చాను" అంటూ చేయి కలిపాడు.

రాజు, దర్పణి, శకుంతల ఒకరివంక ఒకరు అనుమానంగా చూసుకున్నారు.

దర్పణి శశాంకకు ఫోన్‌చేసి కొన్ని నిముషాలయిందేమో! అప్పుడే ఆ విషయం కృష్ణమురళికెలా చేరింది? శశాంక కంటే ముందుగానే అతడిక్కడికెలా వచ్చాడు?

కృష్ణమురళి వారి ముఖభావాలు చదివినట్లే ఉన్నాడు. జవాబుగా అన్నట్లు ముసిముసిగా నవ్వి "నేను కొత్త మిలెన్నియం మనిషిని. నా ప్రేమ కూడా కొత్త మిలెన్నియందే" అన్నాడు.

ఆ మాటలకు శకుంతల ఇబ్బందిగా తల వంచింది.

"అయాం సారీ శకుంతలా! నీకు పెళ్ళిచూపులంటేనే ఇష్టంలేదని నాకు తెలుసు. అయితే నేనూ నీలాంటివాణ్ణే. పవిత్రతకి ప్రాణమిస్తాను. పెళ్లయ్యేదాకా ప్రియురాలి బొమ్మ కూడా నాకు దేవతలంత పవిత్రమైనది. నేను నిన్ను ప్రేమిస్తున్న మాట నిజమే కానీ ఆ ప్రేమ నిన్నిబ్బంది పెట్టదు. అందుకు నా చూపులే సాక్షి. అనుమానముంటే నా కళ్లలోకి సూటిగా చూడు" అన్నాడు కృష్ణమురళి.

అప్రయత్నంగా శకుంతల అతడి చూపులతో తన చూపులు కలిపింది.

ఆ చూపులు...

శకుంతల ఆశ్చర్యపడింది.

నిజంగానే ఆ చూపులు భిన్నంగా ఉన్నాయి.

అమ్మ, అమ్మమ్మ, అత్తయ్య, మామయ్య,



నాన్న... వీళ్ళు తనను చూసే చూపులకూ ఈ చూపులకూ తేడా లేదు.

అతడలా చూస్తుంటే ఎంత హాయిగా ఉంది?

"ఎందుకో నీ ముఖం వడిలినట్లుంది. చన్నీళ్ల చిలకరించుకుని తువ్వాలుతో తుడుచుకుని వచ్చేవంటే ఎంతో ఫ్రెష్‌గా ఫీలవుతావు. నేను చెప్పినట్లు చెయ్యి" అన్నాడు కృష్ణమురళి.

శకుంతల చటుక్కున లోపలకు వెళ్ళింది.

"దాని ముఖం అప్పుడే నిద్రలేచినా ఫ్రెష్‌గానే ఉంటుంది. నీ మాటలు నమ్మి అది లోపలకు వెళ్ళింది. వస్తూనే నువ్వు దానితో అలా ఎందుకు మాట్లాడేవు?" అంది దర్పణి.

"నేను నా హిప్నోటిక్ పవర్ని టెస్టు చేసుకుందుకు వచ్చాను" అన్నాడు కృష్ణమురళి.

"అంటే?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"నాది నిజమైన ప్రేమ. ఆ ప్రేమ నా చూపుల్లో ఆకర్షణ శక్తిని నింపుతుంది. నా ప్రియురాలు నేనేం చెబితే అది చెయ్యడానికి ఒక్కసారి ఆమె నా కళ్లలోకి చూస్తే చాలు"

'కొయ్' అనుకుంది దర్పణి. కానీ అతడగ్గానే శకుంతల అతడి కళ్లలోకి చూడడం, ఆ వెంటనే అతడు చెప్పినట్లు చెయ్యడం ఆమెకు రవంత ఆశ్చర్యం కలిగించాయి.

"నీ పవరు టెస్టయిందా?" అన్నాడు రాజు.

"ఆమె నా చూపుల్ని రిసీవ్ చేసుకుంది. మా ప్రేమ ఫలించడం తథ్యం" అన్నాడు కృష్ణమురళి.

ఆ మాటకు రాజు కాస్త ఇబ్బంది పడ్డాడు.

"నీ ఇబ్బంది చూస్తుంటే నువ్వే ఆమెను ప్రేమిస్తున్నట్లు కనబడుతోంది. ఇప్పటికి శశాంక పోటీలో అవస్థ పడుతున్నాను. ఇంకెవరూ నాకు పోటీగా రావడానికి వీల్లేదు. అందులోనూ నేనిప్పుడు మీ సాయం కోరి వచ్చాను" అన్నాడు కృష్ణమురళి దర్పణినీ, రాజునూ ఉద్దేశించి.

"నేనిలా శశాంకకు ఫోన్ చెయ్యగానే అలా తెలుసుకున్నావు. ప్రియురాలిని హిప్నొటైజ్ చేసి లోపలకు పంపావు. నీకు ఇంకొకరి సాయమా?" అంది దర్పణి వ్యంగ్యంగా.

"బంగారపు పళ్ళానికైనా గోడ చేరుపుండాలి మరి" అన్నాడు కృష్ణమురళి కొంటెగా.

"ఇతగాణ్ణి మాటల్లో గెలవడం కష్టం" అనుకుంది దర్పణి.

"మేము నీకెలా సాయపడగలమో చెప్పు" అన్నాడు రాజు.

"ఇప్పుడు శశాంక వస్తాడుగా. అప్పుడతగాడికి చెప్పేయండి. శకుంతల నన్నే ప్రేమిస్తున్నదనీ అతడినింక వృథాగా ప్రయాసపడొద్దనీ" అన్నాడు కృష్ణమురళి.

"నీకు హిప్నోటిక్ పవర్ ఉందిగా అదుపయోగించి శశాంకను లొంగదీసుకో" అంది దర్పణి వ్యంగ్యంగా.

"ఆ పవరు పనిచేయాలంటే ఎదుటివాళ్లకూ నామీద ప్రేముండాలి. శశాంక నన్ను ప్రేమిస్తాడని అనుకోను" అన్నాడు కృష్ణమురళి నవ్వుతూ.

"అంతా ఉత్తది. నీకే పవరూ లేదు"

"నన్ను ప్రేమించడానికి ప్రయత్నించు. నా పవరు నీమీదే చూపిస్తాను" అన్నాడు కృష్ణమురళి.

దర్పణి తడబడింది. ఆమె తడబాటుకు నవ్వుతూ, "అయ్యో! ఉత్తినే తడబడ్డావు. నా పవరు పనిచేయాలంటే నాకూ నీమీద ప్రేముండాలిగా నా ప్రేమేమో శకుంతలది మరి" అన్నాడు కృష్ణమురళి.

దర్పణి అసంతృప్తిగా నవ్వింది. కృష్ణమురళి అది గమనించకుండా "నేను తలచుకుంటే శకుంతల చేతే నేననుకున్న మాటలు చెప్పించగలను. కానీ అలా చెయ్యను. ప్రేమకు సంబంధించినంతవరకూ ఆమె నోటివెంట వచ్చే ప్రతి మాటా ఆమెలోంచే సహజంగా పుట్టాలి. అసలు సిసలు ప్రేమి





కుడిలా ఆమె గురించి నేనాలోచించే విధాన మది" అన్నాడు.

అంతలో శకుంతల లోపల్నుంచి వచ్చింది. మరి కాసేపట్లోనే అక్కడికి శశాంక కూడా వచ్చాడు.

అప్పుడు వాతావరణంలో ఎక్కడా యుద్ధ చిహ్నాలు లేవు. అక్కడున్న వారందరూ ఒకరినొకరు స్నేహితుల్లా పలకరించుకున్నారు. కబుర్లు మొదలెట్టారు. ఆ కబుర్లలో టీవీ సీరియల్సు నుంచి దేశంలో నెలకొన్న అవినీతిదాకా దొర్లాయి. ఎక్కడా ప్రేమ లేదు.

"నన్ను దర్పణి ఎందుకు రమ్మందో మరి! ఇక్కడ శకుంతలతోపాటు కృష్ణమురళి కూడా సిద్ధమయ్యాడు" అనుకుంటున్నాడు శశాంక మనసులో.

కబుర్లు నడుస్తూనే ఉన్నాయి.

ఉన్నట్లుండి కృష్ణమురళి ముఖం గంభీరంగా అయిపోయింది. అతడు మాట్లాడ్డం మానేసాడు. అది గమనించిన శశాంక "ఏమయింది? " అన్నాడు.

"నువ్వైతే హీరోవి. నటించగలవు నాకు నటన రాదు" అన్నాడు కృష్ణమురళి.

"ఇప్పుడు నటన ఎందుకు? "

"అదే నాకూ అనిపించింది. ఇక నటన మానేస్తాను. సూటిగా విషయానికి వచ్చేద్దాం" అన్నాడు కృష్ణమురళి.

"ఏమిటి విషయం? "

"నేను శకుంతలను ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. నా పెళ్ళి ఆమెతో జరక్కపోతే నా ప్రాణం పోతుంది. శకుంతల ఇంట్లో వాళ్ళు నా ప్రేమనంగీకరించారు. శకుంతల తన వాళ్ళ మాట కాదనదు. కాబట్టి మా ప్రేమ ఫలించి తీరుతుంది. అయితే నువ్వు మా ప్రేమకు అడ్డు తగులుతున్నావు. అది నాకిష్టంలేదు. కాబట్టి అడ్డు తప్పించాలనుకున్నాను. అందంలో, ఐశ్వర్యంలో, తెలివిలో నిన్ను మించిన వాణ్ణి. ఒక్కసారి శకుంతలను చూడు. ఆ పైన నన్ను చూడు. అప్పుడు నిన్ను నువ్వు అద్దంలో చూసుకో. శకుంతలకు నేను మాత్రమే తగిన వాడినని నువ్వు గుర్తిస్తావు. నేనైతే ఈ విషయం ఎప్పుడో గుర్తించేశాను. అందుకే ఇక్కడకొచ్చాను. వీళ్ళు నా మాటల్ని మెచ్చుకున్నారు. సాఫీగా ఉన్న వ్యవహారాన్ని ఏ గొడవలూ లేకుండా సాగిపోనివ్వాలనుకున్నారు. దర్పణి నీకు ఫోన్ చేసింది. ఇక నేను నీకు చెప్పాల్సిందేమీ లేదు. అంతా ఆమే చెబుతుంది. మరి నాకు సెలవు. మనం మళ్ళీ కలుసుకోకూడదు. ఆఖరికి నా పెళ్ళిలో కూడా. అదే నీకు నా సందేశం" అన్నాడు కృష్ణమురళి.

శశాంక మాత్రమే కాదు. అక్కడున్న మొత్తం అంతా ఆ మాటలకు నివ్వెరబోయారు. కృష్ణమురళి నోటివెంట అలాంటి సందేశం అంత సూటిగా అప్పుడు వెలువడుతుందని ఎవ్వరూ అనుకోలేదు. వాళ్ళు షాకులోంచి తేరుకునేలాగా కృష్ణమురళి అక్కణ్ణుంచి నిష్క్రమించాడు.

"వాటీజ్ దిస్" అన్నాడు శశాంక షాకు నుంచి తేరుకోగానే.

మిగతా ముగ్గురూ మాట్లాడలేదు. వాళ్ళింకా షాకునుంచి తేరుకోలేదు.

"ప్లీజ్ స్పీకౌట్ వాటీజ్ దిస్" అన్నాడు శశాంక మళ్ళీ.

అప్పటికి మిగతా ముగ్గురూ షాక్‌నించి తేరుకున్నారు. ముఖముఖాలు చూసుకున్నారు. శశాంకను శ్రద్ధగా చూశారు. ఒక్కరూ నోరు విప్పలేదు.

"రాజూ- నువ్వు నా శత్రువుతో చేతులు కలిపావా? నీ నుంచి నేనిది ఊహించలేదు" అన్నాడు శశాంక.

"నో- ఇందులో నా హస్తమేమీ లేదు" అన్నాడు రాజు వెంటనే.

"అయితే హస్తం ఎవరిది? " అనుమానంగా దర్పణి వంక చూశాడు శశాంక.

"నేను నిన్ను ఫోన్లో పిలిస్తే నీకంటే

ముందుగా కృష్ణమురళి వచ్చాడు. ముందిది ఎలా జరిగిందో చెప్పు- నీ ఫోను ట్రాపవుతోందా? నీ ఫ్రెండ్సులో ఇన్ఫార్మర్లున్నారా? " బాగా తేరుకున్నాననడానికి సూచనగా ఎదురు దాడి చేసింది దర్పణి.

జరిగినదంతా అర్థం చేసుకుందుకు శశాంకకు కాసేపు పట్టింది. అప్పుడతడు, "ఈ కృష్ణమురళి అసాధ్యుడు. అతగాడికి చాలా పెద్ద నెట్ వర్కే ఉన్నట్లుంది" అన్నాడు.

"అవును. అతడు నీ ప్రతి కదలికనూ గమనిస్తున్నాడు. నువ్వు దెబ్బ తీద్దామనుకునేలోగా ఎదురు దెబ్బ తీస్తున్నాడు. ఈ విషయాన్ని నువ్వు సీరియస్‌గా తీసుకోవాలి" అంది దర్పణి.

శశాంక ఆలోచనలోపడ్డాడు.

"బాగా ఆలోచించు. మంచి అయిడియా చెప్పు. మా సాయం నీకే" అన్నాడు రాజు.

"కానీ కృష్ణమురళి మీరూ తన మనుషులని చెప్పి వెళ్లాడు" అనుమానంగా అన్నాడు శశాంక.

"శకుంతలకు తను మాత్రమే తగినవాడని నువ్వు గుర్తిస్తావని కూడా అతడన్నాడు. అది నువ్వు నమ్మితే మేమతడి మనుషులమని నువ్వు నమ్మవచ్చు" అంది దర్పణి.

ఆ మాట శశాంకకు తగలవలసినచోటే తగిలింది. వెంటనే "అయాం సారీ!" అన్నాడు.

"సారీలు కాదు మనక్కావలసింది. అర్జంటుగా ఏదో పథకం వెయ్యకపోతే అవతల శకుంతల తాతయ్య పెళ్ళికి ముహూర్తాలు పెట్టించేలా ఉన్నాడు. ఆ తర్వాత ఆకులు పట్టుకుని ప్రయోజనముండదు"

"ఆ విషయం నాకూ తెలుసు. కానీ ఏం చేయాలో పాలుపోవడంలేదు" అన్నాడు శశాంక.

"అలా నీరసపడిపోకూడదు. నీలో ఉత్సాహాన్ని పదిరెట్లు పెంచే ఓ మంచి కబురు చెబుతాను. దాంతో నీ బుర్రకు పదును పెట్టు" అంది దర్పణి.

"ఏమిటది? " కుతూహలంగా అడిగాడు శశాంక.

"శకుంతల కృష్ణమురళిని ప్రేమించడం లేదు. అతడితో పెళ్ళిని తప్పించే ఆపద్బాంధవుడికోసం ఎదురుచూస్తోంది" అంది దర్పణి.

శశాంక ముఖంలో ఒక్కసారిగా కోటి సూర్యుల కాంతులు ప్రతిఫలించి అక్కడున్న వారి కళ్లు జిగేల్మన్నాయి.

"నీకు చాలా చాలా థాంక్స్. ఇక బుర్రకు పదును పెడతాను" అంటూ లేచి నిలబడ్డాడతడు.

"గుర్తుంచుకో నువ్వే పథకం వేసినా నీకు శకుంతల సహకారం కూడా ఉంటుంది"

"వండ్రఫుల్. ఇక ఆగలేను. అర్జంటుగా బుర్రకు పదునుపెట్టాలి"

ఒక్కసారిగా అక్కడ కోటి సూర్యుల కాంతి మాయమై చీకట్లు కమ్ముకున్నాయి. అక్కడున్న ముగ్గురూ ఆ చీకట్లో చూడ్డానికి, అలవాటుపడ్డానికి కాసేప్పట్టింది.

"బుర్రకు పదునుపెడతానని అలా వెళ్లిపోయాడేమిటి? " అంది దర్పణి ఆశ్చర్యంగా.

"హీరోలంతే వాళ్ల బుర్ర వేరే ఎక్కడో ఉంటుంది" అన్నాడు రాజు.

★ ★ ★

శశాంక వెంటనే భారవి, కాళిదాసులను కలుసుకుని మొత్తం పరిస్థితిని వివరించి చెప్పాడు. ముగ్గురూ కాసేపు రకరకాలుగా ఆలోచించారు.

"నాకో అయిడియా వచ్చింది. కానీ చెప్పాలంటే భయంగా ఉంది. నువ్వు వినేలోగా అది కృష్ణమురళికి చేరిపోతుందని" అన్నాడు కాళిదాసు.

"మీరిద్దరూ నాకు నమ్మకస్థులే. నాకా అనుమానం లేదు" అన్నాడు శశాంక.

"అయితే కృష్ణమురళికి దర్పణి నీకు చేసిన ఫోను గురించి ఎలా తెలిసింది? అది తెలుసుకోవడం మనకు చాలా

ముఖ్యం" అన్నాడు కాళిదాసు.

"ఫోను వచ్చినపుడు మన చుట్టూ ఎవరున్నారు? వాళ్లలో ఎవరి దగ్గరైనా సెల్ ఫోనుందా? " స్వగతంలా అన్నాడు శశాంక.

"మన ఆలోచనలు ఇతరులచుట్టూ తిరక్కూడదు. అసలు ట్రిక్కంతా కృష్ణమురళిలోనే ఉన్నదని నా నమ్మకం. అతగాడికి అంతో ఇంతో హిప్నాటిజం, థాట్ రీడింగు తెలుసుననిపిస్తోంది" అన్నాడు భారవి.

"అయితే? "

"అతగాడు శకుంతలను దర్పణి ఇంట్లో కలుసుకోవాలనుకున్నాడు. వెళ్ళాడు. థాట్ రీడింగులో వాళ్ళ మనసుల్లోని ఆలోచనలు చదివి సమయానుకూలంగా మాట్లాడేడు" అన్నాడు భారవి.

"అది సాధ్యమా? "

"కంప్యూటర్లో ఈమెయిలు పంపడమంత సాధ్యం"

శశాంక ముఖంలో కలవరం. అంతలోనే కాస్త విసుగు "మరి మీకు అలాంటి థాట్ రీడింగు పవర్సు లేవా? " అన్నాడు.

"ఉండొచ్చు కానీ అవి పనిచేయడానికి అనంతమైన ప్రేమ కావాలి. కృష్ణమురళి శకుంతలను చాలా గొప్పగా ప్రేమిస్తున్నాడు"

"మీరూ ప్రేమించండి నన్ను! అప్పుడు వచ్చే పవర్సుని నాకోసం ఉపయోగించండి"

"ఆ విషయం అలాగుంచు. నేను చెప్పేది జాగ్రత్తగా విను. ఇది మళ్లీ మూడో కంటివాడికి తెలియకూడదు" అన్నాడు కాళిదాసు.

"ఊ" అన్నాడు శశాంక.

"శకుంతలకు ఉన్నట్లుండి జబ్బు చెయ్యాలి. ఆమె హాస్పిటల్లో చేరాలి. హాస్పిటల్ మనది. డాక్టరు మనవాడు. రిపోర్టు మనది. ఆ రిపోర్టులో శకుంతలకు మతికాస్త చెదిరిందనీ ఆమెకు విశ్రాంతి బాగా అవసరమనీ ఆమె మనసును ఏమాత్రం కష్టపెట్టకూడదనీ ఉంటుంది" అన్నాడు కాళిదాసు.

"అందువల్ల మనకేమిటి ప్రయోజనం? "

"శకుంతల మన పక్షమైతే అంతా మనకే ప్రయోజనం"

"అర్థంకాలేదు" అన్నాడు శశాంక.

"నాకు అర్థమైంది" అన్నాడు భారవి. "శకుంతలకు తన మనసులోని ప్రేమ గురించి నిర్భయంగా ఇంట్లో చెప్పగల అవకాశం వస్తుంది. మతిచెదిరింది కాబట్టి ఆమె ఎలా మాట్లాడ్డానికీ సంకోచించనవసరంలేదు. మతి చెదిరింది కాబట్టి ఆమెకేవుతుందోనన్న భయంతో ఆమె మాటలను పెద్దలు తేలికగా కొట్టిపారేయలేరు"

"బాగుంది..." అన్నాడు శశాంక.

"అంతేకాదు. మరో విషయముంది. శకుంతల తాతయ్యకు జాతకాల పిచ్చి ఉంది. కృష్ణమురళి జాతకానికీ శకుంతల అనారోగ్యానికీ ముడిపెట్టామంటే అతడి ప్రేమ కథకు అదే ముగింపు" అన్నాడు కాళిదాసు.

"వండ్రఫుల్... వండ్రఫుల్..." అన్నాడు శశాంక ఉత్సాహంగా.

భారవి సాలోచనగా "శకుంతలకు మతి చెదిరింది. ఆమెకు కృష్ణమురళి అంటే అయిష్టం. ఇంతా అంతా అని చెప్పలేని అయిష్టం. మరామె ఇష్టం ఎవరిమీద? " అన్నాడు.

"నామీద" అన్నాడు శశాంక వెంటనే.

"అని నువ్వంటే సరిపోతుందా? ఆమె అనాలి. ఆమె అనాలంటే ఆమె పేరున నువ్వు మరిన్ని గొప్ప పనులు చేయాలి. ఆ విషయం ఆమెకు తెలియాలి" అన్నాడు భారవి.

"నేను రెడీ" అన్నాడు శశాంక.

"నువ్వు రెడీ అయి ఏం లాభం? మేము రెడీ కావాలి" అన్నాడు భారవి.

అసహాయంగా వారిద్దరివంకా చూస్తూ! 'డబ్బు మనిషిని ఉన్నతాసనాలెక్కించినా అవసరం అతణ్ణి ఎంతకైనా దిగజార్చ కలదు కూడా' అనుకున్నాడతడు.

"నాకో అయిడియా వచ్చింది. ఏజీ ఆఫీసులో పేర్రాజు తెలుసా మీకు? " అన్నాడు

కాళిదాసు.

పేర్రాజు గురించి కాళిదాసు చెబితేగానీ వాళ్లకు తెలియలేదు.

పేర్రాజుకు నలభై ఏళ్లు. భార్య ముగ్గురు పిల్లలు. మొదటి ఇద్దరూ కూతుళ్లు.

పేర్రాజుకు ఆశలున్నాయి. ఆశయాలు న్నాయి. తెగింపుంది. సంకోచముంది. అన్నివిధాలా అతడు మధ్యతరగతి మనిషి.

పేర్రాజు పెద్దకూతురికి పద్ధెనిమిదేళ్లు. పిల్ల చాలా అందంగా ఉంటుంది కానీ చదు వురాలేదు. ఇటీవలే ఇంజనీరింగు పాసైన ఓ కుర్రాడామెను చూసి మోజుపడ్డాడు. పెళ్ళి మాటలకు పెద్దలను పంపాడు. తీరా చూస్తే ఆ కుర్రాడి తండ్రి పేర్రాజుకు హైస్కూల్లో క్లాస్‌మేటు. ఆయన కొన్నాళ్ల పాటు ప్రభుత్వోద్యోగం చేసి లాభసాటిగా లేదని రాజకీయాల్లోకి దిగాడు. చాలాకాలం ఒక్కపార్టీనే నమ్ముకుని ఎదుగూ బొదుగూ లేకుండా ఉండిపోయాక బుర్ర కాస్త పదునె క్కింది. గత మూడు సంవత్సరాల్లో నాలుగు పార్టీలు మారాడు. రెండు చేతులా సంపాదించాడు. ఆయనమీద యాభైదాకా అవినీతి ఆరోపణలున్నాయి.

తన గురించి అన్ని వివరాలు చెప్పి, "నేను మధ్యతరగతి అంచులు దాటివ చ్చాను. నాకు ఆశయాల భయంలేదు. సిగ్గులేదు. అవమానంలేదు. ప్రగతి అదొ క్కటే నాక్కావలసింది. నా బంధువర్గంలో నువ్వు ఇమడగలవా? " అన్నాడాయన.

అప్పుడు పేర్రాజు ఎంతో నిజాయితీగా, "మన దేశంలో అవినీతి పరులపట్ల నిరసన ఒక నాటకం. నిజానికి అవినీతి పరుల ప్రగతిని చూసి సామాన్యుడు పడేది అసూయ. నాకూ అవినీతిపట్ల మోజుంది. కానీ చేతకావడంలేదు. నోరు విడిచి అడగ లేను కానీ అడక్కుండా డబ్బిస్తే తీసుకుని కానిపనైనా చెయ్యాలనే ఉంటుంది. ఆఫీ సులో నా సీటు కనకవర్షం కురిపిస్తుందని అంతా అంటారు. నాకొక్క పైసా రాల లేదు. నాపై వాడు, కింద వాళ్లు, పక్కవాళ్లు అంతా నన్నుపయోగించుకుని బాగుపడిపో తున్నారు. నేను మాత్రం ఎదుగూ బొదుగూ లేకుండా గవర్నమెంటు రిలీజు చేసే డియ్యే ఇన్‌స్టాలుమెంట్సుతోనే ఆర్థిక ప్రగతిని ముడిపెట్టాను. మరెవరినైనా నా సీట్లో ఉంచితే అంతా వాడే కొట్టేస్తాడని భయపడి మా ఆఫీసులో ఎందరో కుమ్మక్కై నన్నాసీట్లోనే ఉంచేలా చేస్తు న్నారు. ఇదీ నా కథ. నీ బంధువర్గంలో నేను ఇమడగలననే అనుకుంటున్నాను" అన్నాడు.

కాబోయే వియ్యంకుడు నవ్వి "ఇలాంటి కథలే నన్ను కలవరపెడతాయి. నువ్వు మారాలి. మారితే తప్ప నా యింట్లో ఇమ డలేవు" అన్నాడు.

మారడం తనవల్లకాదని పేర్రాజుకు తెలుసు. ఆ మాట చెబితే పిల్లకు బంగారం లాంటి సంబంధం చెడిపోతుందని ఆయన భయం. అందుకని "నేనెలా మారాలి!" అన్నాడాయన.

"మనిషి తనంతట తను మారాలి తప్ప ఒకరు చెబితే మారడు. అయితే ఒక్కమాట చెప్పగలను. మనిషి విలువ సమర్థతతో కాక ముద్రతో ముడిపడివుంది. ఎముకల గూడులా వున్న పిరికివాణ్ణి చూపించి వాడో హత్య చేశాడని చెబితే చాలు చుట్టూ వున్న వారంతా వాడికి భయపడతారు. ఈ సూత్రాన్ని మనదేశ రాజకీయాల్లో మొట్ట మొదటగా అమలుపరచింది ఇందిరమ్మ. ఆమె ఎందరో అసమర్థులకి మంత్రి ముద్ర వేసి వారి విలువను పెంచింది. ఆ విలువ ఎంతగా పెరిగిందంటే అర్థాంతరంగా ఆమె పోయేసరికి నాయకులకే కరువొచ్చింది దేశంలో. అంతదూరం ఎందుకు, నా సంగతే తీసుకో. నేను కాని పనులు చాలా చేసినా ఎదుగూబొదుగూ లేదు. ఒక్కసారి నామీద అవినీతి ఆరోపణలు రాగానే అన్ని రాజకీయ పార్టీలూ నాకోసం ఎగబడ్డాయి.




ఇక నాకు తిరుగులేదు. నువ్వూ ఒక్కసారి ఏ అవినీతి కేసులోనో పట్టుబడి సస్పెండ య్యావంటే చాలు, నీ గ్లామరు పెరిగిపో తుంది. ఉద్యోగంలో ప్రమోషన్లమీద ప్రమో షన్లు. ఉద్యోగం వద్దనుకుంటే రాజకీయాలు నీకు ఘన స్వాగతం పలుకుతాయి. ఆలో చించుకో" అని తను చెప్పాల్సింది చెప్పి వెళ్లి పోయాడాయన.

ఆ సంబంధం తనవల్ల కాదని ఆశలు చంపేసుకున్నాడు పేర్రాజు. ఇంజనీరు కుర్రాడు మాత్రం ఇంకా ఆశ చావక తన పెళ్లిని వాయిదా వేస్తున్నాడు.

అదీ పేర్రాజు కథ. ఇప్పుడు నువ్వు పేర్రాజుకి లంచమిచ్చి అతడి లంచగొండితనాన్ని బైటపెట్టి సస్పెండు చేయించాలి. నువ్వు చేసిన పనివల్ల నీ ప్రాణాలకే ముప్పనీ అయినా నీ ప్రియురాలిని మెప్పించడం కోసం ఇదంతా చేస్తున్నారనీ ప్రచారమిద్దాం" అన్నాడు కాళిదాసు.

"యూ ఆర్ రియల్లీ జీనియస్" అన్నాడు శశాంక.

"నీకు నేను ఎప్పుడూ జీనియస్‌నే" అన్నాడు కాళిదాసు.

శశాంక మౌనంగా ఆ విసురును భరించాడు. మనసులో మాత్రం "భారవికున్న వినయం ఇతడికీ వుంటే ఎంతో బాగుండేది" అనుకున్నాడు.

అప్పటికప్పుడు భారవి, కాళిదాసు కథని తయారు చేస్తున్నారు. టెహల్కా టేపుల లెవెల్లో వుంది వారి పథకం.

★ ★ ★

భారవి, కాళిదాసుల పథకం శకుంతలకి చేరింది దర్పణి ద్వారా. ఆ ప్రకారం ఒకరోజున దర్పణి, శకుంతల దమయంతి అనే నడివయస్కురాలిని కలిశారు. ఆమె శశాంక బృందం ఏర్పాటు చేసిన నటి. లేడీ డాక్టరుగా, సైకాలజిస్టుగా నటించడానికి. శశాంక బృందం ఆమెని నియమించింది.

దర్పణి శకుంతలని దమయంతి వద్ద వదిలి శకుంతలా వాళ్లింటికి వెళ్లింది. అనవసరంగా కంగారుపడవద్దని ఇంట్లో వాళ్లం దర్నీ ముందుగా హెచ్చరించి "ఉన్నట్లుండి శకుంతల బజార్లో స్పృహ తప్పి పడిపోయింది. దగ్గర్లోని డాక్టరింట్లో తనని ఉంచి నేనిలా వచ్చాను" అంటూ నమ్మబలికింది.

తాతయ్య షాక్ తిన్నాడు. అమ్మమ్మ మాత్రం "డాక్టరంటే లేడీ డాక్టరేనా?" అంది.

"కాకపోతే ఒంటరిగా వదిలేసివస్తానా?" అంది దర్పణి చిన్నబుచ్చుకున్నట్లు నటిస్తూ.

"కంగారులో బుర్ర పనిచేయదులే అమ్మాయి. నా సంగతే చూడు - అమ్మాయి డాక్టరింట్లో వుందనగానే లేడీ డాక్టరవునో కాదో అని కంగారు పుట్టింది. ఆ కంగారులో దాని ఆరోగ్యం పాడైందన్న స్ఫురణే లేకుండాపోయింది. ఇప్పుడు కలుగుతోంది. అయ్యో శకూ, వున్నట్లుండి నీకేమయింది? నిక్షేపంలా వున్నదానివి నీకు స్పృహ తప్పడమేమిటే?" అంటూ శోకం మొదలుపెట్టింది అమ్మమ్మ.

"అయ్యో, కంగారుపడాల్సిందేమీలేదు. డాక్టరు దగ్గరికి వెళ్లగానే శకుంతల తేరుకుంది. అయినా ఎందుకైనా మంచిదని కొన్ని పరీక్షలు చేసి వంట్లో ఏ సమస్యా లేదంది డాక్టరు. కానీ..." అని ఆగింది దర్పణి.

ఒక్కరూ ఆమెని ఏమిటని ప్రశ్నించలేదు. చెప్పమన్నట్లు చూస్తున్నారు.

"ఎలా చెప్పాలో తెలియడంలేదు. దేనికో శకుంతల మనసులో అతిగా మథనపడుతోందట. అందువల్ల మెదడుకి వత్తిడి ఎక్కువై కాసేపు స్పృహ తప్పిందట. స్పృహ వచ్చినా ఇప్పుడు తన ప్రవర్తన మునుపటిలా వుండకపోవచ్చునట. అంతా దాని మనసు నొప్పించకుండా మసలుకోవాలట. దాని శరీరానికీ, మెదడుకీ కూడా విశ్రాంతి బాగా అవసరమంటారు డాక్టరు

గారు" ఆగింది దర్పణి.

"లేడీ డాక్టరే కదూ" అంది అమ్మమ్మ.

"అవును. రండి, నా కార్లో అక్కడికి వెడదాం" అంది దర్పణి.

కాసేపటికి కారు శకుంతల ఇంటిముందు బరువెక్కి దమయంతి ఇంటిముందు దింపు కుంది.

★ ★ ★

దమయంతి తన పాత్రని సమర్థవంతంగా నిర్వహించింది. ముఖ్యంగా తాతయ్యకి ఆమె మాటలమీద పూర్తి నమ్మకం కలిగింది.

"పిల్లని పువ్వుల్లో పెట్టి పెంచుతున్నాం. దాని మనసుకి అంత కష్టమేమొచ్చిందో అర్థం కాకుండా వుంది" అన్నాడాయన బాధగా.

"ఇప్పుడైనా సరైన జాగ్రత్తలు తీసుకుంటే ఏ సమస్యాలేదు. లేకుంటే మాత్రం ఆమెకి పిచ్చికూడా పట్టవచ్చు" అంది దమయంతి తాతయ్యతో నెమ్మదిగా. అప్పటికి శకుంతల కారెక్కేసింది. తాతయ్య మరోసారి దమయంతి వద్ద అన్ని జాగ్రత్తలూ తెలుసుకుని అప్పుడు తనూ బయటకి వచ్చి కారెక్కాడు.

కారులో దమయంతి గురించి చెబుతూ "ఆవిడ మా అమ్మకి మంచి ఫ్రెండు. పేరు పొందిన సైకాలజిస్టు. కానీ ఫిజీషియన్‌గా ప్రాక్టీసు పెట్టింది. డబ్బుకోసం చూసుకోకుండా రోగుల మనస్తత్వాలనిబట్టి చికిత్స చేస్తూంటుంది. పేదవాళ్లలో మంచి పేరుందామెకి. అసలు మనదేశంలో నూటికి తొంభైతొమ్మిదిమందికి రోగాలొచ్చినా తగ్గినా మాటల్తోనే అంటుందావిడ" అంది దర్పణి.

అమ్మమ్మ ఏదో అడగబోయింది కానీ ఎవరో చెయ్యెత్తి కారాపారు. దర్పణి విసుగ్గా బ్రేకు వేసింది.

మీసాల్లేకుండా గడ్డం మాత్రమే వున్న ఓ వ్యక్తి కారు సమీపించి విండో దగ్గరున్న తాతయ్యకి ఓ ఫొటో చూపించి "అయ్యా! ఈ కుర్రాడిల్లు ఎక్కడో చెప్పగలరా? " అన్నాడు.

తాతయ్య ఫొటోకేసి చూడకుండా "అడ్రసు కనుక్కునే పద్ధతి ఇది కాదు. ఇంకెవర్నైనా అడుగు" అన్నాడు విసుగ్గా.

"అయ్యో నా ఫొటో చూపిస్తే చాలు. ఈ ఊళ్లో ఎవరైనా నా ఇల్లు చూపిస్తారన్నాడే మావాడు" అన్నాడా వ్యక్తి అసంతృప్తిగా.

తాతయ్య కుతూహలంగా ఆ ఫొటో వంక చూసి ఉలిక్కిపడి, "అరే, శశాంక" అన్నాడు.

"అదే అదే మావాడి పేరు. అంటే మావాడు నిజమే చెప్పాడన్నమాట" అన్నాడా గెడ్డం మనిషి సంతోషంగా.

"మావాడు మావాడంటున్నావు. ఆ శశాంకే నీకేమౌతాడు? " అన్నాడు తాతయ్య.

"వాళ్ళమ్మ మెహరున్నీసా నాకు స్వయంగా చెల్లెలు. అంటే వాడు నా మేనల్లుడు. నేనీ ఊరు రావడం ఇదే కొత్త..." అన్నాడా గెడ్డం వ్యక్తి.

తాతయ్య ఉలిక్కిపడి, "మెహరున్నీసా కొడుకు పేరు శశాంక ఏమిటి? " అన్నాడు.

"తండ్రి హిందువైనపుడు తప్పదు కదా! అయినా నా చెల్లెలు వాణ్ణి చాంద్‌కా టుక్‌డా అని పిల్చుకుంటుంది. అంటే శశాంకయే కదా" అన్నాడు గెడ్డం మనిషి.

అప్పటికి శకుంతలకూ, దర్పణికీ ఆ మనిషి కృష్ణమురళి తరపున పనిచేస్తున్నాడని అర్థమైపోయింది. దర్పణి తనలోతాను నవ్వుకుందికానీ శకుంతల కిసుక్కున నవ్వింది. కార్లో దర్పణి తప్ప మిగతా అందరూ ఆమె వంక అనుమానంగా చూశారు.

"అలా చూస్తారేమిటి? " అంది శకుంతల విషయం అర్థమైనా.

తామెవ్వరికీ నవ్వురాని విషయానికి శకుంతలకు నవ్వొచ్చింది. ఆమెకు మతి చెదిరిందా?

అయితే తాతయ్యకు దమయంతి హెచ్చరిక గుర్తుండనే వుంది. ఎట్టి పరిస్థితు




ల్లోనూ శకుంతలకు తనకు మతి చెదిరిం దన్న అనుమానం రానివ్వకూడదు.

"నీ నవ్వు బాగుంటుంది కదమ్మా" అన్నాడు తాతయ్య.

మిగతా అందరూ కూడా " నీ నవ్వు బాగుంటుంది కదమ్మా" అన్నారు.

"నా అడ్రస్సు" అన్నాడు గెడ్డం వ్యక్తి.

శకుంతల మళ్ళీ కిసుక్కున నవ్వింది.

"వెళ్ళవయ్యా- అడ్రసు తెలుసుకుందుకు కారాపాలా? రోడ్డుమీద ఎవర్నడిగినా చెబు తారు శశాంక అడ్రసు..." అన్నాడు తాతయ్య.

"యా అల్లా- వాడి అడ్రసు తెలియకపోతే మెహరున్నీసాకు ముఖమెలా చూపిం చను? " అని నిట్టూర్చాడు గెడ్డం వ్యక్తి. కారు ముందుకు కదిలిపోయింది.

శకుంతల మళ్ళీ కిసుక్కున నవ్వింది. అయితే ఎవరూ ఆమెవంక చూడలేదు.

★ ★ ★

శకుంతలకు చాలా ఉత్సాహంగా ఉంది. ఆమె తాతయ్యకు తన మనసులో రాజుపట్ల వున్న ప్రేమ గురించి నిర్భయంగా చెప్పింది. తన ప్రేమ ఫలించేలా చూడమని తాతయ్యను వేడుకుంది.

తాతయ్య సందిగ్ధంలో పడ్డాడు. కాదంటే శకుంతలకు మతిపోవచ్చు. ఔనంటే తరత రాల సంప్రదాయం ఒక్కసారిగా మసిబారి పోతుంది.

"నువ్వు మన సంప్రదాయం గురించి కూడా కాస్త ఆలోచించాలమ్మా" అన్నాడు తాతయ్య.

"నాకు సంప్రదాయమంటే నమ్మకంలేదు. నువ్వంటేనే నమ్మకం. నువ్వు నా గురించి కాస్త ఆలోచించు తాతయ్యా" అంది శకుంతల.

తాతయ్యకి గుండెలో దేవినట్లయింది. 'అమ్మా! నువ్వు పిచ్చిదానివి కాకూడదు' అనుకున్నాడు మనసులో.

అలా రెండ్రోజులు గడిచాయి. అప్పుడు శశాంక వాళ్ళింటికి వచ్చాడు.

అప్పటికి పేర్రాజు సస్పెన్షన్ కథ పూర్తై పేపర్లో వచ్చేసింది. స్థానిక పత్రికల్లో శశాంక ఫొటోని బాక్సుకట్టి మరీ ప్రచురిం చారు.

దేశంలో అవినీతి ఎంతలా పెచ్చుమీరిపో యిందో తెలుసుకుందుకు పేర్రాజు ఉదంతం మచ్చుతునక అన్నాయి పత్రికలు. శశాంకని ఆకాశానికెత్తేశాయి.

శశాంక తాతయ్యని కలుసుకుని "నేనో అమ్మాయిని ప్రేమించాను. ఆ ప్రేమ నాచేత ఇన్ని మహత్తర కార్యాలు చేయి స్తోంది. అందుకే ఇక పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. నాకోసం మీ ఎరికలో మంచి సంబంధముంటే చెప్పండి" అన్నాడు.

"ప్రేమించానంటావు. సంబంధం చెప్ప మంటావు. నీ మాటలు చాలా తిరకాసుగా వున్నాయి"

"తిరకాసు కాదు, తడబాటు. మీ ముందు నాకు మాటలు సరిగ్గా రావు. ఈపాటికి నేను చెప్పదల్చుకున్నది మీకు అర్థమై వుండాలి. నేను ప్రేమిస్తున్నది మీ శకుంత లనే" అన్నాడు శశాంక.

"ఏమిటి, మెహరున్నీసా కొడుకు మా శకుంతలను ప్రేమించడమా? " అన్నాడు తాతయ్య. ఆయన గొంతులోని అసహనం ఆశ్చర్యాన్ని మింగేసింది.

"మెహరున్నీసా ఎవరు? " ఆశ్చర్యంగా అడిగాడు శశాంక.

"చిత్రంగా వుందే. మెహరున్నీసా పేరు నువ్వెప్పుడూ విన్నట్లు లేదూ? !"

"లేదు"

"ఎత్తుకున్నట్లూ, ముద్దులాడినట్లూ... ఏమీ గుర్తుకు రావడంలేదూ? "

"హరిహరీ!" అంటూ చెవులు మూసుకున్నాడు శశాంక. "తాతయ్యాగారూ! మీరు నా శీలాన్ని శంకిస్తున్నారా? " అన్నాడు శశాంక.

"నేను తల్లి గురించి మాట్లాడితే నువ్వు శీలమంటావేమిటి? " చిరాగ్గా అన్నాడు తాతయ్య.

ఇద్దరికీ ఒకరి మాటలు ఒకరికర్థం కావడానికి కాసేపట్టింది.

"ఇదంతా కృష్ణమురళి ఆడించిన నాటకం" అన్నాడు శశాంక వెంటనే.

"కృష్ణమురళా? " అన్నాడు తాతయ్య ఆశ్చర్యంగా.

"అవును. కృష్ణమురళి శకుంతలని ప్రేమిస్తున్నాడు. ఎలాగైనా పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడు. తెలివిగా మిమ్మల్ని బుట్టలో వేసుకున్నాడు" అన్నాడు శశాంక.

"అతగాడు స్వతహాగా గొప్పవాడు. అతడితో పోలిస్తే మేము మరీ అంత వున్నవాళ్లమేం కాదు. శకుంతల తల్లిదండ్రులు అమెరికాలో వున్నారు కాబట్టి కట్నకానుకలు బాగానే ఇచ్చుకోగలననుకో. అది వేరే సంగతి. కృష్ణమురళి మమ్మల్ని బుట్టలో వేసుకున్నాడంటే ఆశ్చర్యంగా వుంది. ఎందుకంటే అతడితో సంబంధం కుదిరిందని విన్నవాళ్లందరూ మేమే అతగాణ్ణి బుట్టలో వేసుకున్నామనుకుంటున్నారు" అన్నాడు తాతయ్య.

"ఒకవిధంగా మీరన్నది రైటే. కానీ మీరు డబ్బుకంటే గుణానికీ, సంప్రదాయానికీ ప్రాధాన్యమిచ్చే మనుషులు. ఆ విషయం కృష్ణమురళికి తెలుసు. మీకు జాతకాలంటే నమ్మకం ఎక్కువని తెలుసుకుని ఇటీవలే ఓ శాస్త్రులుగారిని కలుసుకుని తన జాతకం మార్పించుకున్నాడు" అన్నాడు శశాంక.

"జాతకం మార్పిడా, ఎందుకు? " అన్నాడు తాతయ్య.

"కృష్ణమురళి జాతకం ప్రకారం అతగాడు ప్రేమించిన పిల్ల వేరే ఇంకెవరినైనా ప్రేమిస్తుందట. అయినా లెక్కచేయక సంబంధం నిశ్చయం చేస్తే ఆ పిల్లకి మతిభ్రమిస్తుందట. ఆ జాతకం చూస్తే ఎవరూ అందులోనూ ముఖ్యంగా మీలాంటివారు అతడికి పిల్లనివ్వడానికి ఒప్పుకోరు. అందుకని ఓ శాస్త్రులుగార్ని కలుసుకుని తన జాతకాన్ని మీ మనవరాలి జాతకానికి అనుగుణంగా మార్పు చేయించాడు. నేను శకుంతల జాతకం వేయించడానికీ, దాంతో నా జాతకాన్ని సరిపోల్చడానికీ ఆ శాస్త్రులుగారి దగ్గరికి వెడితే ఆయన దగ్గర మొత్తం కథంతా బయటపడింది"

తాతయ్య ఆశ్చర్యంగా "నువ్వు చెప్పేదంతా వింతగా వుంది. అసలు నీకూ, అతడికీ మా శకుంతల జాతకమెలా వచ్చింది? " అన్నాడు.

"పెళ్లీడు ఆడపిల్ల జాతకాలెక్కడ దొరుకుతాయో అక్కణ్ణించే సంపాదించాం మేమిద్దరం. ఆయనకి జాతకాలు చూడ్డమే కానీ మార్చడం రాదని వేరే శాస్త్రులుగారి దగ్గరికి వెళ్లాం"

"నువ్వు చేప్పేదంతా నమ్మతగ్గదిగానే వుంది. కానీ మీ పద్ధతే చిత్రంగా వుంది. పెళ్లికి పెద్దలు మాట్లాడాలి. మీరేమో స్వయంగా జాతకాలు వెతుక్కుంటూ తిరుగుతున్నారు" అన్నాడు తాతయ్య.

"ఇది కొత్త మిలీనియం ప్రేమ తాతగారూ. ఇక్కడ పెద్దలకంటే జాతకాలు ముఖ్యం"

"సరే, ఇంతకీ నువ్వేమంటావు? "

"కృష్ణమురళికి తన బండారం ఏనాడైనా బయటపడుతుందనీ తెలుసు. నేనే తనకి ప్రత్యర్థిననీ తెలుసు. నన్ను రంగంనించి తప్పించడానికి అతగాడు ముందు జాగ్రత్తలు చాలా ఎక్కువగా తీసుకుంటున్నాడు. మీకు తెలుసో తెలీదో శకుంతలకి ఇంతకి ముందు రమేష్ అనే కుర్రాడితో సంబంధం కుదిరింది కదా. అది కూడా కృష్ణమురళే చెడగొట్టాడు. వాళ్లవాళ్లకి జాతకాలమీద నమ్మకం కలిగించాలని రమేష్‌ని అతగాడే చావగొట్టించాడు. కావాలంటే మీరు వాకబు చేయించవచ్చుకూడా" అన్నాడు శశాంక.

ఊహించని ఈ వివరాలకి తాతయ్య తెల్ల




బోయాడు.

"ఈపాటికి మీకు అర్థమైవుంటుంది. మెహరున్నీసా పాత్రని కృష్ణమురళే సృష్టించాడని. మనం మనం బంధువులం. మీకు సంప్రదాయం పట్టింపుందని అందరికీ తెలుసు. కృష్ణమురళి దాన్ని తన కుతంత్రానికి ఉపయోగించుకున్నాడు. మాది నిప్పులాంటి వంశం. మీరు ఊ అంటే అది రుజువు చేసుకోగలను. అయితే మీరు కృష్ణమురళిని పూర్తిగా దూరంగా వుంచాలి. తల చుకుంటే అతడు నా కులాన్నే మార్చేసి మిమ్మల్ని ఒప్పించగలడు"

తాతయ్య వింటున్నాడు. శశాంక చెప్పే ప్రతి మాటా ఆయన ఆశ్చర్యాన్ని పెంచుకుంటూ పోతోంది. అందువల్ల ఆయనకి నోట మాట రాక చెవులని తమ పని చేసుకుపోనిస్తున్నాడు.

"నేను శకుంతలని ప్రేమించాను. నా ప్రేమ తుచ్ఛమైనది కాదు. ఎంతో పవిత్రమైనది. ఆ ప్రేమ పుష్పానికి నేను ఎన్నో మంచిపనుల పుప్పొడిని అద్దుతున్నాను. అందువల్ల శకుంతలతోపాటు నాకు ఆమె కుటుంబసభ్యులందరూ ముఖ్యం. మీరే సంప్రదాయాన్ని నమ్ముతున్నారో దాన్ని మీ అంతలా నమ్మడమూ మీలో ఎవ్వరికీ రవంత కూడా ఇబ్బందినీ, అసంతృప్తినీ కలిగించకపోవడమూ నాకు ముఖ్యం. నా పెళ్ళి కంటే కూడా!"

"బాబూ- నువ్వు మంచి కుర్రాడివనుకున్నానుగానీ, ఇంత గొప్పవాడివని నేననుకోలేదు. నీ పరిచయం మా కుటుంబానికి అదృష్టంగా భావిస్తున్నాను. నీ మాటలు చాలావరకూ నిజమే. కృష్ణమురళి సంబంధం గురించి అనుకోగానే శకుంతల అదోలా మాట్లాడ్డం మొదలుపెట్టింది. అందుక్కారణమేమిటా అని ఇంటిల్లిపాదీ మధనపడిపోతున్నాం. ఇప్పుడు అసలు విషయం తెలిసింది. అంతా జాతక ప్రభావం..." అన్నాడు తాతయ్య. అప్పటికి ఆశ్చర్యం ప్రభావంనుంచి కొంత బయటపడి.

"విషయం మీకు చెప్పాను. నా గురించి మీరు కాస్త ఆలోచించి శకుంతల పెళ్ళి విషయంలో ఏ నిర్ణయమూ తీసుకోండి. ఆమె కారణజన్మురాలు. ఆమెను ఓ అప్రాచ్యుడికి కట్టబెడతారేమోనని నా భయం" అంటూ శశాంక లేచి నిలబడ్డాడు.

"అయ్యో... కాసేపు కూర్చో నాయనా..." అని తాతయ్య అంటూండగా అక్కడికి ఓ యువకుడు వచ్చి తాతయ్యకు నమస్కరించాడు. తాతయ్య అతడివంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"క్లారిస్ మీ పక్కింట్లోనే ఉండేదిటకదా. ఇప్పుడెక్కడుంటోందో చెప్పగలరా? " అన్నాడతడు.

"క్లారిస్ ఎవరు? " అన్నాడు తాతయ్య ఆశ్చర్యంగా.

"నా స్నేహితుడు శామ్యూల్ అక్క. శామ్యూలూ, క్లారిస్సూ ఒకరంటే ఒకరు ప్రాణంగా ఉండేవారు. అయితే శామ్యూల్ ప్రభ ప్రేమలో పడ్డాక వాళ్ళిద్దరూ ఆగర్భశత్రువుల్లా మారిపోయారు. ఎందుకంటే క్లారిస్‌కు ప్రభ గురించి తెలుసు. ప్రభ తిరుగుబోతు. అయినా మెహరున్నీసా కూతురికి మంచి బుద్ధులెలాగొస్తాయనుకుంటాం లెండి..." ఆగాడా యువకుడు.

ఈ గొడవంతా నాకెందుకూ అనబోయిన తాతయ్య మెహరున్నీసా పేరు విని ఉలిక్కిపడ్డాడు. ఆ యువకుణ్ణి మరి నాలుగు ప్రశ్నలు వేసి విషయం రాబట్టాడు. ప్రభ శశాంక చెల్లెలు.

"నీకు శశాంక తెలుసా? " అన్నాడు తాతయ్య.

"తెలియకేం వాడూ నేనూ చాలా క్లోజ్‌గా మూవయ్యేవాళ్ళం. కానీ ప్రభ నాకు లైనెయ్యడంతో సమస్య వచ్చింది. నేను ప్రవరాఖ్యుణ్ణి కాలేనుకానీ స్నేహితుడి చెల్లెలు కావడంతో ఇబ్బంది వచ్చింది. పోనీ ఆమెను పెళ్ళి చేసుకుందామా అంటే

మావాళ్లు క్రిస్టియన్ సంబంధం తప్ప ఒప్పుకోరు. నేనా విషయం ఖచ్చితంగా చెప్పేస్తే ఆ పిల్ల శామ్యూల్‌కు లైనేసింది. వాడామె మైకంలోపడి నా మాటలు నమ్మలేదు. ప్రభ గురించి శశాంకను హెచ్చరించాను. వాడు చెల్లెల్ని మందలించడానికి బదులు నాతో తెగతెంపులు చేసుకున్నాడు. అప్పుడర్థమైంది వాడి వంశానికి తిరుగుబోతుతనం తప్పు కాదని. ఇక క్లారిస్‌కు చెప్పాను. అక్కాతమ్ముళ్ళకు చెడింది. కొన్నాళ్ళుగా క్లారిస్ ఏమయిందో తెలియలేదు. ఈలోగా ప్రభ ఇరానీవాడైన బిన్‌లాడెన్‌తో సంబంధం పెట్టుకోవడం ప్రత్యక్షంగా చూశాక శామ్యూల్‌లో పశ్చాత్తాపం మొదలైంది. వాడి అక్కను నేను వెతుకుతున్నాను"

"బిన్‌లాడెనా?" ఆశ్చర్యంగా అన్నాడు తాతయ్య.

"అంటే ఆ లాడెన్ కాదులెండి. వీడు చాలా చచ్చుఘటం. తన పేరు ఇలాంటి వాడిక్కూడా ఉందని తెలిశాకే బిన్‌లాడెన్ సిగ్గుతో కుంచించుకుపోయి తోరాబురా గుహల్లో ఆత్మహత్య చేసుకున్నాడని కూడా ఓ కథ ఉంది. ఇంతకీ క్లారిస్ మీ పక్కింట్లో ఉండేదని విన్నాను. ఆమె ఇప్పుడెక్కడుందో చెబితే వెళ్ళి కలుసుకుని విషయమంతా చెప్పి ఆమెనూ తమ్ముణ్ణీ కలుపుతాను..." అన్నాడా యువకుడు.

"నీ పేరేమిటి బాబూ" అన్నాడు తాతయ్య.

రాబిన్సన్..."

"క్లారిస్ నీకు ఎదురుగానే ఉంది" అంటూ శశాంకను చూపించాడు తాతయ్య.

"ఇతగాడు... ఇతగాడు క్లారిస్సేమిటి?" అన్నాడు రాబిన్సన్.

"పోనీ... క్లారిస్ కాకపోతే శశాంక..." అన్నాడు తాతయ్య.

శశాంక పేరు విని రాబిన్సన్ ఉలిక్కిపడ్డాడు.





తాతయ్య సమయోచిత చమత్కారాన్ని మనసులోనే అభినందించుకుని- "ఎస్- అయామ్ శశాంక" అన్నాడు శశాంక.

"నువ్వు శశాంకవా? నేను చెబుతున్న శశాంకవి నువ్వు కాదు..." అన్నాడు రాబిన్సన్ తడబడుతూ.

"వెళ్ళి ఆ విషయం కృష్ణమురళికి చెప్పు" అన్నాడు శశాంక.

"కృష్ణమురళి... మీకెలా తెలుసు?" ఆ యువకుడు తడబడ్డాడు.

"కృష్ణమురళిని అడిగి తెలుసుకో వెళ్ళు!" అన్నాడు శశాంక.

రాబిన్సన్ మారుమాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అప్పుడు శశాంక ఏదో చెప్పబోగా "నువ్వింకేం చెప్పక్కర్లేదు. విషయమంతా నాకర్థమైంది" అన్నాడు తాతయ్య.

"అయితే నేను సెలవు తీసుకుంటాను. గుజరాత్ భూకంపం తర్వాత దేశదిమ్మరులైపోయిన కొందరికి గుప్తదానాలు చేసే కార్యక్రమముంది" అంటూ శశాంక అక్కణ్ణించి కదిలాడు.

★ ★ ★

"నువ్వు శశాంకను పెళ్ళి చేసుకోవాలి" అన్నాడు తాతయ్య.

శకుంతల ఆయనవంక గుర్రుగా చూసింది.

"చిన్నప్పట్నించీ నిన్ను మీ అమ్మ నా దగ్గరెందుకు వదిలేసిందో తెలుసా? నువ్వు నా సంప్రదాయంలో పెరగాలని. అది నీకు తెలుసుకదా..."

"సంప్రదాయమంటే ఏమిటి తాతయ్యా?"

"సంప్రదాయమంటే- పెళ్ళి విషయంలో పిల్లలు పెద్దల మాట మన్నించడం..."

"నా పెళ్ళి విషయంలో నీమాట ఏమిటి?"

"నువ్వు మనవాళ్ళ కుర్రాణ్ణి, మంచి బుద్ధిమంతుణ్ణి పెళ్ళి చేసుకోవాలి"

"రాజు మనవాళ్ళ కుర్రాడు. మంచివాడు, బుద్ధిమంతుడు"

"కానీ శశాంకలో ఇంకా గొప్ప గుణాలున్నాయి. అతడికి డబ్బు కూడా ఉంది"

"సంప్రదాయమంటే డబ్బుకు విలువనివ్వడమా తాతయ్యా" అంది శకుంతల.

తాతయ్య తడబడ్డాడు.

"తాతయ్యా... నువ్వు చెప్పేదైపోయింది. ఇక నేను చెప్పేది నువ్వు వినాలి" అంది శకుంతల.

"నువ్వనుకునే సంప్రదాయంలో స్థిరత్వం లేదు. అందుక్కారణం అది ప్రేమకు విలువనివ్వలేదు. నేను ఒక్కసారి రాజు అన్నాను. ఇప్పుడు రాజు అంటున్నాను. ఎప్పటికీ రాజు అంటూనే ఉంటాను. నా ప్రేమను గౌరవించి నీ సంప్రదాయం విలువ పెంచుకో తాతయ్యా" అంది శకుంతల.

"నీకు భంగు మత్తులో పుట్టింది రాజు మీద ప్రేమ. అందుకే నేనా ప్రేమకు విలువనివ్వడంలేదు" అన్నాడు తాతయ్య.

"బురదలో పుట్టిందని తామరపువ్వుకు పూజార్హత పోలేదుకదా"

"వెధవ పోలికలు చెప్పకు. రాజును మరిచిపో"

"ఒక బాణం ఒకమాట అది రాముడి సిద్ధాంతం. అందుకాయన్ను దేవుణ్ణి చేసి పూజిస్తున్నాం. నా ప్రేమ కూడా అంతే కదా. గౌరవించవేం" అంది శకుంతల.

తాతయ్య ఆమెకప్పుడు పురాణ సారాంశం వివరించాడు.

హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడేం కోరినా ఇస్తానన్నప్పుడు షరతులు పెట్టలేదు. ఆయన మాతంగ కన్యలను పెళ్ళాడమంటే మాత్రం అందుకు ప్రతిగా మరేదైనా కోరుకోమన్నాడు. అంటే మాట తప్పినట్లే కదా.

"హరిశ్చంద్రుడు ప్రజాక్షేమమే ధ్యేయంగా రాజ్యాన్ని పాలిస్తానని వాగ్దానం చేసి పట్టాభిషిక్తుడయ్యాడు. ఆగ్రహానికీ, అసహనానికీ మారుపేరైన విశ్వామిత్రుడికి తన రాజ్యం అప్పచెప్పి వెళ్ళాడు. అతడు ప్రజాక్షేమాన్ని విస్మరించి మాట తప్పినట్లేకదా.

హరిశ్చంద్రుడు నాతిచరామి అని ప్రమాణంచేసి చంద్రమతిని పెళ్ళాడాడు. అనాలోచితంగా చేసిన అప్పుకోసం ఆమెను కాలకౌశికుడికి అమ్మాడు. మాట తప్పినట్లేకదా

తన పరిస్థితి తెలుసుకోకుండా విశ్వామిత్రుడికి పెద్దమొత్తం దానంగా ఇవ్వడానికి బాకీ ఉన్నట్లు ఒప్పుకున్నాడు. తన వెంటపడ్డ నక్షత్రకుడికి ఆ బాకీ మొత్తం చెల్లించే ఉపాయం అతడివద్ద లేదు. దేవతలు సాయపడకపోతే తన బాకీనతడు తీర్చలేకపోయేవాడు. లేకుంటే అతడు కోరినంత పెద్దమొత్తాలకు మనుషులనెవరు కొనుక్కుంటారు? అనాలోచితంగా మాట ఇచ్చి అది నిలబెట్టుకునేందుకు కేవలం దైవశక్తుల మీద ఆధారపడితే ఒకవిధంగా అదీ మాట తప్పినట్లే. ఎన్నికల ముందు చేసిన ప్రమాణాలు నిలబెట్టుకోలేక పొరుగుదేశంతో యుద్ధానికి కాలుదువ్వి విషయాన్ని దారి మళ్ళించే రాజకీయ నేతలకూ, హరిశ్చంద్రుడికీ తేడా ఏముంటుంది.

ఇదంతా చెప్పి, "హరిశ్చంద్రుడు నిస్సందేహంగా గొప్పవాడు. ఎందుకంటే సత్యసంధతను పాటించడానికతడు కష్టాలుపడ్డాడు. నిస్వార్థతకు ఉదాహరణగా నిలిచాడు. కాబట్టి ఎంచుకున్న మార్గాన్ని గమనించాలి తప్ప సాహిత్యార్థాలు తీయకూడదు. కాబట్టి నీ మనసులో ఏర్పడ్డ ప్రియవ్రతాభావాన్ని విడిచిపెట్టు. పతివ్రతవు కా. చాలు. సంప్రదాయం హర్షిస్తుంది" అన్నాడు తాతయ్య.

"తాతయ్యా! హరిశ్చంద్రుడి కథను సత్యసంధతకు వ్యతిరేకంగా కూడా ఎలా ఉపయోగించుకోవచ్చో నువ్వు చూశావు. నువ్వెన్ని చెప్పినా హరిశ్చంద్రుడు గుర్తున్నంతకాలమూ సత్యమూ గుర్తుంటుంది. సత్యానిదీ ఆయనదీ అవినాభావసంబంధం" అంది శకుంతల.

"అయ్యో... నేను చెప్పేదీ అదే. ఈ శతాబ్దంలో మనం హరిశ్చంద్రుణ్ణి కూడా ఐన్‌స్టీన్ పద్ధతిలో ఆలోచించాలి. ఈ ప్రపంచంలో ఏ స్వభావపు ఉనికి అయినా,

స్వరూపమైనా, వర్ణన అయినా పోలికమీ దనే ఆధారపడి ఉంది. హరిశ్చంద్రుడంటేనే నిజం కాదు. ఈ ప్రపంచంలోని తక్కిన మానవులందరితోనూ పోలిస్తేనే అతడు సత్యసంధుడు. అతణ్ణి మాత్రమే తీసుకుంటే కాదు" అన్నాడు తాతయ్య.

"ఇది నీ థియర్ ఆఫ్ రెలెటివిటీ. నా థియరీ ఆఫ్ రెలెటివిటీ కూడా విను. తండ్రిమాటను శిరసావహించడం మన సంప్రదాయం. కానీ ప్రహ్లాదుడు విష్ణుభక్తి విషయంలో ఆ సంప్రదాయానికి ఎదురుతిరిగి అందరికీ పూజ్యుడైనాడు. ఆ ప్రహ్లాదుడే నా ఆదర్శం. రాజు నాకు విష్ణువు. ప్రేమ నా భక్తి"

తాతయ్య ఆశ్చర్యంగా ఆమెను చూస్తూ, "దీనికి మతిచెదిరి ఇంత తెలివి పుట్టుకొచ్చిందా లేక ప్రేమే దీనిలో ఇంత తెలివిని నింపిందా? " అనుకున్నాడు.

"చెప్పు తాతయ్యా. థియరీ ఆఫ్ రెలెటివిటీ నా ప్రేమను సమర్థిస్తోందికదా"

"థియరీలు పక్కనపెట్టి నీ ప్రేమను మేము సమర్థించకపోతే ఏం చేస్తావో చెప్పు" అన్నాడు తాతయ్య.

"ఏం చేస్తానని అనుకుంటున్నావు? " అంది శకుంతల.

"నువ్వు నీ పెద్దల్ని నమ్ముతావు. వారి నిర్ణయానికి తల వంచుతావు. జీవితంలో సుఖపడతావు. జీవితాంతం మా నిర్ణయాన్ని అభినందిస్తావు" అన్నాడు తాతయ్య.

"అది నా సంగతి. మరి నీ సంగతేమిటి? "

"నీ సంతోషమే మా సంతోషంకదా"

"ఏమో మొన్న రమేష్‌ది బంగారంలాంటి సంబంధం అన్నావు. తప్పిపోతే మంచి పనైందన్నావు. నిన్న కృష్ణమురళిలాంటి కుర్రాడుండడన్నావు. అతడు మోసగాడని తెలుసుకున్నావు. ఈరోజు శశాంక అంతటి గొప్పవాడు లేడన్నావు. నన్ను నీ నిర్ణయానికి తల వంచమంటున్నావు. కానీ రేపు ఏమంటావో నీకు తెలిశాక నీ తల వంగిపోవచ్చు. అప్పుడు తలెత్తే అవకాశం నాకూ రాదు" అంది శకుంతల.

తాతయ్యకు కాస్త కోపం వచ్చింది. "నువ్వెన్ని చెప్పు. మా నిర్ణయం సరైనదేనని నేనంటాను. దీనికి తల వంచడంలోనే నీ భవిష్యత్తుకు బంగారుబాట పడుతుందంటాను. నీ ప్రేమ అర్థంలేనిదంటాను. ఈ వేళే మీ పెళ్ళికి ముహూర్తాలు పెట్టించేస్తాను. ఇప్పుడు చెప్పు ఏం చేస్తావ్? " అన్నాడు కటువుగా.

శకుంతల నిర్భయంగా "గత సెప్టెంబరు 11న ఒసామా బిన్‌లాడెన్ అమెరికాను సరిగ్గా ఇదే ప్రశ్న అడిగాడు. సమాధానం నీకు తెలుసుగా" అంది.

తాతయ్య ఉలిక్కిపడ్డాడు.

కాసేపు మౌనంగా శకుంతల వంక చూశాడు. ఆమె కళ్ళలోని దృఢనిశ్చయాన్ని చదివాడు. తర్వాత నెమ్మదిగా, "పోలిక వచ్చింది కాబట్టి చెబుతున్నాను. అటు ఒసామాకైనా, ఇటు అమెరికాకైనా, అటు తీవ్రవాదానికైనా ఇటు యుద్ధానికైనా బోలెడు టైము వచ్చింది. నీకుగానీ నాకుగానీ అంత టైముండదు. కాబట్టి అంతా సాఫీగా జరిగిపోతుంది" అన్నాడు.

శకుంతల నవ్వింది. ఆ నవ్వులో సమాధానముంది. అది తాతయ్యకు అర్థమైంది.

"నువ్వేం చేస్తావో నాకు తెలియదు. నేను మాత్రం నువ్వు శశాంకను పెళ్ళి చేసుకోకపోతే చచ్చిపోతాను. రాజు కావాలో నేను కావాలో నువ్వు తేల్చుకోవాలి" అన్నాడు తాతయ్య.

"ఈ విషయంలో నాకు రెండు అభిప్రాయాలంటూ లేవు. నాకు నువ్వేకావాలి. ఎటొచ్చీ రాజును కాదంటే నాకు పెళ్ళేవద్దు" అంది శకుంతల.

తాతయ్య అందుకూ ఒప్పుకోలేదు. ఆమె





శశాంకను పెళ్ళి చేసుకోకుంటే కూడా తను చచ్చిపోతానన్నాడు.

"బెదిరింపు నీ ఒక్కడి స్వంతమే కాదు చస్తానని నేనూ అనగలను" అంది శకుంతల.

"కానీ ముందు నేననేశానుకదా. నీకా అవకాశంలేదు. నువ్వు చావాలనుకున్నా నా తర్వాతనే. మరి నీ నిర్ణయం చెప్పు" అన్నాడు తాతయ్య.

శకుంతల కాసేపు మౌనంగా చూసింది. ఆయన కళ్ళలోని దృఢనిశ్చయాన్ని చదివింది. తర్వాత నెమ్మదిగా, "తాతయ్యా! నువ్వు నా ఆరోప్రాణం. కాబట్టి నీ నిర్ణయానికి తల వంచుతున్నాను. శశాంకతో పెళ్ళికి ఒప్పుకుంటున్నాను" అంది.

కాసేపు తాతయ్యకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు. అంత సులభంగా ఆమె తన దారికి వచ్చినందుకాయన మురిసిపోయాడు. అయితే ఆ అంగీకారం వెనుక మోసంకానీ లేదుకదా అన్న అనుమానం కూడా ఆయనకు కలిగింది.

"నీకా అనుమానం వద్దు తాతయ్యా. నేను నిజంగా మనస్ఫూర్తిగా నీ నిర్ణయానికి తల వంచుతున్నాను" అంది శకుంతల.

"ఉన్నట్లుండి నీ మనసిలా మారిందంటే నమ్మడం కష్టంగా ఉంది నాకు"

"అవును. అన్నట్లు నేను నీకు నా షరతు చెప్పలేదుకదూ" అంది శకుంతల.

"షరతా? " అనుమానంగా అడిగాడు తాతయ్య.

"భయపడకు. చాలా న్యాయమైన షరతు నాది"

"ఏమిటది? "

"నా పెళ్ళి విషయంలో నిర్ణయానికి నీకిది ఆఖరి అవకాశం. ఒకవేళ శశాంకతో సంబంధం చెడిపోతే నువ్వు నా నిర్ణయాన్ని కాదనకూడదు" అంది శకుంతల.

తాతయ్య తేలిగ్గా నిట్టూర్చి "హమ్మయ్య. ఇంకా ఏమిటో అనుకున్నాను" అన్నాడు.

"అప్పుడే మురిసిపోకు తాతయ్యా. నీకు నా ప్రేమబలం తెలియడంలేదు. హరిశ్చంద్రుడి బాకీ తీరడంకోసం కాలకౌశికుడూ, వీరబాహుడూ తరలివచ్చి సామాన్యుడి ఊహకందనంత డబ్బిచ్చి మనుషుల్ని కొన్నారని నువ్వేకదా చెప్పావు. నా విషయంలోనూ అదే జరిగి శశాంక సంబంధం చెడిపోతుంది. అది నా నమ్మకం" అంది శకుంతల.

ఆమె నమ్మకం తాతయ్యకు సవాలులా వినిపించింది.

★ ★ ★

శకుంతల పెళ్ళి గురించి ఇంట్లో కూడా ఇంకెవరితోనూ మాట్లాడలేదు తాతయ్య. ఆ ఇంట్లో తన మాటకెదురుండదని ఆయనకు తెలుసు. ఇప్పుడు శకుంతల కూడా పచ్చజెండా ఊపింది. ఆలస్యం అమృతం విషమని ఆయన ఇంటి పురోహితుడు అవధాని ఇంటికి వెళ్ళాడు. శశాంక, శకుంతలల జాతకాలు చూపించాడు.

సుమారు అరగంటసేపు లెక్కలు వేశాడు అవధాని.

"అబ్బాయీ, అమ్మాయీ ఒకరికోసం ఒకరు పుట్టారు" అన్నాడు అవధాని.

"అయితే వీలైనంత త్వరగా మంచి ముహూర్తాలు చూడండి" అన్నాడు తాతయ్య.

★ ★ ★

శశాంక బృందం ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటున్నారు. అందరూ శశాంకని అభినందిస్తున్నారు.

"మొత్తంమీద అనుకున్నది సాధించి హీరోవనిపించుకున్నావు" అన్నాడు భారవి.

"మీ అందరి సాయం లేకపోతే ఇది సాధ్యమయ్యేదికాదు" అన్నాడు శశాంక.

"అది నీ వినయం. ఇందులో మాదేం లేదు" అన్నాడు భారవి.

శశాంక కాళిదాసువంక చూశాడు. అతడు కూడా అదేమాటంటే తృప్తి అతడికి.



కాళిదాసు నవ్వి, "విజయానికి క్రెడిట్ నీదేననడంలోనే మాకు మేలున్నది. అపజయానికి బాధ్యత తీసుకోనక్కరలేదు మేం" అన్నాడు.

"ఇంకా అపజయం శంక నిన్ను వదల్లేదా? "

"అది నీ పెళ్ళయ్యేదాకా నన్ను వెంటాడుతూనే ఉంటుంది" అన్నాడు కాళిదాసు.

"పోనీలే పెళ్ళయ్యాక కూడా అనలేదు, బతికించావు"

"పెళ్ళే మగాడికి ఓ పెద్ద అపజయమని సామెత" నవ్వాడు కాళిదాసు.

శశాంకకు కోపం వచ్చింది. కానీ సరైన డైలాగు స్ఫురించక భారవి వంక చూశాడు. భారవి అతడి కళ్ళలోని భావాన్ని చదివి, "మగాడో పెద్ద హిపోక్రాటు. ఆడదానికోసం యుద్ధాలు చేస్తాడు. స్మారకభవనాలు కట్టిస్తాడు. అయినవాళ్ళందర్నీ వదులుకుంటాడు. సామెతల్లోమాత్రం ఆమెను చిన్నబుచ్చుతాడు. ఈ ప్రపంచంలో గౌరవించతగ్గ వ్యక్తిత్వమంటూ ఉంటే అది అమ్మ. అమ్మ ఆడది" అన్నాడు.

శశాంక చప్పట్లుకొట్టి, "ఏయ్... ఈ డైలాగు చాలా గొప్పగా ఉంది. గమ్మున రాసేసి ఉంచు. ఎక్కడైనా వాడదాం" అన్నాడు.

సరిగ్గా అప్పుడే శశాంక పక్కనున్న ఫోను మోగింది. రిసీవరెత్తి "హలో" అన్నాడతడు.

"కృష్ణమురళి" అందవతలి గొంతు.

శశాంక ముఖం ఉత్సాహంగా మారింది. తమ సంభాషణ అందరూ వినాలని అతడు స్పీకర్ ఫోన్ ఆన్‌చేశాడు.

"కంగ్రాట్స్ శశాంకా. శకుంతలతో పెళ్ళటకదా" అన్నాడు కృష్ణమురళి.

"థాంక్యూ వెరీమచ్. పెళ్ళికి తప్పకరావాలి" అన్నాడు శశాంక.

"ప్రేమలో ఓడిపోయాను. పెళ్ళికి రాలేను. ఏమీ అనుకోకు"

శశాంక గర్వంగా, "మై సింపతీసార్ విత్ యూ" అన్నాడు.

"ఓకే... ఆల్ ది బెస్ట్" అవతల క్లిక్ మంది.

"హుర్రే" అన్నాడు శశాంక ఫోన్ పెట్టేసి.

"హుర్రే" అన్నాడు భారవి.

శశాంక కాళిదాసువంక చూస్తే అతడు తీవ్రాలోచనలో ఉన్నాడు.

"ఏమిటాలోచిస్తున్నావ్? " అన్నాడు శశాంక.

"ఇండియా దక్షిణాఫ్రికామీద మొదటి వన్డే నెగ్గింది క్రికెట్లో. ఆ తర్వాత చిత్తుగా ఓడిపోయింది" అన్నాడు కాళిదాసు.

"అయితే ఏమిటంటావ్? " చిరాగ్గా అన్నాడు శశాంక.

"కృష్ణమురళిని తేలికగా అంచనా వెయ్యకు. అతడి బుర్రనిండా కొత్త పథకాలే. నువ్వు తనను ఎదురుదెబ్బ తీసినట్లు గ్రహించగానే అతగాడు ప్లేటు మార్చాడు. తను రంగంనుంచి తప్పుకుంటున్నట్లు నిన్ను భ్రమింపచేస్తే నువ్వు పరాకుగా ఉంటావనీ, అప్పుడు తానెదురు దెబ్బ తియ్యవచ్చుననీ ఆలోచిస్తున్నాడేమోనని మీకెవ్వరికీ అనిపించడంలేదా" అన్నాడు కాళిదాసు.

"అపశకునపక్షి" అన్నాడు భారవి.

"ఆలోచించండి. కేవలం అభినందించడానికే కృష్ణమురళి ఇక్కడకు ఫోన్ చేస్తాడా? "

"ఎందుకు చెయ్యడు? మ్యాచ్ ఓడాక హేండ్ షేక్ మామూలే ఇప్పటి ఆటల్లో" అన్నాడు దర్శకుడు అప్పటికి తాను నోరు విప్పుతూ.

"అయితే మీ ఇష్టం. ఆ తర్వాత నేను హెచ్చరించలేదనవద్దు" అన్నాడు కాళిదాసు.

★ ★ ★

శకుంతల పెళ్ళిముహూర్తం గురించి అమెరికాలోని తల్లిదండ్రులకు కబురువెళ్ళింది. శకుంతల తల్లి ఇండియాకు ఫోన్ చేసి, "ఈ ముహూర్తం మాకు చాలా ఇన్





కన్వీనియంట్. పెళ్ళికి రాలేం" అంది.

"కన్నెధార పోయాల్సినవాళ్ళు. మీరు లేకుండా పెళ్లెలా జరుగుతుంది" అన్నాడు తాతయ్య.

"పిల్లను పెంచి పెద్దచేసినవాళ్ళు. అమ్మా, నువ్వా కన్యాదానం చేసేయండి నాన్నా" అంది శకుంతల తల్లి.

"ఇది చాలా బాగుంది. కనీసం కన్నబిడ్డ పెళ్ళి కళ్ళారా చూడాలనైనాలేదా నీకు? "

"కొందరికి కొన్నియోగాలుండవు. అంతే" అంది శకుంతల తల్లి.

తర్వాత అమ్మమ్మ ఫోన్లో మాట్లాడింది. నిర్ణయాల్లో మార్పులేమీలేవు.

ఒక్కొక్కరే అయ్యాక శకుంతల ఫోన్లో మాట్లాడింది. పెళ్ళికి రమ్మని తల్లిని మరీ మరీ బతిమాలింది. తల్లి ఆమెతో, "హనీమూన్‌కు అమెరికా వద్దురుగాని" అని ఫోన్ పెట్టేసింది.

"అంతా విడ్డూరం" విసుక్కుంది శకుంతల అమ్మమ్మ.

"ఇష్టంలేని పెళ్ళి చేశామని దానికి మన మీద కోపం. అందుకే మనతో అప్పట్నించీ అంటీముట్టనట్లుగా ఉంటోంది. బిడ్డ పుట్టగానే మనకు అప్పచెప్పేసి మన పద్ధతిలో పెంచుకోమని వదిలేసింది. తన మగబిడ్డల్ని దర్నీ అక్కడి సంప్రదాయంలో పెరగనిస్తోంది. రెండేళ్ళకో, మూడేళ్ళకో ఓసారి వచ్చి ఏవో గిఫ్టులిచ్చి రెండుమూడ్రోజులుండి వెళ్ళిపోతుంది. అల్లుడు కూడా మనతో ముక్తసరిగా ఉంటాడు. వాళ్ళబిడ్డలూ అంతే. ఏమైతేనేం, సంప్రదాయం నిలబడిందికదా అని ఇన్నాళ్లూ సంతోషించాం. కానీ ఇప్పుడు అసలు పెళ్ళికే రానంటున్నారు వాళ్ళు. అంటే నామీద చాలా కోపంగా ఉన్నారనే అనుకోవాలి" అన్నాడు తాతయ్య.

★ ★ ★

"ఇప్పుడు నేనేం చెయ్యాలి" అన్నాడు రాజు.

"తూర్పుదిక్కుగా తిరిగి దణ్ణంపెట్టు" అంది దర్పణి.

"అందువల్ల ఏమిటి ప్రయోజనం? "

"నువ్వు దిక్కుతెలియని స్థితిలో లేవని తెలుస్తుంది"

"ప్లీజ్ జోకులొద్దు. ఎలాగోలా ఈ పెళ్ళిని ఆపాలి"

"కృష్ణమురళి అంతటివాడు చేతులెత్తేశాడు. నువ్వెంత? " అంది దర్పణి.

"నేనెంత అని తేలిగ్గా అనేశావు. కృష్ణమురళిని గానీ, శశాంకని గానీ ప్రేమించని శకుంతల నన్ను ప్రేమించింది. నేను సామాన్యుణ్ణై ఉండను" అన్నాడు రాజు.

"ఆ విషయం నీకు తెలుసు. నాకు తెలుసు... అంతే"

"అయితే ఇప్పుడిక నేను చేయగలిగిందేమీ లేదా? "

"అది నీకు మాత్రమే తెలుసు" అంది దర్పణి.

"నాకు తెలిసిందేమిటో నిజంగా నాకు తెలిస్తే ఎంత బాగుణ్ణు? " అన్నాడు రాజు బాధగా

"ఇదేమాట శకుంతల కూడా అనుకుంటోంది. ఆమె నిన్ను ప్రేమించింది. అది నీకు తెలుసు. మరి నువ్వు కూడా ఆమెను ప్రేమిస్తున్నావా? "

"అయ్యో! ప్రేమించకపోతే ఇప్పుడీ బాధ ఎందుకు? "

"బాధ సమస్యల్ని పరిష్కరించదు"

"అయితే ఏం చేయాలి? "

"యాక్షన్" అంది దర్పణి.

యాక్షన్ అంటే ఏమిటో దర్పణికి తెలియదు. ఏం చేయాలో రాజుకు తెలియకుండా ఉంది.

★ ★ ★

ఒకరోజున శకుంతలకు స్పృహ తప్పింది ఉన్నట్లుండి. కబురు దమయంతికి వెళ్ళింది దర్పణిద్వారా.

దమయంతి శకుంతలకు ప్రథమ చికిత్స

చేసి స్పృహ తెప్పించింది.

"అమ్మాయిలో ఏ లోపమూలేదు. బలమైన మానసికవేదన అనుభవిస్తోందని నా అను మానం" అంటూ ఆమె తాతయ్యకు చెప్పింది.

శకుంతల అనుభవిస్తున్న మానసిక వేదన తాతయ్యకు తెలుసు. కానీ అది ప్రమాదకరంగా పరిణమించదనే ఆయన నమ్మకం. సంప్రదాయంపట్ల మోజు కలి గించే బలహీనత ఆ నమ్మకాన్ని మరింతగా పెంచుతోంది.

తాతయ్య చూచాయగా విషయాన్ని దమ యంతికి చెప్పాడు.

"మీరు తప్పుచేస్తున్నారు. ఆమె ఇష్టపడిన వాడితోనే పెళ్ళి జరిపించండి" అంది దమ యంతి.

"అది నాకూ తెలుసమ్మా. కానీ దాని నిర్ణయం వెనుక అనుభవరాహిత్యం, వయసు తొందరా ఉన్నాయి. ఆ విషయం పెళ్ళయ్యాక గ్రహిస్తే దిద్దుకోలేని తప్పుచేశా నని గ్రహించి మరింత బలమైన మానసిక వేదనకు గురవుతుంది. దానికంటే ఇప్పటి వేదనే మంచిది. చేతులు కాలాక ఆకులు పట్టుకుని లాభముండదుకదా"

దమయంతి కాసేపాలోచించి, "ఆమెకు నచ్చినవాడో, మీకు నచ్చినవాడో చెప్పలేను కానీ ఆమె మానసిక వేదనను తొలగించే శక్తి కట్టుకున్నవాడికే ఉంటుంది. అతడికి ముందుగా పరిస్థితి వివరించి చెప్పి ఆమెకు నచ్చినట్లు మసలుకునేలా చెయ్యండి" అంది.

"అమ్మాయికి నువ్వు నచ్చలేదూ వేరెవ రినో ప్రేమించిందీ అని ఎలా చెబుతా మమ్మా కట్టుకోబోయేవాడితో" అన్నాడు తాతయ్య.

"ఆ కట్టుకోబోయేవాడు ఆమెను ప్రేమిస్తు న్నట్లైతే మిమ్మల్ని తప్పక అర్థం చేసుకుం టాడు" అని వెళ్ళిపోయింది దమయంతి.



శుభలేఖలు అచ్చువేయించడానికి కార్డుల ఎన్నిక జరగాలి. అమ్మాయి పెళ్ళి బట్టల షాపింగుంది. ఇవన్నీ తన తల్లిదండ్రులే చేస్తారని శశాంక ముందుగానే తాతయ్యకు చెప్పాడు.

ముహూర్తాల నిర్ణయం పూర్తిగా ఆడపెళ్లి వారికే వదిలిపెట్టిన మగపెళ్ళివారి సంస్కారం గురించి తాతయ్య చాలా గొప్పగా ఊహిస్తున్నాడు. పిల్లను శశాంక మాత్రమే చూశాడు. ముహూర్తాలను ఆయన నిర్ణయించాడు. వీటన్నింటికీ కారణం తన తల్లిదండ్రుల పాత్రలకు సమ ర్థవంతులైన నటులు శశాంకకు సమయానికి దొరక్కపోవడమేనని ఆయనకు తెలియదు.

ఇప్పుడు శశాంకకు కులం, గోత్రం, సంప్ర దాయం వగైరాలన్నింటితోపాటు అందుకు అనువైన తల్లిదండ్రులు కూడా దొరికారు. అందుకే పెళ్ళివారికి కబురు చేశాడు.

ఈ ఎన్నికలో వధూవరుల ప్రమేయముం డదు. అన్నీ పెద్దలే చూసుకుంటారు. అందుకని అతగాడు తన తల్లిదండ్రులను ఓ కార్లో శకుంతల ఇంటికి పంపాడు. బయ ల్దేరినట్లు వెంటనే ఫోన్ చేసి చెప్పాడు.

దార్లో ఆ కారును కృష్ణమురళి ఆపాడు. శశాంక తల్లిదండ్రులను వేరే ఇంటికి తర లించి తాము క్షేమంగా శకుంతల ఇల్లు చేరుకున్నట్లు వారిచేత బలవంతంగా శశాం కకు ఫోన్ చేయించాడు. కారు డ్రైవర్ని శకుంతల ఇంటికి పంపాడు.

శకుంతల తాతయ్య, అమ్మమ్మ, అత్తయ్య కారెక్కారు. ఎక్కేముందు తాము షాపిం గుకు బయల్దేరుతున్నట్లు శశాంకకు ఫోన్ చేశాడు తాతయ్య.

కారు చేరవలసిన చోటుకు చేరుకున్నాక అక్కడ వారికి కృష్ణమురళి దర్శనమి చ్చాడు. చూస్తూనే తాతయ్య అతణ్ణి ఛీద రించుకున్నాడు.

"ప్రేమ ఛీత్కారాలను లెక్కచెయ్యదు. ముందు మీరు ఈ ఫొటోలు చూడండి" అన్నాడు కృష్ణమురళి. వాటిలో శశాంక, రాబిన్సన్ ఒకరితో ఒకరు సరదాగా మాట్లా





డుకుంటున్నట్లున్నారు.

"మీరు ఎంతో తెలివైనవారు. రాబిన్సన్ శశాంక మనిషని గుర్తించలేకపోయారు. అది నాకు బాధగా ఉంది. ఇక మీకు శశాంక పూర్తి నిజస్వరూపం చెప్పక తప్పని పరిస్థితి వచ్చింది. అందుకే కొంత సమయం తీసుకున్నాను. నేను చెప్పే ప్రతి మాటకూ నా దగ్గర రుజువులున్నాయి కాబట్టి నిజం తెలుసుకోండి' అన్నాడు కృష్ణ మురళి ఉపోద్ఘాతంగా.

వినాలని ఉందో లేదో తాతయ్య బృందా నికి వినక తప్పలేదు.

శశాంక ఒక ప్రముఖ రాజకీయవాదికి అక్రమ సంతానం. ఎవరింట్లోనో పెరిగాడు. మధ్యతరగతివాడిలా జీవించాడు. అతడి తండ్రికి సక్రమసంతానం ఓ అమ్మాయీ, అబ్బాయీ ఉన్నారు. ఇద్దరికీ బాగా చదువొచ్చింది. రాజకీయాల వాసన కూడా గిట్ట కుండా ఉన్నారు. అప్పుడాయన దృష్టి శశాంకవైపుకు మళ్ళింది. రాజకీయాల్లో అతణ్ణి తనకు వారసుణ్ణి చెయ్యాలనుకున్నాడు. అందుకు ముందుగా సిరిసంపదలనూ, వైభోగాన్నీ అందించాలి కదా.

ఫలితంగా ఓ టీవీ షోలో అతడికి అయిదు కోట్ల రూపాయలు వచ్చాయి. ఇంకో లాటరీ టికెట్లో రెండు కోట్లు. గుర్రప్పందాల్లో నాలుగు కోట్లు.

ఇలా ఉన్నట్లుండి అతణ్ణి భాగ్యలక్ష్మి వరించింది. ఆ అవకాశాన్నుపయోగించుకుని అతడు నిజజీవితంలో హీరో కావాలనుకున్నాడు. ఓ బృందాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. అప్పుడతడికి హీరోయిన్ కావాలనిపించింది. శకుంతల మీద దృష్టి పడింది.

శకుంతలది సంప్రదాయ కుటుంబం. శశాంకకు చరిత్రలేదు. అందుకని అతడు తనకు లేనివన్నీ సృష్టించుకుంటూ వచ్చాడు. శకుంతలకు అన్నివిధాలా అర్హుడైన కృష్ణమురళి రంగప్రవేశం అతణ్ణి ఇబ్బందిలో పెట్టింది. కృష్ణమురళిని దెబ్బతీయాలని అతడు నీచత్వానికి కూడా దిగాడు.

శకుంతలను రాజుచేత కిడ్నాప్ చేయించి తను విడిపించినట్లు నటించాడు. తనవాళ్ళ చేత మెహరున్నీసా కథనూ, క్లారిస్ కథనూ అల్లించి అది కృష్ణమురళి కుతంత్రమని శకుంతల కుటుంబాన్ని నమ్మింపజేశాడు. కథ ముహూర్తాలదాకా వచ్చాక ఇప్పుడు అద్దె తల్లిదండ్రుల్ని రంగంలో దింపాడు.

"మీకు జాతకాల నమ్మకముందని అత గాడు నా జాతకాన్ని తన జాతకంగా చెప్పుకుంటున్నాడు. అవధానిగారు భేషుగ్గా సరిపోయాయన్న జాతకాలు నాదీ, శకుంతల దీనూ. అతగాడికి జాతకమే లేదు. అంతే కాదు. నాతో పెళ్ళి కుదురుతుందనగానే శకుంతలకు పిచ్చెక్కుతుందని జాతకంలో ఉన్నట్లు అతడు చెప్పింది అబద్ధం. మీరు మీ శకుంతల జాతకాన్ని ప్రతిభావంతులైన జ్యోతిష్యులకు చూపిస్తే అసలు విషయం తెలుసుకుంటారు. ఆమెకు పెళ్ళికి ముందు మతిచెదిరే అవకాశముంది. జాతకాలు నిజమవుతాయని నేననను కానీ శశాంక మూలంగా అలాంటి పరిస్థితి ఏర్పడింది. ఇప్పటి ఆమె మానసిక స్థితికి చాలావరకూ శశాంకే కారణం" అన్నాడు కృష్ణమురళి.

ఈ మాటలు తాతయ్య బృందానికి దిగ్భ్రాంతిని కలిగించాయి.

అయితే అన్నింటికీ కృష్ణమురళివద్ద తిరుగులేని రుజువులున్నట్లు తెలుసుకునేందుకూ వారికి ఎంతోసేపు పట్టలేదు.

అంతా బాగానే ఉంది. ఇంతకీ నువ్వెవరు బాబూ?" అన్నాడు తాతయ్య.

"నా పేరు కృష్ణమురళి. నేను శకుంతలను ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమించాను. ఆమెను పెళ్లిచేసుకోవడం నా ఉద్దేశ్యం. నాకు డబ్బుకు లోటులేదు. సంప్రదాయం ఈ పెళ్ళికి అడ్డురాదు. ఆ విషయం మా అమ్మా నాన్నలను చూశాక మీరే తెలుసుకుంటారు. ఎక్కడా నాటకాలు, మోసాలు ఉండవు. అన్నీ స్వయంగా మీరే

పరీక్షించుకోవచ్చు" అన్నాడు కృష్ణమురళి.

"నా మనవరాలి పెళ్ళి ఎలా జరుగుతుందా, వరుణ్ణెల్లా నిర్ణయించాలా అని నేను మథనపడుతుండేవాణ్ణి. అలాంటిది దాన్ని వెతుక్కుంటూ ఇలా ఒకదాని వెనుక ఒకటిగా సంబంధాలు వస్తాయనీ వాటి వెనుక మోసం, కుట్ర, దగా దాగి ఉంటాయనీ నేనెప్పుడూ అనుకోలేదు" అన్నాడు తాతయ్య.

"కానీ మీరిందులో దిగులు పడాల్సిందేముంది సార్! సంబంధాల వెనుక మోసం, కుట్ర, దగా ఉన్నప్పటికీ అవి అమ్మాయిని పెళ్లిచేసుకుందుకే కదా! నేను శశాంక కుతంత్రాలను బయటపెట్టినప్పటికీ కూడా అతడి గురించి ఓ మాట చెబుతాను. మీ సంప్రదాయానికి భయపడే అతడు మాయలు పన్నాడు తప్ప, అతడికీ శకుంతలంటే ప్రాణం. పెళ్లిచేసుకుంటే అతడామెను కంటికి రెప్పలా చూసుకుంటాడని నా నమ్మకం" అన్నాడు కృష్ణమురళి.

"నీ సంస్కారం గొప్పది. అందుకే ప్రత్యర్థిలో మంచిని చూడగల్గుతున్నావు. అందుకే నీకు అసలు విషయం చెప్పేస్తున్నాను" అంటూ తాతయ్య అతడికి దమయంతి శకుంతల విషయంలో చెప్పిన జాగ్రత్తలూ, శకుంతలకు పెళ్ళి విషయంలో తనిచ్చిన మాటా చెప్పాడు.

కృష్ణమురళి నివ్వెరపోయి "సంప్రదాయంలో పెరిగిన శకుంతల కూడా ఈ విధంగా ప్రేమలో పడుతుందని ఊహలో కూడా అనుకోలేదు నేను. అయితే తన ప్రేమమీద ఆమెకున్న నమ్మకం చాలా గొప్పదనిపిస్తోంది. అంతా ఆమె అనుకున్నట్లే జరుగుతోంది" అన్నాడు.

"మరిప్పుడు నేనేం చేయాలి? " అన్నాడు తాతయ్య అసహాయంగా. ఆయనైతే ఆ మాటన్నాడు. ఆయన బృందం మాట్లాడ్డానికే అసహాయులైపోయినట్లున్నారు.

"ఏం చేస్తారు? రాజుతో ఆమె పెళ్ళికి ఒప్పుకోండి" అన్నాడు కృష్ణమురళి తాపీగా.

"ఏడిసినట్లుంది. శశాంకతో పెళ్ళి తప్పిపోదన్న గట్టి నమ్మకంతో నేను దానికా మాటిచ్చాను. నీ మూలంగా నా నమ్మకం వమ్మయింది. నేను నా మాటనించి ఎలా బైటపడాలో నువ్వే చెప్పు" అన్నాడు తాతయ్య అసహాయతలో నిష్ఠూరాన్నీ, ఆశనూ మిళితం చేస్తూ.

"శకుంతలకు తన ప్రేమమీదున్న నమ్మకం మీకు మీ సంప్రదాయంమీద ఉంటే ధైర్యంగా ఆమెకు స్వేచ్ఛనివ్వండి. ఇస్తూనే శశాంకతో నిర్ణయించిన ముహూర్తానికే రాజుతో ఆమె పెళ్ళి కూడా జరగాలని చిన్న షరతు పెట్టండి. అలా జరక్కపోతే తన పెళ్ళి మళ్ళీ మీ ఇష్టప్రకారమే జరగాలనండి"

"బాగానే ఉంది. పెళ్ళెలా తప్పించాలా అని మేం మథనపడుతూంటే నువ్వు ముహూర్తం కూడా నిర్ణయించేసి శుభస్య శీఘ్రం అంటున్నావు" అన్నాడు తాతయ్య.

"తాతయ్యగారూ శకుంతలది అపరిపక్వ ప్రేమ. ఆమె అమాయకురాలు. జీవితంలో సుఖపడడానికీ, ఉన్నత శిఖరాల నధిరోహించడానికీ ఆమెకు నా అవసరమెంతైనా ఉంది. నాకేమో ఆమెపై చెప్పలేనంత ప్రేమ ఉంది. నా ప్రేమను మీ సంప్రదాయం సమర్థిస్తోంది. మీ సంప్రదాయం మీదా నా ప్రేమ మీదా ఉన్న నమ్మకంతో చెబుతున్నాను. మీరు నిశ్చింతగా ఉండండి. నేను చెప్పినట్లు శకుంతలకు స్వేచ్ఛనివ్వండి. నిర్ణయించిన ముహూర్తానికే నాకూ, శకుంతలకూ పెళ్ళి జరక్కపోతే నన్నడగండి" అన్నాడు కృష్ణమురళి గంభీరంగా.

★ ★ ★

పరీక్షలు బాగా రాసిన విద్యార్థి కూడా ఫలితం వచ్చిన రోజున అది తన అంచనా తప్పినప్పుడు ఎంతో సంతోషిస్తాడు. అయితే ఆ సంతోషం రెండేళ్లు అహర్నిశలూ పుస్తకాలూ, కాలేజీ, కోచింగు సెంటర్లూ





మాత్రమే చూస్తూ అష్టకష్టాలు పడ్డాక ఐఐటీలో సీటు సంపాదించిన విద్యార్థి సంతోషం కాలిగోటికి పోలదు. మొదటి విద్యార్థికి ప్రకృతిలో నిన్నలేని అందమేదో కనిపిస్తే రెండో విద్యార్థికి కదిలే ఊహలకి కన్నులొచ్చి పగలే వెన్నెలై జగమే ఊయలగా మారుతుంది.

పాడుకుంటోంది శకుంతల పగలే వెన్నెలా అనుకుంటూ.

నిన్న రాత్రి తాతయ్య పెళ్ళి విషయంలో ఆమెకు స్వేచ్ఛనిస్తూ చేసిన ప్రకటన రాత్రంతా ఆమెకు నిద్రపట్టనివ్వలేదు. అర్జంటుగా రాజును కలుసుకోవాలనుకుందామె. దర్పణికి ఫోను చేసింది.

"రేపు పదకొండింటికి వస్తాడు రాజు" దర్పణి అపాయింటుమెంటు ఫిక్సుచేసింది.

అప్పుడు రాత్రి పదయింది. అక్కడే గడియారం ఆగిపోయింది. సెకండ్ల ముల్లు గంటల ముల్లు వేగాన్ని సంతరించుకుంటే కాలం ఆగిపోయినట్లే ఉంటుంది.

పదమూడు గంటలు ఎదురుచూడాలి. అంటే ఏడొందల ఎనభై నిముషాలు. అంతటితో ఆగినా బాగుండును. నిముషాలకు సెకన్లున్నాయి. పదివేల నూటనలభై సెకన్లు. అంతటితో ఆగినా ఫరవాలేదేమో.

పరుగులరాణి పీటీ ఉష ఒలింపిక్‌లో కాంస్య పతకాన్ని గెల్చుకుందుకు కొన్ని మైక్రోసెకన్లు వెనకబడిందని జనరల్‌నాలెడ్జి పాఠాల్లో చదివినప్పుడు మైక్రోసెకనంటే ఏమిటో ఆమె ఊహకందలేదు. ఇప్పుడామెకు మైక్రోసెకన్లు తెలుస్తున్నాయి. తెలిసి ఆమె లక్ష్యాన్ని దూరంగా జరిపేస్తున్నాయి.

ఎవరి మనోభావాలతోనూ నిమిత్తంలేకుండా కాలం ముందుకు జరుగుతూనే ఉంటుంది కదా!

ఆ రాత్రి గడిచింది. తెల్లవారింది.

శకుంతలకు తెల్లవారుఝామున కల. కలలో రాజు.

"చలనమున సంగీత సంచలనమొసగిన సుందరీ అందుకో వందనం"

శకుంతల కోసం కవిగా మారిన రాజు హృదయంలోని ప్రేమ విప్పిన గొంతు అది.

ఆమె పరవశంగా వింటోంది. అది కల కాబట్టి ఆడుతోంది కూడా.

ఆమె పరవశానికి అంతరాయం కలిగిస్తూ ఆమెమీదకో పిల్లి దూకింది. ఉలిక్కిపడి లేచిన శకుంతల విషయాన్ని గ్రహించి, "ఎలాంటి కలకు ఎలాంటి ముగింపు?" అనుకుని నిట్టూర్చింది.

శకుంతల నిద్ర లేచింది. స్నానం చేసింది. తొమ్మిదిన్నరకల్లా నాలుగు మెతుకులు కతికింది. ఇంట్లో వాళ్లేమంటున్నారో, అనుకుంటున్నారో ఆమెకు ఎక్కలేదు.

పది దాటేసరికి ఇల్లు వదిలింది. పదిన్నర కాకుండా దర్పణి ఇల్లు చేరింది.

"రాజు టైమంటే టైమే. ఇంకెంత అరగంట" అంది దర్పణి.

'అమ్మో అరగంటా, అంటే పద్దెనిమిదొందల సెకన్లు అంటే మైక్రోసెకన్లు ఎన్నో అమ్మ బాబోయ్' అనుకుంది శకుంతల.

★ ★ ★

సరిగ్గా పదకొండింటికి రాజు వచ్చాడు.

అతడు రాగానే దర్పణి ఏదో పని ఉన్నట్లు రంగంనుంచి తప్పుకుంది.

శకుంతల ఆ విషయమే గమనించలేదు. అతణ్ణి చూస్తూనే "రాజూ! ఈ రోజు నాకెంత సంతోషంగా ఉందో చెప్పడానికి మాటలు చాలవు. మన పెళ్ళికి మా ఇంట్లో ఒప్పుకున్నారు" అంది.

రాజు ముఖం వెలిగింది. "నిజంగా" అన్నాడు.

"నిజం. ప్రేమను నమ్ముకుంటే అపజయముండదని మరోసారి రుజువైంది"

రాజు అబ్బురంగా ఆమెను చూస్తున్నాడు. నేలమీదే ఉన్నా గాలిలో తేలుతున్నట్లుందామె. ఎదురుగానే ఉన్నా ఎత్తులో





ఉన్నట్లుందామె.

"ఏమిటి రాజూ- మాట్లాడవు, నీకు సంతోషంగా లేదా? "

"సంతోషమా, షాకైతే" అన్నాడు రాజు.

"షాకెందుకు? "

"ఇంత అందగత్తె నన్ను ప్రేమించడం, నన్ను మించిన వాళ్లామెకు వరులైతే కాదని నన్నే ఆమెకు వరుడిగా నిర్ణయించడం జీవితంలో ఇంతపెద్ద షాకుకు ప్రిపేరైలేను నేను"

"నిన్ను మించినవాళ్ళా ఆ దేవుడే నిన్ను మించగలడా అనిపిస్తుంది నాకు" అంది శకుంతల.

"జీవితంలో సుఖపడాలంటే వాస్తవాన్ని వాస్తవంలా చూడాలి" అన్నాడు రాజు.

శకుంతల నిట్టూర్చి "వాస్తవాన్ని వాస్తవంలా చూస్తే జీవితమంత బోరింగు, రొటీన్ మరొకటుండదు. పుట్టడం, చావడం ఈ రెంటికీ మధ్య తిండి, నిద్ర ఇంతే కదా జీవితం. భగవంతుడు మనిషికి మెదడునిచ్చి ఆ మెదడుకు ఊహాశక్తినిచ్చి జీవితాన్ని రంగులకలగా మార్చుకుని అనుభవించమ





న్నాడు. నేనిప్పుడదే చేస్తున్నాను. అందుకు పరిస్థితులూ అనుకూలించాయి" అంది.

"నువ్వు దేవతవు. నేను సామాన్యుణ్ణి. మన ఇద్దరి ఆలోచనల్లోనూ ఆ తేడా ఎప్పుడూ ఉంటుంది కానీ ఇంతకీ ఇదంతా ఎలా జరిగిందో చెప్పు"

"అది చెబుతాను కానీ ముందు మీ వాళ్ళకు కబురుపెట్టు. ఎందు కంటే పెళ్ళికి ముహూర్తం కూడా నిశ్చయమైపోయింది" అంది శకుంతల.

"ముహూర్తమా అదెప్పుడు? "

శకుంతల అతడికి ముహూర్తమెప్పుడో చెప్పగానే "అయ్యో ముహూర్తం విషయంలో తొందరవద్దు. నాకు కాస్త గడువు కావాలి" అన్నాడు రాజు.

"గడువెందుకట? " నవ్వుతూ అడిగింది శుంతల.

"మనిషి దేవతను పెళ్ళాడుతున్నప్పుడు ఆ గడువు అవసరం. ఎందుకంటే తనూ దైవత్వాన్ని అలవర్చుకుందుకు కొంత ప్రయత్నం చెయ్యాలి కదా" అన్నాడు రాజు.

"నీకా శ్రమ లేదు. నా దగ్గర మహిమలున్నాయి. ఇలా పెళ్ళి కాగానే అలా నిన్నూ దేవుడిగా మార్చేస్తాను" అంది శకుంతల.

"ఆ పని ఇప్పుడే చెయ్యొచ్చుగా"

"అమ్మో ఇప్పుడే చేస్తే మరో దేవత వెంట పడిపోతే? " భయం నటించిందామె.

"నీకాభయం లేదు. నాకు తెలిసి ఈ ప్రపంచంలో నువ్వు మాత్రమే దేవతవు" అన్నాడు.

అది భ్రమే కావచ్చు ఆ ఒక్క మాటకు క్షణంపాటు శకుంతల నిలువెల్లా పులకరించింది. కాసేపు ఆ ప్రేమికులు తనివితీరా ఒకరినొకరు చూసుకున్నారు.

★ ★ ★

"విత్తనం గోచరం ఫలం అగోచరం" అన్నాడు కాళిదాసు.

శశాంక ముఖంలో ఉక్రోషం "ఈ మంత్రం ఎప్పుడు మొదలెట్టావో అప్పుడే నీకు తెలుసు ఏం జరుగుతుందో అవునా? " అన్నాడు.

"తెలిస్తే అగోచరమని ఎందుకంటాను? " అన్నాడు కాళిదాసు.

"మనని మనమే అనుమానించుకుని ప్రయోజనం లేదు. ముందేం చెయ్యాలో అని ఆలోచించాలి" అన్నాడు భారవి.

"ఇంకా ఏం చెయ్యాలి? నా ప్రేమ కథ అయిపోయింది. అపజయాన్నికైనా అంగీకరించాలి, త్యాగాన్నికైనా సిద్ధపడాలి" అన్నాడు శశాంక.

"నీ ప్రేమ కథ అయిపోయిందని ఎందుకనుకోవాలి? ఈ ప్రపంచంలో శకుంతల తప్ప ఆడవాళ్ళే లేరా? నా అభిప్రాయంలో నీ హీరోయిన్ ఎన్నికే తప్పు..." అన్నాడు భారవి.

"ఆడలేక మద్దెలఓడు" అన్నాడు శశాంక.

"నీకిప్పుడు డైలాగ్సు ధారాళంగా వస్తున్నాయి. అసలు సిసలు హీరోవయ్యావు. నీ మొదటి పిక్చర్ ఆర్ట్‌ఫిలిం. అందులో ప్రేమలో ఫెయిలయ్యావు. రెండోది కమర్షియల్ ఈసారి నీ ప్రేమ ఫెయిలవదు. అందుకు తగ్గ హీరోయిన్ని సెలక్ట్‌చేద్దాం" అన్నాడు కాళిదాసు.

"నా ప్రేమ పరాజయానికి హీరోయిన్ కారణం కాదు. విలన్ ఆ విలన్ కృష్ణమురళి. నా కథ విలన్ విజయంతో అంతమైంది. అదీ నా బాధ" అన్నాడు శశాంక.

"విలన్‌కి విజయం రాలేదు. శకుంతల అతడికీ దక్కలేదు" అన్నాడు భారవి.

"ఇంకా చెప్పాలంటే మన కథ కాస్త మారుద్దాం. నువ్వు శకుంతలని ప్రేమించావు. అందుకు కిడ్నాప్ నాటకమాడావు. ఆ నాటకానికి రాజును పురమాయించావు. శకుంతల రాజును ప్రేమించింది. అది నీకు తెలియదు. ఈలోగా కృష్ణమురళి రంగప్రవేశం చేశాడు. శకుంతలను తనే పెళ్ళాడాలని చూశాడు. అప్పుడు నీకు తెలిసింది. శకుంతల రాజును ప్రేమిస్తోందని. నీ




ప్రియురాలి ప్రేమ విజయం పొందాలని నువ్వు కృష్ణమురళితో ఢీకొన్నావు. అతణ్ణి మట్టికరిపించి ఆమెను సంతోషపెట్టావు. ప్రేమ త్యాగానికి వెనుకాడదని రుజువు చేశావు. నీ ప్రేమ అమరం. జై శశాంకకూ" కాళిదాసు.

"నువ్వు నాకు జై కొట్టావా? " ఆశ్చర్యంగా అన్నాడు శశాంక.

"నువ్వు అపజయమనుకుంటున్నది మహాత్ముల స్థాయి త్యాగం. అందుకు నిన్నభినందించాలి. నీకు నేను జైకొట్టడమే కాదు. మన బృందమంతా జయగీతంతో ఆరాధించాలి. వన్ టూ" అన్నాడు కాళిదాసు.

అంతే అక్కడ సంగీత ధ్వనులు మొదలయ్యాయి. దర్శకుడు, సంగీత దర్శకుడు పోటీలు పడి చేతులూపుతున్నారు.

పాట...

శశాంక! కృష్ణమురళిపై సాధించిన విజయగాథ ఆ పాటలో ఉంది.

పాట పాడేవారు, ఆడేవారు, ఊగేవారు, తలలూపేవారు, అక్కడంతా కోలాహలం.

"స్టాపిట్" ఉన్నట్లుండి ఓ పెద్దకేక. అది అప్పుడే అక్కడ అడుగుపెట్టిన కృష్ణమురళి నోటివెంట వెలువడింది.

"కృష్ణమురళి... కృష్ణమురళి" అక్కడున్న చాలామంది అన్నారు అప్రయత్నంగా

"శశాంక్ నీతో ప్రయివేటుగా మాట్లాడాలి" అన్నాడు కృష్ణమురళి.

"నాతోనా? " అన్నాడు శశాంక.

"అవును... నీతోనే!"

"నేను హీరోని. నాకు ప్రైవసీ ఉండదు. నా పక్కన నా బృందముండి తీరాలి"

"ఆలోచించుకో నీ మేలు కోరి చెబుతున్నాను. నువ్వు నిజంగా హీరోవే. కాదనను. కానీ నేనిప్పుడు నిన్ను వెండితెర మెరుపుల ముందు కలవడంలేదు. నిజజీవితంలో కలుస్తున్నాను. నిజజీవితంలో ప్రైవసీ వద్దనుకుంటే నీ ఇమేజ్ దెబ్బతినే ప్రమాదముంది" అన్నాడు కృష్ణమురళి.

శశాంక తడబడ్డాడు. కాసేపాలోచించి కృష్ణమురళిని పక్కగదిలోకి తీసుకుని వెళ్ళాడు.

ఇద్దరూ చెరో కుర్చీలో కూర్చున్నాక, "నీ గతం నాకు తెలుసు. నీకు డబ్బెలా వచ్చిందీ నాకు తెలుసు. కానీ అందుకు నేను నిన్ను చిన్నబుచ్చను. ఎందుకంటే అందులో నీ తప్పులేదు. పుట్టుకనుబట్టి మనిషిని చిన్నబుచ్చడం కుసంస్కారం. నేను నీ ప్రవర్తనను మెచ్చుకోకపోతే అదీ కుసంస్కారమే అనిపించుకుంటుంది. నువ్వు నిజంగా హీరోవి. ఇలాగే హీరోలా కొనసాగు. అందుకు అవసరమైన మంచి బృందం నీ దగ్గరుంది. అది చాలదనుకుంటే నా సాయం కూడా నీకుంటుంది" అన్నాడు కృష్ణమురళి.

"ఇదంతా నాకెందుకు చెబుతున్నావు? " అన్నాడు శశాంక అనుమానంగా.

"ఇంతకాలం మనం ప్రత్యర్థులం. ఇక కాదు. నీతో నిర్ణయించిన ముహూర్తానికే శకుంతల వివాహం నాతో జరుగనుంది. దానికి నువ్వు అడ్డు తగలకూడదు. తగిలితే పెళ్ళి ఆగిపోతుందని కాదు. తన పెళ్ళి విషయంలో ఇలా దెబ్బమీద దెబ్బ తగిలితే ఆమె తట్టుకోలేదు. అందుకని"

"ఆమె పెళ్ళి రాజుతో కదా జరగబోతోంది? " అన్నాడు శశాంక.

"రాజు. డూప్‌గా తెచ్చావు వాణ్ణి. డూప్‌గానే ఉంటాడు" అన్నాడు కృష్ణమురళి.

"అర్థంకాలేదు. శకుంతల కూడా వాణ్ణే ప్రేమిస్తోందని విన్నాను"

"శకుంతల అమాయకురాలు. ఆమెకు ప్రపంచం తెలియదు. తన మనసులోని నైర్మల్యాన్నే అన్నింటా దర్శించే ఆమెకు విధాత నన్ను వరుడిగా నిర్ణయించాడు. మధ్యలో వచ్చిన వాళ్లు మధ్యలోనే పోతారు. నువ్వు రంగంనుంచి తప్పుకుంటానని అనుకున్నావా? నీ విషయంలో జరి



గిందే రాజు విషయంలోనూ జరుగుతుంది? నా ప్రేమ పవరు అలాంటిది. ఒకసారి పెళ్ళయ్యాక శకుంతల పతివ్రతగా మారి సతీత్వంలో అనసూయను, అరుంధతినీ మరిపిస్తుంది" అన్నాడు కృష్ణమురళి.

శశాంక ఆలోచనలోపడ్డాడు.

"నేను చెప్పాల్సిందైపోయింది" అన్నాడు కృష్ణమురళి.

"మిస్టర్ మురళీ" అన్నాడు శశాంక.

"నువ్వు చెప్పింది నిజం. శకుంతల అమాయకురాలు. ఆమెను పొందాలని కుతంత్రాలు పన్నాను. అందుకే నేనామెకు తగను. నేనేకాదు, నువ్వూ ఆమెకోసం కుతంత్రాలు పన్నావు. నువ్వూ ఆమెకు తగవు. రాజు కూడా ఆమెలా అమాయకుడు. వాళ్ళిద్దరూ మేడ్ ఫర్ ఈచ్ అదర్. నీకు తెలుసా ఒకసారి నేను శకుంతల కోసం వేదికమీద ఓ పాట పాడాను. నిజానికి పాట శకుంతలకోసమే పుట్టింది. అయితే అది రాజు హృదయాన్ని చీల్చుకుని వచ్చిన పాట. అది చాలు వాళ్ళ ప్రేమను రుజువుచెయ్యడానికి. కాబట్టి నేను తప్పుకున్నట్లే నువ్వూ రంగం నుంచి తప్పుకో. వాళ్ళ ప్రేమకు అడ్డురాకు. అడ్డొచ్చావో ఓ విషయం గుర్తుంచుకో. నాకిప్పుడు శకుంతలకంటే ఆమె ప్రేమ ముఖ్యం. ఆ ప్రేమ రాజును కోరుకుంటోంది. ఆ జంటను విడదీసే ప్రయత్నాలను సర్వశక్తులుగా ధారపోసి ఎదిరిస్తాను"

"గుడ్... ఇది నీలోని మంచి మార్పును రుజువుచేస్తోంది. ఇక నేను చెప్పేది విను. రాజు, శకుంతల ప్రేమ పునాది భంగుమత్తులో ఉంది. పునాది బలంలేకే అది కూలిపోతుంది. తప్ప అందులో నా ప్రయత్నమేమీ ఉండదు" అన్నాడు కృష్ణమురళి.

"నేను నమ్మను. నువ్వే ఏదో చేస్తావు" అన్నాడు శశాంక.

"నీకు తెలియదా- రాజు ఈ పెళ్ళికి ఒప్పుకోడు"

"ఎందుకని? "

"ముహూర్తానికింక ముప్పైరోజులు కూడా లేదు. ఏడాదిలోగా పెళ్ళిచేసుకోనని తల్లిమీద ఒట్టేసి ఉన్నాడు రాజు. ఆ గడువు తీరడానికింకా నూర్రోజులుంది. ముహూర్తానికి రాజుతో పెళ్ళి జరక్కపోతే నన్ను చేసుకుంటానని తాతయ్యకు మాటిచ్చింది శకుంతల. ఇప్పుడు కథ క్లైమాక్సుకి వచ్చింది. రాజు తన మాట నిలబెట్టుకుంటాడు. శకుంతల తనమాట నిలబెట్టుకుంటుంది. వాళ్ళ మాటలు నిలబడితే శకుంతలకూ నాకూ పెళ్ళి జరిగి పోతుందికదా- ఇందులో నా ప్రయత్నమేమైనా ఉంటుందా? "

శశాంక ఆశ్చర్యంగా కృష్ణమురళివంక చూశాడు. అతడికి కృష్ణమురళి ముఖంలో అపురూపమైన తేజస్సు ఏదో కనిపించింది.

"నువ్వు సామాన్యుడివికాదు. ఇప్పుడనిపిస్తోంది నాకు- బహుశా శకుంతల నీవంటి అసాధారణ పురుషుడికోసమే పుట్టివుండాలి" అన్నాడతడు.

"చాలా ఆలస్యంగా నిజాన్ని గ్రహించావు. ఇక నా జోలికి రావుకదూ"

"వస్తే మాత్రం నీకు భయమా! నువ్వు లీలామానుష విగ్రహుడవనిపిస్తోంది నాకు. నేనేం చెయ్యాలో ఆజ్ఞాపించు, శిరసావహిస్తాను" అన్నాడు శశాంక. అతడి గొంతులో భక్తిభావం ధ్వనించింది.

"నీ గొంతులో నిజాయితీ ధ్వనిస్తోంది. అందుక్కారణం నా హిప్నాటిక్ పవర్. అదెంతోసేపు నీమీద ప్రభావం చూపించలేకపోవచ్చు అప్పుడు మళ్ళీ నీ మనసు మారవచ్చు అందుకే ముందుగా నీకు అన్నీ చెబుతున్నాను. శకుంతల కుటుంబం సంప్రదాయాన్ని నమ్మింది. ఆ సంప్రదాయంలో నువ్వూ, రాజూ ఇమడనట్లే నేనూ ఇమడను. అందుకోసం నేనూ నీ పద్ధతులే అనుసరిస్తాను. రాజు ముహూర్తాన్ని నిరసించగానే నా పెళ్ళి నిశ్చయమవుతుంది. అప్పుడు నా తలిదండ్రులు రంగంలోకి




వస్తారు. నీ పద్ధతిలోనే నేను వాళ్ళని సంపాదిస్తాను. నీ తరహాలోనే అబద్ధాలు చెప్పిస్తాను. అది నీకో గొప్ప అవకాశం, నన్ను దెబ్బతియ్యడానికి. నాకూ ప్రస్తుతానికి అంతకుమించిన దారిలేదు. కాబట్టి నిన్ను నాజోలికి రావద్దని కోరుతున్నాను"

శశాంక ఆశ్చర్యంగా, "నీ గురించి నాకు తెలియనివి చెప్పి ఏం సాధించదలచావో తెలియడంలేదు నాకు. దొంగాడా కరవకురా అన్నట్లు లేదూ నీ వ్యవహారం" అన్నాడు.

"ఉంది. కానీ నాకు నీ బృందం తెలివిపై నమ్మకముంది. తలచుకుంటే మీరు నన్ను దెబ్బతియ్యగలరు. అప్పుడు నాపని పద్మ వ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడిలా అవుతుంది" అన్నాడు కృష్ణమురళి.

"మాట ఇస్తున్నాను. నేనిక నీజోలికి రాను" అన్నాడు శశాంక.

"ఎవ్విరితింగ్ ఈజ్ ఫెయిరిన్ లవ్ అండ్ వార్, నువ్వు మాటమీద నిలబడవేమోనన్న అనుమానం నాకుంది"

"ఉంటేమాత్రం ఏంచేయగలవు? నన్ను నమ్మడమే మంచిది" అన్నాడు శశాంక.

"ఈ మాటంటావని ఊహించాను. ఈ మాటలోంచే నువ్వు మాట తప్పే అవకాశం పుట్టొచ్చు అందుకే నా విన్నపంతోపాటే ఓ హెచ్చరికనూ వినిపిస్తున్నాను. అన్నీ ముందుగా చెప్పడంలో నా స్నేహ హస్తం నీకు కనిపించే ఉండాలి. అయినా స్నేహభావాన్ని మరిచినా ఓ విషయం గుర్తుంచుకో. పద్మవ్యూహంలోకి అభిమన్యుడిలా చొచ్చుకుపోనూగలను. అర్జునుడిలా దాన్నించి చీల్చుకుని బయటపడగలను. అదీ నా సత్తా. ఇంకా నీలో నాపై స్నేహభావం ఏర్పడి ఉండకపోతే- ఇది నా సవాలు" అన్నాడు కృష్ణమురళి.

శశాంక నవ్వి, "నీమాటలు నువ్వు సామాన్యుడివి కావని మళ్ళీ రుజువుచేస్తున్నాయి. నీవు శాంతికోసం వచ్చినట్లనిపించదు. కురుక్షేత్ర యుద్ధానికి ముందు కృష్ణరాయబారాన్ని గుర్తుచేశావు. నీ మాటలు నేను గుర్తుంచుకుంటాను" అన్నాడు.

"సరే, క్లైమాక్సు దగ్గర పడింది. మనమక్కడ కలుసుకుంటామో లేదో చూద్దాం" అంటూ కృష్ణమురళి అక్కణ్ణించి కదిలాడు.

★ ★ ★

"ఒట్టుతీసి గట్టుమీద పెట్టు" అంది శకుంతల.

"అమ్మమీద ఒట్టు. దాన్ని ముట్టుకుందుకు లేదు" అన్నాడు రాజు.

"కావాలంటే నేను మీ అమ్మతో మాట్లాడతాను"

"నేను కావాలనను"

"అయితే నువ్వు నన్ను కావాలనుకోవడం లేదా? "

"అనుకుంటున్నాను. కానీ అమ్మను కాదని కాదు"

"రాజూ, మోసపోయాను. నువ్వు నన్ను ప్రేమించడంలేదు" అంది శకుంతల.

"ప్రేమించాను శకుంతలా! నిన్ను ప్రేమించే స్థాయికి ఎదిగాను కాబట్టే అమ్మ మీద ఒట్టును గట్టున పెట్టనంటున్నాను. అమ్మ చెప్పినాసరే"

"అందువల్ల మనప్రేమ భగ్నమైపోతే...? " ఏడుపు గొంతుతో అంది శకుంతల.

"శకుంతలా, అమ్మ నిజం. ప్రేమ భ్రమ"

"అది నాకెలా తెలుస్తుంది? నేను చిన్నప్పట్నించీ అమ్మకు దూరంగా పెరిగాను. అమ్మకాని వాళ్ళు అమ్మగా మారి పెంచారు నన్ను"

"ఎక్కడ అమ్మను చూశావో, ఆ అమ్మను నమ్ము. అమ్మే నిజం. ప్రేమ భ్రమ" రెట్టించాడు రాజు.

"ఆ అమ్మ నా పెళ్ళి కృష్ణమురళితో చేస్తానంటోంది" అంది శకుంతల.

"అమ్మ ఎప్పుడూ తప్పుచెయ్యదు"

"రాజూ- అమ్మ కూడా ప్రేమవల్లనే గొప్ప

దయిందంటారుగా"

"ఏమో నాకు మాత్రం అమ్మ, ప్రేమ వేర నిపించదు. అమ్మే ప్రేమ, ప్రేమే అమ్మ"

"అయితే నా ప్రేమలో అమ్మను చూసి గౌరవించలేవా?"

రాజు నవ్వాడు. "అమ్మకు రూపముంది. ప్రేమకులేదు. నీ ప్రేమ అమ్మంత గొప్ప దైతే అది తప్పక విజయం సాధిస్తుంది. ధైర్యంగా ఉండు" అన్నాడు.

"ప్రేమ నాదేనా? నీది కాదా?"

"అసలు నాకు నువ్వూ నేనూ వేరన్న భావమే కలగడంలేదు"

"కానీ వేరైపోతున్నాం కదా"

"శశాంకతో పెళ్ళి కుదిరిందని అలాగే అను కున్నావు అది చెడింది. కృష్ణమురళితో పెళ్ళి కుదిరితే అలాగే అనుకున్నావు, అదీ చెడింది. ఈ రెంటికీముందు రమేష్ సంబంధం కూడా కుదిరి చెడింది. బహుశా మనిద్దరికీ రాసిపెట్టి ఉండటంవల్లనే ఇలా జరుగుతోందేమో!"

"ఇప్పుడు నీతో సంబంధమూ చెడింది కదా"

రాజు మాట్లాడలేదు.

"రాజూ, నేను ప్రియవ్రతనంటే ఎవరూ అర్థంచేసుకోవడంలేదు. నిన్ను తప్ప ఇంకొ కర్ని పెళ్లాడ్డం నావల్లకాదు" దీనంగా అంది శకుంతల.

"అయితే ఓ పనిచెయ్యి. 'నేనే గనుక మహాప్రియవ్రతనైతే, నాపెళ్ళి రాజుతోనే జరగాలి' అని కోరుకో. మనకు శుభం జరు గుతుంది"

శకుంతల కళ్ళు మూసుకుంది. "నేనే గనుక మహాప్రియవ్రతనైతే నాపెళ్ళి రాజు తోనే జరగాలి" అంది గట్టిగా.

ఆమె కళ్ళు తెరిచేసరికి ఎదుట రాజు లేడు. దర్పణి ఉంది.

★ ★ ★

తెలివి, నిదానం, సంస్కారం, మంచి తనం- అన్నీ ఉన్నాయి నీకు. శకుంతల రాజును ప్రేమిస్తోందని తెలిసీ నువ్వామెను పెళ్ళిచేసుకుంటాననడం బాగోలేదు" అంది దర్పణి కృష్ణమురళితో.

"రాజు కాదంటేనే నేనామెను పెళ్ళి చేసు కుంటానన్నాను" అన్నాడు కృష్ణమురళి.

"రాజు కాదనడంలో ఉదాత్తత ఉంది" అంది దర్పణి.

"రాజు తన తల్లిమీద ఒట్టేశాడు. అదేకదా ఉదాత్తత. కేవలం మూఢనమ్మకమైన ఒట్టుకు ప్రాధాన్యతనిచ్చి అతగాడు ప్రేమిం చిన అమ్మాయి మనసు ముక్కలు చేస్తే అది నీకు ఉదాత్తత అయింది. మరి నీకు మా అమ్మ కథ తెలుసా?" అన్నాడు కృష్ణ మురళి కటువుగా.

"తెలియదు" అంది దర్పణి. వినడానికి సిద్ధంగా ఉన్నట్లు ఆమె చూపులు సూచిం చాయి.

"మా నాన్న ఒక అద్భుతవ్యక్తి. ఆయన మనుషుల ఫొటోలుచూసి వారి స్వభావాలు అంచనా వేయగలడు. భవిష్యత్తునూ చెప్పగ లడు. తనకు అదృష్ట లక్ష్మి కాగలదని ఫొటో చూసి తెలుసుకుని అమ్మని ఆయన ఇల్లా లిగా చేసుకున్నాడు. వాళ్ళకు ఒక్కగానొక్క కొడుకుని నేను. పెళ్ళై దశాబ్దాలు గడిచినా ఇప్పటికీ అపురూపమైన ప్రేమ జంటలా మసిలే నా తలిదండ్రులను చూసి నేనెంతో గర్వ పడుతూంటాను. అలాంటి పరిస్థితుల్లో ఉన్నట్లుండి అమ్మకు విచిత్రమైన జబ్బుచే సింది. అదేమిటో డాక్టర్లకు అంతుపట్టలేదు. చూడ్డానికి మామూలుగానే ఉంటుందమ్మ. కానీ రోజుకి నాలుగుసార్లైనా శరీరంలో శూలాలు గుచ్చినట్లు బాధపడుతుంది. డాక్టర్ల మందులేం పనిచెయ్యడంలేదు. అలాంటి పరి స్థితుల్లో ఒకసారి అనుకోకుండా శకుంతల ఓ హాస్పిటల్లో అమ్మను తాకింది. అమ్మ బాధ చేత్తో తీసినట్లు మాయమైంది. నాన్నకావి షయం చెప్పింది అమ్మ. నాన్న శకుంతల ముఖంచూసి ఈ అమ్మాయి తనింటికోడలైతే మనుమడు పుడతాడనీ ఆ మనుమడి స్పర్శ





అమ్మ వ్యాధిని శాశ్వతంగా నిర్మూలించగల దనీ ఆయనకు అనిపించింది. ఆరాతీస్తే శకుంతల ఇంటి సంప్రదాయం గురించి తెలిసింది. శకుంతలను ఏదోవిధంగా పెళ్ళిచేసుకోవాల్సిన బాధ్యత నాపై పడింది. అప్పుడు శకుంతలను చూశాను. అమ్మకోసం ఆమెను ప్రేమించాను. అమ్మకోసమే ఆమెను పెళ్ళిచేసుకోబోతున్నాను. అమ్మమీద నాకున్న ప్రేమ నిజమైతే మాపెళ్ళి జరిగి తీరుతుంది. రాజు తల్లికి శకుంతల అవసరంలేదు. మా అమ్మకుంది. కాబట్టి ఉదాత్తతలో రాజుకంటే నేనే అధికుణ్ణి" అన్నాడు కృష్ణమురళి.

★ ★ ★

శకుంతల ఇంటి హాల్లో కృష్ణమురళి, అతడి తలిదండ్రులు సుఖాసీనులై వున్నారు. శకుంతల తప్ప మిగతా అందరూ అక్కడే వున్నారు.

"అమ్మాయికి పెళ్ళిచూపులంటే ఇష్టముండదని అబ్బాయి చెప్పాడు. కాబట్టి ఇది పెళ్ళిచూపులుకాదు. నాచూపులు" అన్నాడు కృష్ణమురళి తండ్రి ఆనందరావు.

"మీ చూపులా?" ఆశ్చర్యంగా అన్నాడు తాతయ్య.

"అవును. నా చూపులే! భగవంతుడు నా కంటికి అపురూపమైన శక్తినిచ్చాడు. నేను మనుషుల స్వభావాలనూ, భవిష్యత్తునూ వారి ముఖాలు చూసి అంచనా వేయగలను. ఇంకా చెప్పాలంటే ముఖాలను ఫొటోలో చూసినా చాలు" అన్నాడు ఆనందరావు.

"అయితే మీరు మమ్మల్ని చూడ్డానికి వచ్చారన్నమాట" అంది అమ్మమ్మ.

"అవునమ్మా, మిమ్మల్ని చూడ్డం నా అదృష్టం. మీ ఇంట్లో అందరివీ ప్రసన్న వదనాలు. అదృష్టజాతకాలు. ఈమధ్యకాలంలో నాకింతగా నచ్చిన కుటుంబం మరొకటి లేదు'' అన్నాడు ఆనందరావు.

శకుంతల కుటుంబ సభ్యుల ముఖాలు వెలిగాయి. అయితే అమ్మాయిని చూస్తానని ఆయనంటాడేమోనని అంతా మనసుల్లో కలవరపడుతున్నారు. ఎందుకంటే ఓ గదిలో కూర్చుని ఏడుస్తోంది. ఎంత చెప్పినా ఆ ఏడుపు ఆగలేదు. చివరికి అంతా కలిసి ఆమెను ఒంటరిగా వదిలివచ్చారు.

"నన్ను వంటరిగా వదలండి. నేను నా దుఃఖాన్నంతా కన్నీళ్లుగా మార్చి బయటకు పంపే ప్రయత్నంలో ఉన్నాను. ముహూర్తం నాటికి కన్నీళ్ళో, దుఃఖమో అడుగంటవచ్చు. మీకిచ్చిన మాట తప్పను. ఏ అఘాయిత్యమూ చెయ్యను" అని వాళ్ళకు వాగ్దానం చేసింది శకుంతల.

అంతగా వాళ్ళు అమ్మాయిని చూడాలనుకుంటే కృష్ణమురళిని పక్కకు పిలిచి విషయం చెప్పాలనుకున్నాడు తాతయ్య. అబ్బాయికి అన్నీ తెలుసునన్న ధైర్యం ఆయనకు బాసటగా ఉంది. అయితే కృష్ణమురళి తండ్రి ఆనందరావు కానీ, తల్లి రాజేశ్వరికానీ ఏమేమో కబుర్లు చెబుతున్నారు తప్ప శకుంతల ప్రసక్తి తేవడంలేదు. అందుకు సంతోషంగా ఉన్నా మనసులో వారికి కాస్త బెరుకుగా వుంది.

ఈలోగా తాతయ్య ఆనందరావు బంధువర్గం గురించి ఆరాలు తియ్యసాగాడు. అందులో తమ కుటుంబ సంప్రదాయం గురించిన గర్వం ధ్వనిస్తూనే వుంది. అయితే కృష్ణమురళి ఈ విషయంలో మంచి హోంవర్క్ చేశాడు. ఆనందరావిచ్చే సమాచారంతో అక్కడక్కడ తాతయ్య బంధువర్గంతో లింకులు కలుస్తున్నాయి. అలా కలిసినప్పుడల్లా తాతయ్య ముఖం గర్వంతో వెలిగిపోతోంది.

"అంతా బాగుంది. కానీ నేను మిమ్మల్ని ముఖ్యమైన విషయం అడగదల్చుకున్నాను. అది శకుంతల తలిదండ్రుల గురించి. వాళ్ళెప్పుడొస్తారు?" అన్నాడు ఆనందరావు.

తాతయ్య తడబడ్డాడు. "అమ్మాయికీ, అల్లుడికీ మేమంటే గౌరవం. అమెరికాలో సంప్రదాయం కుదరదనీ ఆడపిల్ల పెంపకానికి అది తగదనీ వాళ్ళు శకుంతలను నెలల గుడ్డుగానే

మా దగ్గర వదిలి అన్ని బాధ్యతలూ మాకు అప్పజెప్పారు. సంబంధం నిశ్చయించేదికూడా మేమే! వాళ్ళు పెళ్లికి వస్తారు". రారని తెలిసీ ఆఖరుమాట అబద్ధం చెప్పాడాయన.

"అయితే శకుంతల తలిదండ్రుల ఫోటోలు చూపించండి. దాంతో నాచూపుల కార్యక్రమం ముగిసిపోతుంది" అన్నాడు ఆనందరావు.

ఆల్బంలోంచి ఓ మంచి ఫోటో చూసి తెచ్చాడు శకుంతల మామయ్య.

ఆనందరావు ఆ ఫోటో అందుకుని చూసి ఏదో అనబోయి ఉలిక్కిపడ్డాడు.

"ఇతను మీ అల్లుడా? " అన్నాడాయన.

"అవును, ఏం? " అడిగాడు తాతయ్య.

"ఇతణ్ణి నేను నిన్న విశాఖపట్నంలో చూశాను" అన్నాడు ఆనందరావు.

"ఎవర్నిచూసి ఎవరనుకున్నారో. అమెరికాలో ఉన్నవాడు విశాఖపట్నంలో ఎలా కనిపిస్తాడు? "

"ఎవర్నిచూసి ఎవరో అనుకునేందుకు ఇతగాడు నేనెరుగని మనిషి కాదుకదా! ఇతడి పేరు భాస్కర్. చాలాఏళ్ళుగా నాకు తెలుసు. నాకు తెలిసినప్పట్నించీ ఇండియాలోనే ఉంటున్నాడు. మీరేమో అమెరికా అంటున్నారు" అన్నాడు ఆనందరావు.

"పేరు కరక్టుగానే చెప్పారు. మా అల్లుడి పేరు భాస్కర్. కానీ..."

కాసేపు ఒకరిమాట ఒకరికి అర్థంకాలేదు. చివరకు ఆనందరావు "నేను భాస్కర్ని ఇక్కడికి పిలిపించేదా? " అన్నాడు.

తాతయ్యా, అమ్మమ్మ, అత్తయ్యా, మామయ్యా- అంతా తెల్లబోయారు.

చివరకు 'పిలిపించండి' అన్నాడు తాతయ్య.

★ ★ ★

మర్నాడుదయం పన్నెండింటికి మళ్లీ కృష్ణమురళి బృందం శకుంతల ఇంటికి వెళ్ళారు. వాళ్ళతోపాటు భాస్కర్, మరో స్త్రీ వున్నారు.

"అల్లుడూ" అన్నాడు తాతయ్య ఆశ్చర్యంగా భాస్కర్ని చూస్తూ.

"సారీ, నేను మీ అల్లుణ్ణికాను" అన్నాడు భాస్కర్.

"అంటే నువ్వు అచ్చం మా అల్లుడి పోలికతోనే వున్న..." మాటలు రాక ఆగిపోయాడు తాతయ్య.

"అయాం సారీ, నాకూ అమెరికాలో వున్న మీ అల్లుడికీ ఏ పోలికలూ లేవు" అన్నాడు భాస్కర్ శాంతంగా.

"అమెరికాలో వున్న మా అల్లుడు మీకు తెలుసా? "

"నాకు తెలుసు. కానీ మీకు తెలియదు..." అన్నాడు భాస్కర్.

"ఏమిటో అంతా గజిబిజిగా వుంది. ఏంజరుగుతోందిక్కడ? " అంది అమ్మమ్మ.

"అసలు గజిబిజి నాది. భాస్కర్ తెలుసు. అతడి భార్య తెలుసు. కానీ మీ ఇంటి ఫోటోలో భాస్కర్ వున్నాడు. అతడి పక్కన వేరే అమ్మాయుంది. బహుశా ఆ అమ్మాయి మీకూతురు. యామై రైట్..."

"భాస్కర్ మా అల్లుడు కూడా" అన్నాడు తాతయ్య.

"అయితే నేను మీ అమ్మాయినా? " అంది భాస్కర్ పక్కన వున్న స్త్రీ.

"నువ్వెవరమ్మా? " అన్నాడు తాతయ్య.

"నా భార్య" అన్నాడు భాస్కర్.

ఆమాట అక్కడ బాంబులా పేలింది.

"మరి మా సీత ఏమయింది? " ఒక్కసారి చాలా గొంతులాక్రోశించాయక్కడ. సీత శకుంతల తల్లి.

"సీత తన భర్తతో అమెరికాలో వుంది. ఆ దంపతుల ఫోటో నా దగ్గరుంది. కావాలంటే చూడండి" అంటూ ఆనందరావు తన జేబులోంచి ఒక ఫోటో తీసిచ్చాడు.

ముందు తాతయ్య ఆ ఫోటో చూశాడు. తర్వాత అది చేతులు మారింది.

అందులో వారికి తెలిసిన సీత వుంది. పక్కన వారికి తెలిసిన భాస్కర్‌కు బదులు మరో మనిషి వున్నాడు.





"ఏమిటిదంతా?" అరిచాడు తాతయ్య.

"మీ సంప్రదాయం" అన్నాడు ఆనంద రావు.



సీత సూర్యారావును ప్రేమించింది. అతణ్ణే పెళ్ళిచేసుకోవాలనుకుంది. సూర్యారావు కూడా ఆమెను ప్రాణప్రదంగా ప్రేమించాడు.

సూర్యారావుకు అయినవాళ్ళంటూ లేరు. అందువల్ల తనపెళ్ళికి తనే పెద్ద.

సీత తన ప్రేమ గురించి ఇంట్లో తండ్రికి చెప్పింది. ఆయన సూర్యారావు వివరాలడిగాడు. మండిపడ్డాడు.

"ఒక్కసారి అతణ్ణిచూడు నాన్నా! ఒక్కసారి మాట్లాడు. ఆ తర్వాత నువ్వే నిర్ణయం తీసుకున్నా శిరసా వహిస్తాను" అంది సీత.

"వాణ్ణి చూడను. వాడితో మాట్లాడను. వాడి ఇంటి గడప తొక్కితే సహించను" తండ్రి సూర్యారావు పట్ల తన ద్వేషాన్ని వ్యక్తపరిచాడు.

అంతేకాదు, ఆయన క్షణాలమీద ఆమెకు, భాస్కర్‌కి సంబంధం స్థిరపరిచాడు.

"ఇది న్యాయంకాదు" అంది సీత.

"ఇదే న్యాయం" అన్నాడు తండ్రి.

"అయితే నేనిల్లు విడిచి వెళ్ళిపోతాను" అంది సీత.

"ఈ ఇంటి పరువు నీమీద ఆధారపడి వుంది. మా ఇష్టానికి వ్యతిరేకంగా ఇల్లు విడిచి వెడితే ఇంటిల్లిపాదీ విషం తాగి చస్తాం" అన్నాడు తండ్రి.

సీత వణికిపోయింది. సూర్యారావుని కలుసుకుని విషయం చెప్పింది.

"జీవితంలో ప్రేమంటే ఎరుగను. నువ్వు నాకు ప్రేమను రుచి చూపించావు. ఈ జన్మకు అది చాలనుకుంటాను. ఇలా నీ పెళ్ళి జరగ్గానే అలా జన్మ చాలిస్తాను. ఇది బెదిరింపుకాదు. నా మనసు చూపుతున్న మార్గం" అన్నాడు సూర్యారావు.

సీత తండ్రికి సూర్యారావు మాటలు చెప్పింది.

"అందుకే ప్రేమించడం తప్పంటాను. ప్రేమ చావును కోరుతుంది. నీపెళ్ళికి వాడో, మేమో చావాలనుంది. ఎవర్ని చంపాలీ అన్నది నువ్వు నిర్ణయించుకో" అన్నాడు తండ్రి.

ఆమె నిర్ణయం గురించి తండ్రికి సందేహమున్నట్లులేదు. ఆయన పెళ్ళి ప్రయత్నంలో ముందుకు వెడుతున్నాడు. వ్యవహారం ముహూర్తాల దాకా వచ్చింది.

సీత ఇక చేసేదిలేక సూర్యారావుని అనునయించడం మొదలుపెట్టింది. తనకు పెళ్ళైనా సరే అతడు బతకాలనీ, అతడు లేకుంటే తనూ ఆత్మహత్య చేసుకుంటాననీ చెప్పింది.

"సీతా! ముందే చెప్పాను నేను నిన్ను బెదిరించడంలేదని. నిన్ను ప్రేమించాక నువ్వులేని జీవితం అర్థంలేనిదని నాకు అనిపించింది. నీకు వేరెవరితోనైనా పెళ్ళి జరిగితే నా మన సెటుపోతుందో నాకే తెలియదు. నాకు అదుపు లేని విషయాలపై నీ శాసనం అమలు చెయ్యాలని చూడకు" అన్నాడు సూర్యారావు.

అతడి ప్రేమలోని నిజాయితీ ఆమెకు తెలుసు.



చతుర... 119

పవిత్ర ప్రేమ అంటే అర్థం కూడా ఆమె అతడి వద్దనే తెలుసుకుంది.

ఇద్దరూ తరచుగా కలుసుకునేవారు. ఎన్నో విషయాలు మాట్లాడుకునేవారు. అతడు ఆమెతో అన్నీ నిదానంగా చర్చించేవాడు. ప్రతి వ్యక్తిలోనూ మంచినీ, గొప్పతనాన్నీ గ్రహించి మిగతావి విమర్శిస్తే వ్యక్తిత్వం వికసిస్తుందనేవాడు. గతంనుంచి నేర్చుకోవాలనీ, భవిష్యత్తు గురించి నేలవిడిచి సాము చేయకుండా కలలు కనాలనీ చెప్పేవాడు. ఆలోచనల్లో, మాటల్లో శృంగారానికి తావునిచ్చేవాడు కాదు. అయినా అతడి సమక్షంపట్ల ఆమెకెంతో ఆకర్షణ ఉండేది. ఆ ఆకర్షణలోంచి ఒకోసారి మోజుపుట్టి తొందరపాటు ఆమె నుంచే వచ్చిన సందర్భాలు రెండుమూడున్నాయి. అతడి నిదానం, నిగ్రహం ఆమెను కాలుజారనివ్వలేదు. తర్వాత ఆ సంఘటనలు తల్చుకుని సిగ్గుపడిందామె.

ఇంత నిదానం చూపిన సూర్యారావు తమ ప్రేమ ఫలించదంటే నిగ్రహాన్ని కోల్పోతున్నాడు. దాన్నిబట్టే తెలుసుకోవచ్చు అతడి ప్రేమ లోతు ఎంతగా పెరిగినదీ! సముద్రం లోతు పెరిగిన కొద్దీ తుపాను భీభత్సం ప్రమాదకరంగా పరిణమించవచ్చు అతడి ప్రేమకిప్పుడు తుపాను ప్రమాదం ఎదురుకానున్నది.

సూర్యారావు చూపిన సంస్కారంలో వెయ్యోవంతు కూడా చూపని తన తండ్రి సమాజంలో ఉన్నతుడిననుకుంటూ సూర్యారావును చిన్నచూపు చూస్తున్నాడు.

సూర్యారావు గురించి ఆలోచించిన కొద్దీ సీతకు సమాజంపైనా, తల్లిదండ్రులపైనా ద్వేషం పెరిగిపోసాగింది. అంతకంటే ఎక్కువ వేగంతో పెళ్ళి ముహూర్తం దగ్గరపడుతూంటే ఆమెలో రక్తం మరగసాగింది. అయినా అసహాయతతో ఆమె ఆ వేడిని భరించవలసివస్తోంది.

అలాంటి సందర్భంలో ఒకరోజున భాస్కర్ ఆమె ఇంటికి వచ్చాడు. షాపింగు పేరు చెప్పి ఆమెను బయటకు తీసుకుని వెళ్ళి ఓ పార్కులో చతికిలబడ్డాడు.

"నువ్వు సూర్యారావుని ప్రేమిస్తున్నావటగా" అన్నాడతడు.

సీత ఉలిక్కిపడింది. నెమ్మదిగా తమాయించుకుని "ఎవరు చెప్పారు? " అంది.

"సూర్యారావు..."

అంటే సూర్యారావు ఈ పెళ్ళి చెడగొట్టడానికి మార్గం ఎన్నుకున్నాడన్నమాట. ఇంతకాలం అతడి సంస్కారం గురించి ఎంతో ఉన్నతంగా భావిస్తోందామె. అతడి కారణంగా ఈ పెళ్ళి చెడిపోతే ఇంట్లో అతడి గురించి ఏమనుకుంటారు? అనుకున్నప్పుడు తానెలా సమర్థించగల్గుతుంది?

"ఏం చెప్పాడు సూర్యారావు? "

"మీ ఇద్దరికీ పరిచయముందనీ ఆ పరిచయానికి ప్రేమ అని పేరు పెట్టుకున్నామనీ అన్నాడు. కానీ దానికి స్నేహం అన్న పేరైతేనే చక్కగా అమరుతుందన్నాడు. మున్ముందు ఎవరైనా మీ గురించి చెడుగా చెప్పవచ్చుననీ నాకు ఏ సందేహాలున్నా ఇప్పుడే తీర్చుకోవచ్చుననీ అన్నాడు. అతడు మాట్లాడే పద్ధతి నాకెంతో నచ్చింది. అతడి మాటలు పూర్తిగా నేను నమ్మాను"

సీత తేలికగా నిట్టూర్చింది. కాబోయే భర్తతో ఆరు బయట తొలి సమావేశంలో ఆవిధంగా తన ప్రియుడి గురించి ప్రస్తావించవలసి ఉంటుందని ఆమె ఊహించలేదు.

"నీవు మనసులో ఏ శంకలూ పెట్టుకోవద్దు. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను. పొరపాటున కూడా నీ శీలాన్ని అనుమానించను. ఇది నా హామీ"

ఈ మాటలు సీతకు చిత్రంగా అనిపించాయి. అతడు పెళ్ళి చేసుకుంటానంటే సీతకు ఏ అనుభూతీ కలగలేదు. అనుమానించనంటే మాత్రం వళ్లు కాస్త జలదరించింది.

"సీతా! ఇప్పుడు నేనూ నీకో విషయం చెప్పాలి. నువ్వు సూర్యారావును




ప్రేమించినట్లే నేను రాధను ప్రేమిస్తున్నాను. మా ప్రేమ మీ ప్రేమంత పవిత్రమైనది కాదు" అన్నాడు భాస్కర్.

ఉలిక్కిపడిన సీత "ఇదంతా ఎందుకు చెబుతున్నట్లు? " అంది.

"నేను రాధను ప్రేమించాను. నువ్వు సూర్యారావును ప్రేమించావు. మన తల్లిదండ్రుల మూర్ఖత్వం తప్ప మన ప్రేమలకు ఏ అడ్డూ లేదు. ఈ మూర్ఖత్వానికి తలవంచి మన వ్యక్తిత్వాలనూ, భవిష్యత్తునూ సర్వనాశనం చేసుకుంటున్నామని నీకు అనిపించడం లేదా? " అన్నాడు భాస్కర్.

"అనిపించి చేయగలిగినదేముంది? " నెమ్మదిగా అంది సీత.

"ఉంది. ఆ సంప్రదాయాన్నే ఉపయోగించుకుని చాపకింద నీరులా పెద్దలను ప్రతిఘటిద్దాం. అందుకు నీ సహకారం కావాలి" అన్నాడు భాస్కర్ శాంతంగా.

"ఎలా? " అంది కుతూహలంగా సీత.

"పెద్దలు సంప్రదాయాన్ని నమ్మారు. ఆ ప్రకారం నీకూ, నాకూ పెళ్ళి. పెద్దలకు సంబంధించినంతవరకూ మనమిద్దరం భార్యాభర్తలం. ఆ విధంగా మనం పెద్దల అహాన్ని తృప్తిపరుద్దాం. మనం సంప్రదాయాన్ని నమ్మవద్దు. నేను రాధతో కాపురం చేస్తాను. సూర్యారావుతో నువ్వు కాపురం చేస్తావు. ఇంకా సంప్రదాయం పీకు తుందీ. పాండురాజులా నేను నిన్ను సూర్యారావుకు నియోగించాననుకో. మా ఇంట్లో పెద్దలకూ, మీ ఇంట్లో పెద్దలకూ ఇదే తగిన శాస్తి"

ఈ సూచన చేసినప్పుడు భాస్కర్ గొంతులో ధ్వనించిన కసి, ఆవేశం, అతడికి రాధపట్ల ఉన్న ప్రేమ లోతునూ, ఆ ప్రేమను అతడి పెద్దలు నిరసించిన తీరునూ ప్రతిఫలించాయి.

ఊహించని ఈ మలుపు తన ప్రేమ కథలో చోటుచేసున్నందుకామె ఏవిధంగా స్పందించిందో చెప్పడం కష్టం. అయితే భాస్కర్ పక్కా ఏర్పాట్లతో ఉన్నాడు. ఆ ప్రకారం సంప్రదాయబద్ధంగా అతడికి సీతతో పెళ్ళయింది. సూర్యారావు రాధను గుళ్ళో పెళ్లి చేసుకున్నాడు. పెళ్లైన వెంటనే రెండు జంటలూ అమెరికా వెళ్ళిపోయాయి. అక్కడ వాళ్లు ఇరుగు పొరుగులుగా ఉంటూ తమ ఏర్పాటు ప్రకారం జీవితం కొనసాగించడానికి అవసరమైన హంగులన్నీ భాస్కర్ ఏర్పాటు చేశాడు.

మగవాళ్లు దీనికి బాగానే అడ్జస్టయినా ఆడవాళ్లు అంత సులభంగా సరిపెట్టుకోలేకపోయారు. తన మెడలోని మంగళసూత్రం మాటిమాటికీ వెక్కిరిస్తున్నట్లనిపించి సీత నానుతాడును తీసేసింది. రాధ పరిస్థితి వేరు. ఆమె అనాథశరణాలయంలో పెరిగింది. ఆమె పుట్టుకను గురించి కొందరు లోకువగా మాట్లాడేవారు. సమాజంలో తనకు గౌరవస్థానం లేదని ఆమెకు తెలుసు. పెళ్ళిద్వారా సమాజంలో హోదా సంపాదించాలని ఆమె ఆశపడింది. భాస్కర్ ప్రేమ లభిస్తే పొంగిపోయింది. భాస్కర్ మంచివాడని రుజువైనా అతడినే భర్త అనుకున్నా సంప్రదాయం ప్రకారం ఆమె భర్త సూర్యారావు. కాపురం చేస్తున్నది భాస్కర్‌తో ఏదో న్యూనతా భావంతో ఆమె బాధపడేది. న్యూనతా భావం లేకపోవడంవల్ల సీత ఇబ్బందిపడిందేమో కానీ మానసిక క్షోభకు గురికాలేదు.

రాధ గర్భవతి అయింది. తను తన పుట్టుకకు తగిన జీవితాన్నే వారసత్వంగా పొందినట్లు ఫీలవుతూ తన బిడ్డ భవిష్యత్తు గురించి బెంగపెట్టుకుందామె. నెలలు నిండి ఆడపిల్లను ప్రసవించాక ఆమెకు ఆరోగ్యం పాడయింది. డాక్టర్లు ఆమె జబ్బు మానసికం అన్నారు. పిల్లకు మూడు నెలలు నిండేసరికి ఆమె కన్నుమూసింది. చనిపోయేముందామె భర్తతో "నా చావుకు కారణం నా పుట్టుక. దీని పుట్టుకకు విలువ కలిగించు. దీని బతుకును సంప్రదాయం మెచ్చేలా నడిపించు. ఇది నా చివరికోరిక" అంది.



భాస్కర్ చలించిపోయాడు. అతడికి జీవితమంటే విరక్తి భావం కలిగింది. ముఖ్యంగా తన వాళ్లంటే అతడికి శత్రు భావం కలిగింది. అతడు పిల్లను సీతకు అప్పగించి, "రాధ కోరిక నీవల్లనే తీరాలి. ఇక ఈ పిల్లకూ, నాకూ ఏ సంబంధంలేదు. నేను ఇండియా వెళ్ళిపోతాను. అక్కడ నా బతుకును అజ్ఞాతంగా కొనసాగిస్తాను. నా వాళ్ళనూ, మీ వాళ్ళనూ నేనిక్కడే అమెరికాలో ఉన్నాననుకోనివ్వు. నీవు ఇండియా వచ్చినప్పుడు కానీ, నీకు నా అవసరం కలిగినప్పుడు కానీ నేను తప్పక నీ పక్కన ఉంటాను. అది నీకోసమే కాదు. నా కూతురు బతుకును సంప్రదాయం మెచ్చేలా తీర్చిదిద్దడానికీ నాకా అవసరముంది" అన్నాడు.

ఇండియాకు తిరిగివచ్చిన కొంతకాలానికి భాస్కర్ వేరే పెళ్ళి చేసుకున్నాడు. అతడు తల్లిదండ్రులకుత్తరాలు రాయాలన్నా అమెరికాకు పంపేవాడు. వాళ్ళనెప్పుడైనా కలుసుకున్నా అమెరికానుంచి వచ్చినట్లే మసిలేవాడు. సీత అతడి కూతురుకు శకుంతల అని పేరుపెట్టి రాధ కోర్కెకు అనుగుణంగా ఆమె పెరగాలనుకుని ఆ పిల్లను తన తల్లిదండ్రులవద్ద విడిచిపెట్టింది. అవసరాన్నిబట్టి కూతురికోసం భాస్కర్ అమెరికాకూ, అత్తవారింటికీ వెడుతూ కథనడుపుతున్నాడు.

★ ★ ★

"ఇదీ మీ సంప్రదాయం కథ" అన్నాడు భాస్కర్.

ఈ కథ విని శకుంతల ఇంట్లోని వారందరూ బ్రమాన్నపడిపోయారు.

"శకుంతలకు ఇదంతా తెలుసా? " అన్నాడు ఆమె మామయ్య కాస్త తేరుకున్నాక.

"తెలియదు. కానీ పవిత్రతకూ, సంప్రదాయానికీ ప్రాధాన్యతనివ్వాలని మథనపడి మథనపడి ఆమె తల్లి ప్రాణాలు కోల్పోయింది. ఆ ప్రాధాన్యత ఆమె నరనరాల్లోనూ ప్రవహించడంవల్లనేమో ఆమె పతివ్రతలకంటే ఓ మెట్టు పైకి వెళ్ళి ప్రియవ్రత కావాలనుకుంది. పవిత్రతను తనువుకూ, మనసుకూ మాత్రమే పరిమితం చేయడం వల్ల ఆమెకు కులమతాల వాసనలు అంటలేదు. ప్రేమ పుట్టిన క్షణాన రాజు అనుకుంది. ఒకసారి రాజుకు మనసులో స్థానమిచ్చేక మరేమగవాడికీ ఆమె మనసులో స్థానం లేదు. ఆ స్థాయికి ఎదిగిన ప్రేమమయికి, పవిత్రమూర్తికి మీరు కలుషిత సంప్రదాయంతో అభిషేకం చేస్తూ దానికి పెళ్ళి అని పేరు పెట్టాలనుకుంటున్నారు" అన్నాడు భాస్కర్.

"ఇంత భాగోతం జరుగుతూంటే ఇన్నాళ్లూ దాచి ఈరోజు బయటపెట్టాల్సొచ్చిందా? " అన్నాడు తాతయ్య. ఆయన మనసు ఆవేదనతో నిండిపోయింది. అంతకాలం తన చేతుల్లో పెరిగి తనను మురిపిస్తూ, శాసిస్తూ మసలుతున్న మనమరాలు తన కూతురు బిడ్డ కాదనీ అసలు తనకేమీ కాదనీ తెలిసి ఆయనకెంతో ఉక్రోషంగా ఉంది.

"కారణం నేను చెబుతాను. భాస్కర్‌కు తెలిసింది కదా పెద్దల మూర్ఖత్వం ప్రేమికులనూ, ప్రేమనూ ఏవిధంగా బలితీసుకుంటుందో అందుకని ఆయన అజ్ఞాతంగా ఉంటూ ప్రేమికులకు సాయపడే వెబ్‌సైటునొకటి ఇంటర్నెట్లో ఓపెన్ చేశాడు. అది సేవ్ లవ్ డాట్‌కామ్. నేనాయన అనుచరులలో ఒకణ్ణి. శకుంతల రాజుతో ప్రేమలో పడ్డాక ఒకసారి దర్పణిని సాయంకోరింది. అప్పుడు దర్పణి అనుకోకుండా ఇంటర్నెట్లో సేవ్ లవ్ డాట్‌కామ్ చూసి దానికి అప్లికేషన్ పెట్టింది. శకుంతల వివరాలు తెలుసుకుని ఆమె తన కూతురేనని గ్రహించిన భాస్కర్ ఆమె ప్రేమను రక్షించడానికి నన్ను పంపాడు. రాజుతో ఆమె పెళ్ళి జరిగేలోగా ఇతర సంబంధాలను చెడగొట్టడమే నా డ్యూటీ. నేను శకుంతలను ప్రేమిస్తున్నట్లు




నటిస్తూ నా డ్యూటీని సక్రమంగా నిర్వహించాను. నాతో శకుంతల పెళ్ళి స్థిరపడేలా ఉన్నప్పుడల్లా శశాంకను రెచ్చగొట్టి తాత్కాలికంగా చెడేలా చేశాను. రమేష్, శశాంకల సంబంధాలూ నేనే చెడగొట్టాను. ప్రియవ్రతగా శకుంతల సృష్టించిన ఆదర్శానికి ఏమాత్రమూ తీసిపోని విధంగా రాజు తన తల్లి మీద వేసిన ఒట్టుకు తన పెళ్ళికంటే ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చాడు. దాంతో పెళ్ళి మళ్ళీ నా పీకెలమీదకు వచ్చింది. శశాంకను రెచ్చగొట్టి చూశాను. కానీ అతడిలో పూర్తి మార్పు వచ్చేసింది. దాంతో ఇక తప్పనిసరై అసలు కథను అసలు పాత్రధారుల ద్వారానే మీకు చెప్పించాలనుకున్నాను. చెప్పించాను" అని ఓ క్షణం ఆగి, "సంప్రదాయాన్ని కులానికీ, మతానికీ అంటగట్టే మూర్ఖులకు అందనంత మహోన్నత శిఖరాలకు చేరుకున్న ప్రేమ మూర్తులు రాజు, శకుంతల. వాళ్ళకు మీరు పెళ్ళి జరిపిస్తే సరేసరి. లేకుంటే నేను శకుంతలను పెళ్ళిచేసుకుని రాజుకు అప్పజెపుతాను. అప్పుడామె పతివ్రత కాలేకపోయినా ప్రియవ్రతగా మిగిలిపోతుంది. కానీ శకుంతల సీతలా తలెత్తుకుని బతుకుతుందో రాధలా జీవితం చాలిస్తుందో నాకే తెలియదు. నేను చెప్పాల్సింది చెప్పాను. ఇక మీ యిష్టం" అన్నాడు కృష్ణమురళి.

"బాబూ నువ్వు చెప్పేది వింటూంటే మేము సంప్రదాయాన్ని పాటించామనిపించడంలేదు. ప్రగతిని నిరోధించామనీ, ప్రేమను విరోధించామనీ అనిపిస్తోంది. అది భ్రమే అయినప్పటికీ భాస్కర్, సీతలు ఆడిన నాటకానికి అప్పుడే తెర దించవద్దు. మా సహకారముంటే ఆ నాటకం మరింత రక్తికడుతుంది. ఈ నాటకం ఇలాగే కొనసాగాలి. ఎందుకంటే శకుంతల ఎల్లకాలం నా మనుమరాలిగానే ఉండిపోవాలి. దాని పెళ్ళి అది కోరుకున్న వాడితోనే జరుగుతుంది. మా జీవితాలకులా దాని జీవితాన్ని భ్రమ కానివ్వను" అన్నాడు తాతయ్య.

"సేవ్ లవ్ డాట్ కామ్ ఆపరేషన్ సక్సెస్‌ఫుల్" అన్నాడు భాస్కర్.

★ ★ ★

అక్కడ శశాంక బృందం, దర్పణి, కృష్ణ మురళి ఉన్నారు.

"ఫెంటాస్టిక్. నేను హీరోననుకుంటే నువ్వు హీరోలకే హీరోవి" అన్నాడు శశాంక కృష్ణమురళితో.

"హాయ్- పెదాలకు లిప్‌స్టిక్ పూయడం మానేశాను. నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటావా? " అంది దర్పణి కృష్ణమురళిని కొంటెగా చూస్తూ.

"సారీ- సేవ్ లవ్ డాట్‌కామ్‌లో ఆపరేషన్ 2003 ఎసైన్‌మెంటుంది. అదయ్యేదాకా ప్రేమ గురించి ఆలోచించే అవకాశం లేదు. ఏమంటావ్ మిస్టర్ కాళిదాసూ" అన్నాడు కృష్ణమురళి.

కాళిదాసునుంచి బదులులేదు. అతడివైపు చూస్తే మనిషి వెల్లకితలా పడి ఉన్నాడు.

"ఏమైంది? " కంగారుగా అన్నాడు కృష్ణ మురళి.

"కంగారేంలేదు. నీ కథ విని పడిపోయాడు. బహుశా కలగంటున్నాడేమో" అన్నాడు భాస్కర్.

అది నిజం. అప్పుడు కాళిదాసు స్వప్న ప్రపంచంలోనే ఉన్నాడు "ఇంతవరకూ ఏ కవికీ అందని స్త్రీ పాత్ర నీదే! మన సంప్రదాయంలోని మంచిని విస్మరించకుండా, పాశ్చాత్య సంప్రదాయంలోని విశృంఖల మోహానికి తల వంచకుండా, స్త్రీ జాతిని న్యూనతకు గురిచేయకుండా మహోన్నతాదర్శాలను పాటించే అద్భుతానివి నీవు. సుందరీ అందుకో వందనం" అంటున్నాడతడు కనులు మూసుకునే.

ఆ మాటలు పలవరింతలై అతడి పెదాలు దాటగానే అక్కడున్న అందరూ అప్రయత్నంగా ఒకేసారి" శకుంతల ఇతగాడి కలలోకి వచ్చినట్లుంది" అన్నారు.



# చతుర ప్రపంచం

## మత సామరస్యం

కుప్వారా పట్నం సమీపంలో లాల్‌పోర్ అనే గ్రామం ఉంది. అక్కడ ఒక పండితుడు తన కుటుంబంతో జీవిస్తున్నాడు. ఈమధ్య పండిట్ ఇంట్లో పెళ్లి జరిగింది. అంగబలం బొత్తిగా లేనివాడు ఆయన. అయితేనేం గ్రామంలోని మహమ్మదీయులందరూ ఏకమై వున్న మరొక గ్రామానికి చెందిన అదిత్‌కౌల్‌ను పెళ్లాడ్డానికి వెళ్లాడు. అతనికి 10 వేల మంది ముస్లింలు వారి భార్యలతో వెళ్లి సాదరంగా స్వాగతం పలికారు. గ్రామంలోకి ఆదరంతో తీసుకువెళ్లారు. అదిత్ తండ్రి 40 సం.రాలు అక్కడే జీవించాడు. ఆ గ్రామంలో ఉంటున్న పండిట్‌ల కుటుంబాలు కొన్ని నగరాలకు వలస వెళ్లాయి. అదిత్ తండ్రి జానకినాథ్ కుటుంబం




అతనికి అండగా నిలిచారు. వారి ఆధ్వర్యంలో పెళ్లి ఘనంగా జరిగింది. పండిట్ ఇంట ఆచారం ప్రకారం జరిగే అన్ని కార్యక్రమాల్లో ముస్లిం సోదరులు పాల్గొని వాటిని చక్కగా పూర్తి చేయించారు.

అదే విధంగా శ్రీనగర్‌లో ఉంటున్న సురేంద్రకుమార్, ఆ గ్రామానికి దగ్గరగా మాత్రమే అక్కడ మిగిలింది. వారికి ఏ లోటూ రానివ్వకుండా ముస్లింలు దగ్గర ఉండి, వివాహాన్ని ఘనంగా జరిపారు.

ఇటువంటి సౌభ్రాతృత్వం, మతసామరస్యం మనదేశంలో ఎల్లెడలా పరిఢవిల్లవలసి ఉంది! అప్పుడు కష్టాలు, కలహాలు ఉండనే ఉండవుగదా!

---

## హోరా హోరీ

తరుచుగా మనుషులూ మనుషులూ కొట్లాడుకుంటున్నట్లే జంతువులు సహితం హోరాహోరీ పోరాడుతూ ఉంటాయి. గోవాలోని బోండ్ల జంతు సంరక్షణ కేంద్రంలోని ఒక అతి పెద్ద కొండచిలువ ముళ్లపందిని బలంగా చుట్టేసి అమాంతం మింగెయ్యడానికి ప్రయత్నించింది. అటువంటి కార్యక్రమం కొండచిలువకు బహు తేలిక.

అయితే ముళ్ల పంది సామాన్యురాలు కాదు సుమా! అది సిసింద్రీలా అంత




ఎత్తున ఎగిరెగిరిపడి భయంకరమైన అరుపులతో తన అతి సూదైన ముళ్లతో కొండ చిలువను తీవ్రంగా ఎదుర్కొంది. దాని ముళ్లవలన చిలువ శరీరమంతా చీరుకుపోయింది. ఒకటే రక్తం! చివరికది ముళ్ల పందిని వదిలి పెట్టింది. పిమ్మట ఆ కేంద్రం అధికారులు హుటాహుటిన కొండ చిలువను, కొద్దిగా గాయపడిన ముళ్ల పందిని హాస్పిటల్ కు తీసుకువెళ్లారు.

ఎక్స్‌రే డిపార్ట్‌మెంట్‌లోని టెక్నీషియన్స్ నీర్సపడిన కొండచిలువను చూసి విస్తుపోయారు. మూలుగుతున్న ముళ్ల పంది సహితం వారికి ఆశ్చర్యం కలిగించింది. వారు ధైర్యంగా కొండ చిలువను పట్టుకొని దానికి మంచి శక్తిని ప్రసాదించారు. ముళ్ల పందికి 22 ఇంజక్షన్ల వరకూ చేసి చిన్నచిన్న కట్లు కట్టి కేంద్రానికి పంపారు. అలాగే కొండచిలువను కూడా పంపడం జరిగింది. అంతవరకూ పక్కపక్కనే వున్న ఆ రెండు జీవాలను దూరంగా మార్చారు కేంద్రం వారు.

---

## బివేర్ ఆఫ్ మినరల్ వాటర్

వినియోగదారులు తాము వినియోగించే వస్తువులను ఎంతో ధర చెల్లించి వినియోగిస్తూ ఉంటారు. ఆనక వాటివల్ల ఎన్నో అవస్థలకు గురవుతారు.

చిత్రమేమిటంటే నేషనల్ కన్స్యూమర్ డిస్ప్యూట్స్ రెడ్రెసల్ కమీషన్, జస్టిస్ వాద్వాగారే ఈమధ్య ఆ ఇబ్బందికి గురయ్యారు. ఆయన తాగిన మినరల్ వాటర్ బాటిల్‌లో చీమలు, పురుగులు ఒక్కుమ్మడిగా బయటకు వచ్చి ఆయనకు టాటా చెప్తూ వెళ్లాయి. బాటిల్ తెరవగానే జరిగిన సన్మానం అది! వాద్వా బస చేసిన స్టేట్ గెస్ట్‌హౌస్‌లోని 3 మినరల్ వాటర్ బాటిల్స్‌ను తన వద్దకు రప్పించాడు.

వాటిల్లో ఒక మూత సరిగాలేదు. అనేక చీమలు మూతలోకి వెళ్లి అక్కడ కాపురం పెట్టాయి. రెండవ బాటిల్ మూడవ బాటిల్‌లో కూడా పురుగులు కుటుంబంతో, చీమలు బంధువులతో స్థిర నివాసం ఏర్పాటు చేసుకొన్నాయి. జడ్జిగారు బోలెడు ఆశ్చర్యానికి గురి అయ్యారు.

సాక్షాత్తూ కమిషన్ అధిపతులే ఈ దృశ్యాన్ని వీక్షించినప్పటికీ, పొరపాటున కొంత జలాన్ని స్వీకరించినప్పటికీ బలమైన సాక్ష్యం లేనందున ప్రాసిక్యూషన్ వారు మినరల్ వాటర్ కంపెనీపై చర్య తీసుకోలేక తెల్లమొహాలు వేశారు. ఈసారి మనం తాగే మినరల్ వాటర్‌తో




గొంతులు తడిపేముందు తగిన జాగ్రత్తలు తీసుకోవడం మంచిదేమోకదూ!

---

## పత్రికల సేకరణ!

పలక్కాడ్ జిల్లాలో నన్‌గనది ఓ చిన్న గ్రామం. అక్కడ బాలచంద్రన్ నివశిస్తున్నాడు. అతను పాతకాలపు వార్తాపత్రికలు, నేటిపత్రికలు సేకరించడం హాబీగా పెట్టుకున్నాడు. వాటితోపాటు వార మాసపత్రికలు, విదేశాల నుంచి వచ్చే పత్రికలు సేకరిస్తాడు. ప్రస్తుతం అతని వద్ద 3 వేలకు మించిన ఇంగ్లీషు, మలయాళ భాషలకు చెందిన పత్రికలు ఉన్నాయి. ఆయన వద్ద అనేక పత్రికల ప్రారంభ సంచికలు, ఆయా పత్రిక చివరి సంచికలు సహితం ఉన్నాయి. అతను సేకరించిన వాటిల్లో కొన్నిటి పేర్లు బహు తమాషాగా ఉంటాయి. ఒక పత్రిక పేరు 'పాంబరమ్', మరొకటి 'నోంబరమ్', 'అమ్మ' పేరిట ఓ పత్రిక 'ముతస్సి' అనేది మరొకటి. 'సాధు', 'అసధుర్', 'నజ్రూబీ', 'కురుక్షేత్రమ్', 'ధర్మక్షేత్రమ్', అనేవి మరి కొన్ని పత్రికలు! ఎంతో కృషి, పట్టుదలతో అత్యంత శ్రమపడి బాలచంద్రన్ ఈ పత్రిక యజ్ఞాన్ని నిర్వహిస్తూ ఉండడం ఎంతైనా శ్లాఘనీయం.



# 'అగమ్య' పై సమీక్షలు

మార్చి చతురలో ప్రచురితమైన సూరేపల్లి విజయ నవల
'అగమ్య' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## అర్థం-పరమార్థం?

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

అగమ్య నవల చదివినపుడు 'సొంత లాభం కొంతమానుకుని పొరుగువాడికి తోడుపడవోయ్' అన్న గురజాడ మాటలు, ప్రజలు తనను చూసి భయ భ్రాంతులై పారిపోవటం చూసి బుసకొట్టా లన్న కనీస జ్ఞానం మరచి ప్రాణం మీదకు తెచ్చుకున్న 'పాము-ముని' కథ గుర్తొచ్చాయి. శక్తికి మించి సహాయపడి, నీకంటూ ఏమీ లేకుండా నిస్సహాయంగా, నిస్తేజంగా మిగలద్దని పై ఉదంతాల సారాంశం. ఊహల్లో, ఆదర్శాలలో కని పించే పాత్ర అగమ్య. ఒకవేళ నిజజీవి తంలో కనిపించినా ఆ పాత్ర స్ఫూర్తిదా యకం, అనుసరణీయమైనదికాదు. ఎందు కంటే అతి మంచితనం చేతకానితనమవు తుంది కనుక. అగమ్యలాంటి అతి మంచి వాళ్లు చేతకానివారుగా మిగిలిపోతారు. అంతేకాదు వారి జీవితాలు విషాదభరి తాలు. అటువంటివారి మీద ఒక రకమైన నిట్టూర్పు, జాలి తప్ప మనకే భావం కలు గదు. ఆ పాత్ర మనుగడ అంతే. పుస్తకం మూయగానే మన స్మృతిపథం నుండి అంతర్ధానమవుతుంది.

నేటి ప్రపంచం స్వార్థపూరితం. రక్తసం బంధీకులతో సహా అందరూ స్వార్థపరులే. ఒక రకంగా హద్దుమీరని హాని కలిగించని స్వార్థం అవసరం కూడా. తనను పావులా తమ ప్రయోజనానికి తన ఆడబడుచు, మరిది వాడుకుంటున్నారని తెలిసి ప్రతిఘ



టించని లేదా నొప్పించక తానొవ్వక రీతిలో ప్రవర్తించలేని అగమ్యని మంచితనానికి నిర్వచనంగా రచయిత్రి చూపదలచారా? ఆవిడ ఉద్దేశ్యమదే అయితే అంత (అతి) మంచివారుగా ఉండాలని ఎవరూ అను కోరు.

మంచితనానికి ఒక అర్థం, పరమార్థం ఉన్నప్పుడే దాని విలువ మరింత పెరిగేది. సుగంధం తగుమాత్రంలో ఉన్నప్పుడు మాత్రమే దాని ఆఘ్రాణపు ఇంపు. రచ యిత్రి అగమ్య గురించి చెబుతారు. చదువు ఆమె ఆరోప్రాణం. బాగా చదువుకోవాలని గొప్ప పేరు తెచ్చుకోవాలని జీవితంలో ఎద గాలని ఆమె కోరిక. ఈ వయసులో ఉండే



ఆకర్షణ, పరస్పర ప్రేమానుభావాలు ఆమెలో లేవు. ఎంతో విశ్లేషణశక్తి, తెలివి తేటలున్న అగమ్య పాణిగ్రాహిని కేవలం అతని సంస్కారవంతమైన ప్రవర్తన, అడిగిన తీరు నచ్చి వివాహం చేసుకోవటానికి ఇష్టపడటం ఎంతవరకు సమర్థనీయం. అగమ్యలాంటి వ్యక్తిత్వం ఉన్న మనిషి ఆలోచన్లా ఇవి? పరస్పర విరుద్ధమైన ఈ లక్షణాలు ఈ పాత్ర ఔచిత్యాన్ని దెబ్బతీశాయి. స్నేహితురాలి వివాహ విషయంలో చూపిన చొరవ, ముందుచూపు తన విషయంలో కొరవడిందా!

తన మంచితనాన్ని బలహీనతగా చేసుకుని తన కుటుంబ సభ్యులు తనను వారి స్వార్థానికి పూర్తిగా ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నారని గ్రహించలేనంత అమాయకురాలు కాదు అగమ్య. మంచితనపు మెహర్బానితో వారిని తప్పు పట్టక తనను మరింత ఎక్స్‌ప్లాయిట్ చెయ్యటానికి మానసికంగా సిద్ధపడుతుంది. ఇది ఆమె మంచితనం శృతి మించటంలా ఉంది.

(అతి) మంచితనపు రథంలో నడిచిన అగమ్య జీవితం, అతలాకుతలమైంది. అగమ్యలోని అద్భుత వ్యక్తిత్వానికి ఏమాత్రం సరిపడని కథాకథనం.

*– మాతంగి శారద*
*విజయవాడ-10*

## టేకిటీజీ

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

**'తన సౌఖ్యమె తనకు స్వర్గం, తన దుఃఖమె తనకు నరకము' అనేది మనకు తెలిసిన సుమతీశతక నీతి. కానీ ఎదుటివారి ఆనందాన్ని చూసి తను సంబరపడి వారి సుఖం కోసం తన జీవితాన్నే కరిగింపచేసిన అగమ్యలాంటి త్యాగమూర్తులు కూడా ఉంటారనే వాస్తవాన్ని తెలియజేసిన రచయిత్రి** సూరేపల్లి విజయగారిది కొత్తతరహా రీతి. నవల చదువుతున్నంతసేపూ అలలులేని అనంత జీవనదీ ప్రవాహంతో ఓలలాడుతూ సాగుతున్న నావలో పయనిస్తున్న అనుభూతి కలిగి అగమ్య ప్రతిక్రియ నవల్లోని పాత్రలతోపాటు పాఠకుల్ని కూడా ద్రవింపజేస్తుంది. సమస్యల్ని సవాలుగా తీసుకునే అగమ్యకు లైఫ్‌ని టేక్ ఇట్ ఈజీగా భావించే పాణిగ్రాహిలాంటి భర్త లభించటం వాస్తవానికి దగ్గరగా ఉంది.

కన్నబిడ్డల్సైనా గుడ్డిగా నమ్మితే చివరికి చిప్పే గతి అవుతుందని, ఎవరి జాగ్రత్తలో వారుండాలని తెలియచెప్పే రతన్‌లాల్ పాత్ర కొడుకులు తమ బాగోగులు చూడట్లేదని వాపోయే తల్లిదండ్రులకు చిరు సందేశాన్నిచ్చింది. ఈ నవలలోని మూడు వృద్ధ జంటలు భర్తతోపాటే భార్య అన్నట్లు చనిపోవటాన్ని పరిశీలిస్తే ఆ పాత్రల అవసరం అంతటితో తీరిపోవటం అనిపించింది.

'ఆడదాని జూడ అర్థంబు జూడ బ్రహ్మకైనా బుట్టు రిమ్మతెగులు' అన్నట్లు మరిది ఆడపడుచులతోపాటు అగమ్య కొడుకు, కూతురు కూడా వేరై దూరంగా పారిపోవడంవల్ల ప్రేమ, ఆప్యాయత అనేవి వారసత్వం కాదని మట్టిలో మాణిక్యాల్లా బురదలో పుట్టిన కలువల్లా విలువైనవని ఋజువైంది. స్వార్థాన్ని మానుకొని అందరికీ దారి చూపిన అగమ్య చివరికి 'స్వ' అర్థం (సొంతడబ్బు) లేక రోడ్డుపాలైన తీరు త్యాగం అని పైకి చెప్పుకోవటానికి బాగున్నా 'తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం' అనే సందేశాన్నిస్తుంది.

*– కర్నాటి దుర్గాభవాని*
*విజయవాడ*

## కొత్త అర్థం

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

**మానవత్వం అనే మాటకు అర్థం అగమ్య.**

నేటి సమాజంలో అగమ్యలాంటి వ్యక్తులు అరుదు. అత్తమామలను స్వంత తల్లిదండ్రుల లాగ ఆదరించి వారి పిల్లలను తన పిల్లలకన్నా ఎక్కువగా భావించి వారికోసం జీవితమంతా ధారపోసి తొణకని ఆత్మవిశ్వాసంతో కుటుంబాన్ని నడిపించిన తీరు నిజంగా ప్రశంసనీయం.

ఏ మనిషి అయినా తననుతాను ప్రేమించుకొన్న తరువాత ఇతరులను ప్రేమించడం మొదలుపెడతాడు. కాని అగమ్యలాంటి వాళ్లను చూశాక ప్రేమ అనే మాటకు కొత్త అర్థాన్ని, సరి కొత్త పరమార్థాన్ని వెతుక్కోవలసి వస్తుంది. మానవతా విలువల్ని మరిచిపోతున్న నేటి ఈ సమాజంలో ఇంకా ఇటువంటి మంచి మనుషులు ఉన్నారని కళ్లకు కట్టినట్లుగా చూపించిన రచయిత్రికి అభినందనలు.

'నువ్వేం చేసినా బాగా ఆలోచించి చేస్తావు నీకేది మంచిది అని తోస్తే అది చేయి' అంటూ భార్యకి ఒక పొగడ్త పారేసి ఇంటి సమస్యల నుండి ఎస్కేప్ అయ్యే పాణిగ్రాహి లాంటి భర్తలను సమాజంలో చాలా మందిని చూస్తుంటాం.

'వదినా నువ్వు అమ్మవి, నాన్నవి, అన్నవి అన్నీ నువ్వే. మాకు పుట్టే బిడ్డకు నీ పేరే పెట్టుకుంటాం' అంటూ కన్నీళ్లతో అఖిల, 'ఇవి మామూలు పాదాలు కావు వదినా! బ్రహ్మ కడిగిన పాదాలు కన్నా నీ పాదాలు నాకు పరమ పవిత్రమైనవి. ఈ చదువూ, ఈ హోదా, ఈ ఉద్యోగం నువ్వు ప్రసాదించిన వరం' అంటూ కాళ్లమీద పడిన సుందర్ లాంటి కృతఘ్నులు కూడా ఉంటారని చెప్పిన తీరు బాగుంది.

పరిష్కారం లేని సమస్యలు అంటూ ఉండవని అంటూ సంగీత, ఆదినారాయణ దంపతుల మధ్య అనుమానం అనే సమస్యను పరిష్కరించిన తీరు కూడా బాగుంది.

ఆస్తి మొత్తం కొడుకు, కోడలు పేరున రాసి దగాపడ్డ రతన్‌లాల్ దంపతులు, కార్తీక్, కావ్యలాంటి ఏరుదాటి తెప్పతగలేసే పిల్లలు మన సమాజంలో కోకొల్లలు. కానీ అగమ్యలాంటి వ్యక్తిత్వం ఉన్న మంచి మనిషి పెంపకంలో పెరిగిన ఆమె మరిది, ఆడపడుచు, పిల్లలు అంతటి కృతఘ్నులుగా మారడం చాలా బాధాకరమైన విషయం.

– చిన్నం రామకృష్ణప్రసాద్

*ధర్మాజీగూడెం*

## నమ్మకం-అమ్మకం

*(నాల్గవ బహుమతి 50/- పొందిన సమీక్ష)*

మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే అన్న కౌటిల్యుడి వాక్కు అక్షరసత్యం. అదే అన్ని అనర్థాలకు మూలం. కానీ ఈ నిజం నిజంగా అబద్ధం అయితే ఎంత బాగుండుననిపిస్తుంది. సూరేపల్లి విజయగారి అగమ్య నవలలో కథానాయిక నూటికి నూరు శాతం సంకుచిత ఆర్థిక బంధాలకు అతీతంగా మానవ సంబంధాలలో ఉండాల్సిన ప్రేమ ఆప్యాయతలకు అంకితమైన వైనం అద్భుతం. అగమ్యలాంటి కోడలు కావాలని ఓ అత్తగారు, అగమ్యలాంటి అమ్మకావాలని పిల్లలు, అలాంటి వదినే కావాలని ఆడపడుచులు కోరుకోవడం సహజం. అపుడు వారి కుటుంబాలు నందనవనాలే అవుతాయి. కాని మారుతున్న కాలంలో రూపురేఖలు మార్చుకుంటున్న మమతల్ని బట్టి తనే అగమ్యలా ఎందుకు బాధ్యతలు తీసుకోకూడదు అనుకునే స్త్రీలు అరుదుగా కన్పిస్తారు. అసూయకు ముందే ఆడది పుట్టింది అనుకునే వారికి కనువిప్పు కలిగించే పాత్ర అగమ్యది. ఇంత మంచి పాత్ర సృష్టించిన రచయిత్రి అభినందనీయురాలు.

అఖండమైన సహనంతో అచంచల భక్తితో ప్రేమ, ఆప్యాయతలకు లోటురాకుండా కష్టాల కడలిలో ఉన్న ఒక కుటుంబాన్ని ఎంత సజావుగా నడుపుకు రావచ్చునో మనసున్న అగమ్య నిరూపించింది.

అడ్డాలనాడు పిల్లలు కాని గడ్డాల నాడు కాదని నిరూపించిన పాత్రలు అఖిల, వివేక్, కావ్య, కార్తీక్‌లవి. రచయిత్రి మాటల్లో అయితే కష్టాలనాడు కాయని హితుల్, సుతుల్, సన్నిహితుల్.... ఎందుకు కాల్చనా. పెంపకంలో లోపం లేకున్నా నమ్మకం అమ్మకం అయిపోయి మానవ సంబంధాలన్నీ ఆర్థిక బంధాలయి ప్రేమతత్వానికి శాపాలుగా మారుతున్నట్లు ఎంతో సహజంగా చెప్పబడిన వైనం నవలలో కొసమెరుపు.

*- యు.భోజరాజు*

*గులపల్యాం*

## అవకాశవాదం-ఆర్థిక సంబంధం

*(ఐదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

సమాజంలో అంతరించిపోతున్న మానవత్వాన్ని మానవ సంబంధాలను, తిరిగి పునరుద్ధరింప చేయడంలో తన వంతు బాధ్యతగా అగమ్య లాంటి చక్కటి నవలను అందించిన చతురకి నా ధన్యవాదాలు. మానవత్వానికి మరో మహోన్నత రూపం అగమ్య. మూర్తీభవించిన మంచితనానికి ప్రతిరూపంగా ఆమె చేసిన సేవలు అనిర్వచనీయం. మనిషిని మనిషి అభిమానించడానికి, ప్రేమించడానికి మధ్య చుట్టరికమో, బంధుత్వమో ఉండనక్కరలేదు. కేవలం మానవత్వం, మంచితనము ఉంటే చాలు. అత్తమామలను తల్లితండ్రులుగా భావించి ఆదరించే అగమ్యలాంటి కోడళ్లు ఉంటే ఎందరో అత్తమామలు వృద్ధాశ్రమాలలో ఆశ్రయం పొందవలసిన అవస్థ ఉండదు. అగమ్యలో ప్రతి సన్నివేశం, మనసుని కదిలించేలా ఉంది. అగమ్య ఆత్మవిశ్వాసం ముందు, అవకాశవాదులుగా మారిన ఈ బంధువులు ఎప్పటికీ గొప్పవారుకాదు. నీ నా అనే భేదం లేకుండా అంతా తనవారే అన్న ఒక్క ఆలోచనే ఆమెకు కొండంత బలాన్ని ఇచ్చింది. కాని చివరి నిమిషంలో ఆత్మీయులు అవకాశవాదులుగా మారి ఆమెకు సహాయం చేయడానికి కూడా ముందుకు రాలేదు. అప్పుడు మానవ సంబంధాలు ఆర్థిక సంబంధాలుగా మారాయి. కష్టాలు తన వెంట ఉన్నా వాటిని ఇష్టాలుగా భావించి కన్నీళ్లను ఆనంద బాష్పాలుగా మార్చుకున్న అగమ్య పాత్ర చదువుతున్నంతసేపు కళ్లు చెమర్చాయి.

*- వి.వి.యస్.మహలక్ష్మి*

*చీపురుపల్లి*

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78



ఈ సారి వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్, ఏ వంటకమైన

వండాలనుకున్నప్పుడు సంసిద్ధంగా ఉండే 'ప్రియ' వారి శ్రేష్ఠమైన అల్లం

వెల్లుల్లి, చింతపండు పేస్ట్‌లను వాడండి. అత్యంత పరిశుభ్ర పరిసరాలల

అత్యుత్తమ పదార్థాలతో తయారు చేసిన పేస్ట్‌లు ఇవి

మీ ఇంటి రుచులను మైమరపించే

ఈ ప్రియ రుచుల్ని ఆస్వాదించండి.

**priya**

*Culinary Pastes*

## అత్యుత్తమ పదార్థాలు
## నోరూరించే రుచులు!

priya Tamarind Paste

priya Ginger & Garlic Paste

priya Garlic Paste

priya Ginger Paste

• అల్లం మిశ్రమం • అల్లం-వెల్లుల్లి మిశ్రమం • వెల్లుల్లి మిశ్రమం • చింతపండు మిశ్రమం